# PREFACE.

The Author of this book, Peddada Nagarazu Garu, was a very great Sanskrit and Telugu scholar and poet, and was for a long time pleader in the *Adalat Court* at Rajahmundry and the *Provencial Court* at Masulipatam. He was my great-grandfather on my paternal side and I find myself fortunate in the honour reserved to me by its publication. His son and my grandfather, Mallikarjunudu Garu, being too young when the author died, all his extensive library together with his works was totally neglected and has consequently perished. At length, I was able to get a manuscript copy of the book from Guruzada Sreeramamurty Pantulu Garu, the author's brother's grandson, who in the course of conversation mentioned about it to me one day. Although the printing of the book was entrusted to the Proprietors of the Ananda Press long ago, its publication was delayed till now, for some reason or other and my own long serious sickness. It has been however ordained that my completing and taking the B. A. degree and the publication of this, my great-grandfather's work, should take place in the same year. I am only sorry that my father who was living at the time when I obtained the manuscript copy of this book and was writing it out for publication and Mr. Guruzada Sreeramamurty Pantulu to whom I am much indebted for the manuscript copy, and who both were so very anxious to see it in print, were not able to see it so afterall.

The merits and demerits of the book will be better judged by the readers themselves. The book is evidently

written on the lines of the renowned Peddanna's Manucharitramu. If Kristnakavi's Sakuntalaparinayam published by the proprietor of the Vijayanti Press deserves to be called "*Pinnavasucharitramu*" this book should be called "*Pinnamanucharitramu.*" The style of the book is very chaste and good and is entirely without mistakes. The author was a very great Sanskrit scholar and as such his work contains more Sanskrit than Telugu words. The theme in the book closely follows that in the Mahabharata and the book does not contain one single idea, borrowed from Kalidasa's Drama as Kristnakavi's book does in several places. The work is a Mahakavyam, as it has all the necessary qualifications of such under the rules of rhetoric. I have taken great care to publish this book without mistakes and shall correct all such blunders as might have crept into, in a second edition of it if it fortunately comes to be edited a second time. I am very much indebted to M. R. Ry. Vaddadi Subbarayudu Garu and Akundi Vyasamurty Sastry Garu who have helped me a good deal in correcting the proofs, when I was busy with my studies for the History branch of the B. A. degree examination.

COCANADA, August 1900. — K. R. V. KRISHNA RAU.

# పీఠిక.

ఈ గ్రంథము గోదావరి మండలములోని వీరవాసరమని ప్రకృతిమున వ్యవహరింపఁబడుచున్న వీరాసనగ్రామవాస్తవ్యులును, గౌతమగోత్రులును, నాప్రపితామహులును నగు పెద్దాడ నాగరాజుగారిచే రచియింపఁబడినది. నాపితామహులగు మల్లికార్జునుఁడుగారి బాల్యముననీయన స్వర్గస్థుఁడగుటచే మాయింటనుండెడి సంస్కృతాంధ్రగ్రంథములన్నియు శిథిలములైపోయి యెట్టెటులో యీగ్రంథము ప్రతియొకటి కృతికర్తసోదరుఁడు గంటలరాయుని మనుమఁడగు శ్రీగురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారికి లభించినది. ప్రసంగవశమున నొకనాఁడు శ్రీరామమూర్తిపంతులుగారీగ్రంథమును గూర్చి మాటలాడుచు నాకీగ్రంథము నొసఁగి విద్వత్కవియగు నాప్రపితామహుని గ్రంథమును నేనే యచ్చొత్తించి ప్రకటించు భాగ్యము నాకుఁ గలుగఁజేసిరి. నేనీగ్రంథమును మిక్కిలి శ్రద్ధతో వ్రాసి ముద్రింపవలయునని యెంత యత్నించినను రెండవప్రతి లభింపకపోవుటచే నాలస్యము చేయవలసివచ్చినది. తుదకు నేను పట్టపరీక్షయందు సంపూర్ణముగాఁ గృతార్థుఁడనై శాస్త్రిబ్రహ్మచర్యపదవి నందుటయు, నీగ్రంథము పూర్తియగుటయుఁ గూడ నొక్కసారి చేకూడవలయునని పరమేశ్వరుని యుద్దేశము కాఁబోలును గాన నేఁటికీగ్రంథముద్రణము సంపూర్ణమైనది. విద్వత్కవియునమాత్యశేఖరుఁడును నై కీర్తివడసిన నాప్రపితామహుని గ్రంథమును నేనచ్చొత్తింపఁ గలుగునట్లనుగ్రహించి నందులకుఁ బరమేశ్వరున కనేక వందనము లాచరించుచున్నాఁడను. కాని యీగ్రంథము ముద్రితమగుటఁ గాంచఁగోరిన నాతండ్రిగారగు నాగరాజుగారును నాకీగ్రంథమును లభింపఁజేసిన శ్రీరామమూర్తి పంతులుగారును నిదిముచ్చొత్తింపఁబడి యుండుటఁ గాంచి సంతసించు భాగ్యమాత్రము గలుగకపోయినది.

ఈ కవితండ్రి సూరయామాత్యుఁడు, తల్లిసావిత్రమ్మ. ఈయనఆ 1760 సంవత్సరప్రాంతమున జన్మించి ఆ 1825 వ సంవత్సరమునకు సరియగు వ్యయ సంవత్సరమున జ్యేష్ఠ బ ౮ దినమున స్వర్గస్థులైరి. ఈయన ముప్పది సంవత్సరముల పర్యంతము మొగలితుఱ్ఱులో శ్రీకలిదిండి తిరుపతి రాజుగారియొద్ద విద్వత్కవిగానుండి

వారిచే ననేక బహుమానములనంది ఆ 1802 సంవత్సరమున రాజమహేంద్రవరమున "అదాలతోకోర్టు" లో న్యాయవాదిగానుండి తరువాతఁ గొంతకాలము కృష్ణామండలములోని మచిలీబందరున "ప్రొవెన్షల్" కోర్టులో న్యాయవాదిగా నుండి యనేకమంది జమీందారులచేఁ గోమరాజుపాలెము తుపాకులగూడెము లోనగు గ్రామములు మొదలగు పెక్కు బహుమానములనంది సంస్కృతాంధ్ర భాషలయందును, సంగీతమునందును నఖండపాండిత్యమును సంపాదించియు భయభాషలయందును ననేక గ్రంథముల రచించి వీరవాసరమున భద్రకాళీ ప్రతిష్ఠయు, శృంగవృక్షగ్రామమున శివాలయమును, ఇరుసుమండలో ధర్మారామమును వీరవాసరమున దనసోదరుఁడగు గంటలరాయుఁడుగారిపేర నొకతటాకమును నిర్మించి సప్తసంతానప్రాప్తిఁగ్రమముగా వడసి వదాన్యశిఖామణియని ప్రసిద్ధిఁగాంచెను.

ఈయన "చ॥ .సూరిమం। డలహితముఖ్యకార్యధురీణాకుశలాత్ముఁడ నాఁగ రాజునా వెలసిననాఁడ" నని యీ గ్రంథమున వ్రాసికొని యుండుటం జేసి ఆ 1802 వ సంవత్సరమున రాజమహేంద్రవరమున నదాలతోకోర్టులో న్యాయవాదిగాఁ బ్రవేశించిన తరువాతనే యీశకుంతలాపరిణయము రచియించెనని నిశ్చయింప వలసియున్నది. మఱియు నీకవి సంస్కృతాంధ్రములలో ననేకేతర గ్రంథములు రచియించెనుగాని యీయన పుత్రులగు మల్లికార్జునుఁడుగారు బాల్యులగుటచే నవియన్నియు నశించిపోవుటయేగాక నామమాత్రావశిష్టములైనఁ గాక పోయినవి.

ఈశకుంతలాపరిణయకథ మొదట భారతాదిపర్వమున సంక్షేపముగాఁ జెప్పఁబడియున్నది. పిమ్మట కాళిదాసుఁడు దానిని గొన్నిమార్పులతో దృశ్యప్రబంధముగారచించెను. అనంతరము పదునేడవ శతాబ్దమున బిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు తెనుఁగునఁ బ్రబంధముగా నొనర్చెను. తదనంతరమించుమించు పదునెనిమిదవ శతాబ్దారంభమున నెల్లూరు మండలమున జిఱుమామిళ్ల పాపయ్యకుఁ గృతిగాఁ గృష్ణకవియొక శకుంతలాపరిణయమును గోదావరీమండలమున గుయ్యేటి గ్రామవాసియగు పిండిప్రోలి లక్ష్మణకవియొకటియుఁ బ్రకృత గ్రంథకర్తయొకటియు మూఁడుప్రబంధములు రచించిరి. వీరుముగ్వురును సమకాలీనులగుటచే నొకరిగ్రంథమును మఱియొకరుచూచి తమతమ గ్రంథములను వ్రాసిరని తలఁపవీలులేదు. పినవీరభద్రుని శకుంతలాపరిణయమైనను గోదావరీమండల వాసులకలభ్యముగానున్నది. కృష్ణకవి

కిదియొకవేళ దొరకినదొరకి యుండవచ్చును. పిదప ఆ 1890 సంవత్సరమున కృష్ణామండలములోని గుంటూరునివాసులగు విద్వాన్ మాడభూషి వేంకటాచార్యుల వారు "భరతాభ్యుదయ" మను నామమున వేఱొండుగ్రంథమును రచించిరి. మఱియు విశాఖపట్టణమండలమున నొకకవి యొక శకుంతలాపరిణయమును రచియించెనని తెలియవచ్చుచున్నది. ఇందఱు కవిపుంగవు లీయొక్కకథనే కైకొని యనేకవిధములఁ దమనేర్పుజూపుచుఁ బ్రబంధములను రచియించుటం జేసి స్త్రీపురుషులు ముఖ్యముగా నేర్చుకొనఁదగిన పతిభక్తి సూనృతవ్రతాచరణము మొదలగు నీతివిశేషముల కిది యాకరమని వేఱుగఁ జెప్పనవసరములేదు.

ఈకథను గాళిదాసుఁ డొకవిధముగాఁ గల్పించి నాటకముగా విరచించె. కృష్ణకవి మఱియొకరీతిగాఁగూర్చి ప్రబంధమొనర్చెను. ఈనాగరాజామాత్య కవి వరుఁడు భారతముననున్న మూలకథను మార్పుగావింపక యనేకచిత్రవర్ణనములతో నీమహాప్రబంధమును రచియించెను. ఈయనకవిత్వము మూఁడువంతులకంటె నెక్కుడుగ సంస్కృతపదభూయిష్ఠమైయున్నను గైశికీవృత్త్యాశ్రయమై వైదర్భి రీతితోఁ గదళీపాకముగా వినువారివీనులకు విందులుగొలిపెడు లలితమగు మృదుపదములతోఁ గడుమధురముగానున్నది. మనుచరిత్రము ననుసరించి యీకవి యీగ్రంథమును రచియించెను. పెద్దనామాత్యుఁడు మనుచరిత్రమున వరూధినీప్రవరాఖ్యుల సమావేశసందర్భమున వర్ణించిన విధముననే యీకవి మేనకావిశ్వామిత్రసమావేశ సందర్భమునఁ గడురమ్యముగా వర్ణించెను. గుణమణులచే మిగులఁబ్రకాశించుచుండుటచే నిందు దోషలేశములు మృగ్యములు.

"చ॥ తెఱవమొగంబు సౌరు, నడతీరు, కనుంగవడాల్చెడంగు, ముం
గురులమెఱుంగు, గుబ్బకవగొప్పతనంబు, గళంబుసొంపు, వా
తెఱరుచిపెంపు, చెక్కుగవఁదేఱినయందముఁ, గౌనుచందముల్,
నెఱిజఘనంబు సంపదగణింపఁదరంబె విధాతకేనియున్."

అ౧-౧౫౭ పద్యము.

అను నీపద్యద్వితీయపాదమున "ముంగురులనుపదము రేఫఘటితమయ్యుఁ దెఱవ లోనగు శకటరేఫప్రాసత్రయముతోఁ గూర్పఁబడినది కావున మూఁడింటి కొక్కటి చేర్పవచ్చునను మతాంతరసిద్ధాంతముచే నీరేఫద్వయప్రాసప్రయోగము దూష్యముకాదు.

గీ॥ ఇందువంశజమణిభవాదృశులయిట్టు । లనృతమాడఁగనితరులననఁబ నేమి॥

ఆ౩-౨౮౧ పద్యము.

మ॥ మత్పురాచరితపుణ్యంబట్టిదై యుండన । ల్పమదిందూఱఁబ నేమటంచు సుతు
కేలంబూనిఖిన్నాత్మయై॥ ఆ౩-౨౫౭ పద్యము.

అను నీరెండుపద్యములయందును "బనేమి" యనునెడ నిత్యసంధి గావింపఁబడియె. "ననఁగనేల, దూఱఁగనేల" యనిసవరించినచో నేమియు విపరీతముండదు.

కాకినాడ,
ఆగష్టు 1900.

కొచ్చెర్లకోట - రామచంద్రవేంకటకృష్ణరావు.



శ్రీరామజయం

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# శకుంతలా పరిణయము.



వాణీవర నాసవాదిసురరాజి ప్రార్చితాంఘ్రిద్వయీ
సేనానాగసుశేషమోహనుత సంసిద్ధిక్రియాశాలియై
భావింపం దగు లోకరక్షణకళాప్రావీణ్యగణ్యుండు కాఁ
డు శ్రీమతో నను సుభశ్రీయుక్తునిం జేయుతన్.

ఉ. అక్షయభోగశాలిని మహాశ్రుతిమస్తక నాట్యశాలికా
లక్షితరూపలక్షణ కళానుహిమోన్నతి భక్తజాలసం
రక్షణభద్రవీక్షణపరంపర లోకముతల్లియౌ విశా
లాక్షి గరంబు మామకమనోభిమతార్థసమృద్ధిఁ గూర్చుతన్. 2

చ. కనుఁగొనఁ జేరెదం బుడమికాను పుచన్న నకుంకుమద్యుతిన్
బెనఁగొను శ్రోత్తముత్తియపుఁ బేరు సముజ్జ్వలసాంగ్లరక్తిమం
బెనసినరాగకాళి యన నింపెసలారెడి నేఁ నవంశపా
ననుఁ దశరామచంద్రుఁ డనచాల్యకృపారసదృష్టిఁ బోచుతన్. 3

సీ. మున్నీటిమొలనూలిముదగర్భము చల్లనిది యన్నయెన్నికఁ బొదలఁబెంచె
రెండైదుతేరులదండిరాతోలిచూలి కనువుగానిలుచేని తనమునిలిపె
సెకకంటిదొరగవింటి చిద్రుపలుననకు నుంకువ యని జగమాడి కొనఁగ వెలసెఁ
దొలిమేన నోఁచునోములపంట నాశిది యని తండ్రి తనుఁ గొనియాడ మెఱసె.

తే. మొగులు తెగఁబాయని మెఱుఁగుమొత్తమటులు
మగనిడాచక్కి వెలసె నేసొగసుఁదన్ని
గిముదొరసాని యారాముగేస్తురాలు
పుడమికానుపు సిరులిచ్చి బ్రోచుఁగాత. 4

మ. పలుకుంబోటికరంబుఁగేలఁ గొని యాపద్మాక్షి వ్రీడాభరం
బొలయం బోకు మపూర్వచిత్రకథ యొం డొప్పం బ్రసంగింతు మి
క్కిలి ప్రేమం గనుమంచుఁ దన్మిషమునం గెమ్మోవిఁ జుంబించు నా
నలినాక్షీహృదయేశ్వరుండు నను నంతర్వాణిగాఁ జేయుతన్. 5

ఉ. చేవిలసిల్లు రాచిలుక చెచ్చెర బింబమనీష నొక్కఁ గ
మ్మోవిఁ దలిర్చు గెంటు నలుమోములు వేలుపు గాంచి నవ్వఁ ద
ద్భావ మెఱింగి సిగ్గుతడఁబాటున మోమరవంచు భారతీ
దేవి యొసంగుఁగాత పరిదీప్తకవిత్వవచోవిచిత్రతన్. 6

ఉ. వేదములాదిగాఁ గలుగు విద్యల కొజ్జ యటంచు లోకమా
మోదముతో నిరంతరము ముందు సపర్యల గారవింప న
త్యాదృతిఁ గోరికల్ నెరపునట్టి మహామహిమావలంబు లం
బోదరు నాషడాననసహోదరు నాత్మ భజించి మ్రొక్కెదన్. 7

ఉ. ప్రాకటశబ్దగౌరవము భావగసధ్వని పాకవృత్తు ల
స్తోకముగా జగంబభినుతుల్ పచరింపఁగ రామభారతా
ఖ్యైకకథావిశేషముల నామరభాష రచించినట్టి వా
ల్మీకిపరాశరాత్మజుల మేదురభక్తి భజింతు నెమ్మదిన్. 8

ఉ. వ్యాసముఖోజ్జ్వలన్మధురవాగభివర్ణితభారతం బనా
యాసముచే మనోహరపదార్థగసప్రతిపాదకంబుగాఁ
జేసి తెనుంగుబాసకృతి శిష్టజనస్తుతిఁగన్న నన్నయో
ర్వీసురమౌళి నెఱ్ఱన రవిద్యుతిఁ దిక్కననాత్మఁ గొల్చెదన్. 9

చ. పలుకులతేట భావములపద్ధతి పాకముసొంపు లంక్రియా
కలన సమాసరూఢి రసగౌరవ మర్థము వృత్తి రీతులున్

కలుగ రచించుకబ్బములు కబ్బములెన్నఁగ జల్లిపాల్లుకూఁ
తలు గుదిగూర్చి చెప్పుకవితల్ సరసుల్ వినిమెత్తురే మదిన్. 10

మ. మతిమద్వైదుషిఁ గాకవుల్ పరిభవింపన్ సారె శబ్దార్థసం
గతి నూహింపక తప్పులే వెదక నాకాంక్షింతు రుద్యుక్తి నా
లత చెల్వారఁగఁ దద్ద్వణాగ్రముల ప్రాల న్వచ్చునా గంశక
ప్రతతుల్ సోఁపినఁ బోక మూఁగెడుగతిన్ భవ్యప్రబంధంబులన్. 11

వ. అనియిష్టదేవతావందనంబును సుకవిజనతాభివందనంబును కుకవినిందనంబునుం గావించి నవరసానుబంధబంధురంబుగా శకుంతలాపరిణయంబను నొక్క మహాప్రబంధంబు రచింపంబూని యొక్క శుభవాసరంబున బంధుమిత్రసుహృజ్జనంబులతో నిష్టమృష్టాన్నసంతృప్తుండనై సుఖశయ్య నిద్రించుచుండ నాఁటిరాత్రిచతుర్థయామంబున. 12

సీ. మినువాఁక వలగొన్న గొనబువిన్నెపుఁబైఁ గలికిక్రొన్నెలవంక వెలయువాఁడు
పటికంపునిగ్గుడాపలి మేనఁ దళుకొత్తు నెఱపునీలపుఁజాయ యువిదవాఁడు
తొలిమిన్కునుదువులు వోలఁ గెంపునుకపేరుల నొత్త మఱుతఁజెన్నలరువాఁడు
ననవింటిదంటనెట్టనఁ బూదిగలిపిన కడిఁదిచిచ్చులకన్ను గలుగువాఁడు
తే. చిలువరాజన్నిదపుఁదీవిఁ జెలఁగువాఁడు,
మిత్తిమొత్తినమున్మొన మేటివాలు
వాఁడు కాశీవిహారి విశ్వప్రభుండు,
కనికరంబున నెదుట సాక్షాత్కరించె. 13

మ. ఇనసోమానలలోచనుండిటులు విశ్వేశుండు సాక్షాత్కరిం
చిన హర్షాశ్రుజలార్ద్రలోచనుఁడనై చేమోడ్చి యే నిర్మలో
పనిషద్వాక్యవిశేషసన్నుతులు సల్పన్మెచ్చి యాదేవుఁడి
ట్లనియెం గూరిమితో దరస్మితరుచిప్రాంచన్ముఖాంభోజుఁడై 14

తే. వత్స శుభదము పెద్దాడవంశ మతిప
విత్ర మభినందనీయ ముర్వీస్థలమున
నందుఁ బ్రభవించి సకలవిద్యావివేక
సంపదలఁ బెంపుఁ గాంచినజాణవీవు. 15

వ. సకలజనసంస్తూయమానమనీషావిశేషంబున నాంధ్రభాష నీవు రచించిన శకుంతలాపరిణయం బను మహాప్రబంధంబు మదంకితంబు గావించి కృతార్థుండవు గమ్మని దీవించి యమ్మహానుభావుం డంతర్ధానంబు నొందిన ననంతరంబున నిద్ర మేల్కాంచి కాలోచితకృత్యంబులు సలిపి సభాస్థలంబున కరుదెంచి విద్వజ్జనంబుల కీశుభస్వప్నంబు తెఱం గెఱింగించిన విని సభాసదు లత్యంతసంతోషితస్వాంతులై యమ్మహాదేవుని యనుమతి నట్ల చేయు మిది శుభకరం బని పల్కిన విని యేతత్కావ్యకన్యకారత్నంబున కనుకూలనాయకుండు కాశీవిశ్వేశ్వరుండె యని నిశ్చయించికొని మద్వంశావతారవర్ణనాపూర్వకంబుగ నిక్కావ్యరత్నంబు నా దేవదేవునికి సమర్పించితి. 16

## వంశావళి.

చ. విమలతపోభిరాముఁ డరవిందభవప్రతిమానశేముషీ
సమధికమూర్తి నిర్విషయసంవిదుదంచితుఁ డంతరంగదు
ర్దమరిపుమర్దనప్రవణతాపరిభాసి యహర్ముఖారుణో
పమరుచిశాలి గౌతమతపస్వి చెలంగు జగత్ప్రసిద్ధుఁడై. 17

క. అనఘులు గొందఱు గౌతమ
మునిపతిగోత్రమున మంత్రిముఖ్యులు కరుణా
వనధులు పెద్దాడకులాం
బునిధిసుధాకరు లనంగఁ బొడమిరి పుడమిన్. 18

క. మానితయశుండు దత్సం
తానక్రమముగ జనించె ధైర్యకళాజాం
బూనదశిఖరి సుధీర
జ్ఞానయతత్పరుఁడు పట్టసప్రభుఁడు మహిన్. 19

ఉ. తాసరివారిలో మిగులధన్యతఁ గాంచి చెలంగె వేదవి
ద్యాసురబంధుమిత్రజనపుంజము రంజిలఁ జేయుచున్ నిజో
ద్భాసితసంపదం దనకుఁ బట్టసమంత్రి నిరంతరంబు వీ
రాసనభవ్యనామకపురంబు గరంబది రాజధానిగన్. 20

ఉ. గుట్టున కబ్ధి చెల్వమునకున్ సిరిపట్టి కరంబు దాల్మికిం
గట్టుల ఱేఁడు ధీగరిమ నల్వ వితీర్ణి దినేంద్రసూతికిం

జొట్టను వైభవాప్తిబలసూదనుఁ డంచు గణింపమించె న
ప్పట్టసమంత్రి భూవరసభాపరిష్కృత్యదువారకీర్తియై. 21

ఉ. పండితసార్వభౌముఁడగుపట్టసమంత్రికిఁ గల్గె దానక
ర్ణుండు సుతుం డఖండధృతి కూరికమంత్రిమనోవిభీతికృ
చ్చండభుజాప్రతాపుఁడు వసంతసమాగమఫుల్లమల్లికా
పాండురకీర్తి విశ్వపతి భావభవప్రతిమానరూపుఁడై. 22

క. శ్రీమత్పెద్దాడకుల
గ్రామణియగువిశ్వపతికి గాదిలికొమరుం
డై మహనీయశ్రీ ను
ర్వీమండలి వీరరాజు వెలసెనుగీర్తిన్. 23

క. నిరతాన్నదానదీక్షా
పరతంత్రుఁడు భోగభాగ్యపరిహాసితపురం
దరుఁ డగువీరన చేకొనె
గురుమతి లింగాంబఁ దనకుఁ గులసతి గాఁగన్. 24

క. ఆజంపతులకు విద్యా
భోజమహీజాని సుజనపోషణకరుణా
రాజీవాక్షుఁడు సూరిన
మాజస్తుతకీర్తి సూరమంత్రి జనించెన్. 25

మ. అల పెద్దాడకులాబ్ధిసోముఁడగుసూరామాత్యశార్దూలుఁడ
త్యలఘుశ్రీనిధి నర్సమంబరిణయంబై భోగభాగ్యోన్నతిన్
బలవైరిప్రతిమానుఁడై ప్రబలెదిక్పాలీసమాలీఢని
ర్మలకీర్తిందనుసంభవాష్టకఫలప్రాప్తి న్మహీమండలిన్. 26

సీ. అందగ్రజుండు సీతాంభోజలోచనారమణుండు శ్రీవీరరాజమంత్రి
దృఢకీర్తిశాలి ద్వితీయుఁ డనఘవీరాంబికాపతి యచ్చయప్రభుండు
శ్రీయుతమూర్తి తార్తీయుఁ డమలసీతాంబికాపతి రామయాహ్వయుండు
సుగుణాబ్ధి తదవరజుండు వేంకాంబికాహృదయేశ్వరుండు శ్రీకృష్ణమంత్రి

తే. తదనుజన్ములు రాజాభిధాననాగ
రాజ శరభాఖ్య బుచ్చనప్రభులు వెలసి
రవనిఁబాపమ లక్ష్మి పద్మాక్షి వియ్య
మలనఁదగుకులకాంతల ర్మిలిభజింప. 27

చ. అనుపమకీర్తి వీరసచివాగ్రణి సీతమయందుఁగాంచెఁగాం
చనగధీరు నర్థిసురశాఖిఁ బటీరతుషారహీరచం
దనశరదభ్రశుభ్రకిరణప్రతిమానయశోనిధానునిన్
జినశరభాభిధానుని విశిష్టదృగబ్జనిశాంతభానునిన్. 28

తే. ఆశరభమంత్రిభువనవిఖ్యాతనయులఁ
దనయులను గాంచి యయ్యన యనెడువాని
సూరయాఖ్యుని నిరువుర సూరిజనము
పొగడఁజిరకీర్తిసంపదఁ బొలుపు మిగిలె. 29

ఉ. వీరమయందుఁగాంచె గుణవిశ్రుతుఁడచ్చన పుత్త్రిలన్ మహో
దారచరిత్రులన్ నరసయాఖ్యుని గంగనఁ బాపయాహ్వయు
న్వీరయమంత్రిశేఖరుని నీరజగర్భముఖుంబు లట్లు దు
ర్వారకుమంత్రిగర్వహిమవారిజమిత్రుల భవ్యగాత్రులన్ 30

ఉ. అంబుజబాంధవోపమవిభాంగుడు కృష్ణయమంత్రి గాంచె వెం
కాంబికయందు నందనుల నయ్యప వెంకయఁ జేరయాఖ్యున
బ్జాంబకరూపలక్షణసమన్వితు రామయమంత్రి బంధువ
ర్గంబు నుతింపఁగా నలువురన్ ఘనదానకళాధురీణులన్ 31

ఉ. భౌరవిరాజనాఖ్యునకుఁ బాపమ కిర్వురుపుత్త్రు లంగజా
కారకళాభిరాముఁడగు గంగయ రామయ గల్గి రెన్నఁగా
ధీరులు వార్ధికౌస్తుభవితీర్ణిమణుల్ బలె శుభ్రకీర్తివి
స్తారులభేద్యహృద్యసహజద్యుతిదానకళాధురీణులై. 32

క. వీరలలో నాలవవాఁ
డై రంజిలె నాగరాజహారహంబు సుధా

ధారా శర తారా దర
హారాజరనిమ్నగాసమగ్రయశుండై. 33

సీ. తనయాదిభిక్షుకత్వము మానఁ డించుక ఘనతరాష్టైశ్వర్యకలనఁ బొదలి
తనయనంగత్వంబుఁ దరలఁ జాలఁ డొకింత వరసుమనోధర్మగరిమఁ గాంచి
తనదినదినకృశత్వము మానఁ డావంత యమృతకళావాప్తి నతిశయిల్లి
తననిరంతరభంగదశ వీడఁ డిసుమంత రత్నాకరఖ్యాతి రమణ కెక్కి
తే. యెట్లు సరివత్తురు భవరతీశచంద్ర
సాగరులు భూరివై భవచారుసుభగ
తా విమలకీర్తి సుగభీరతలఁ దలంప
ధరణిశ్రీనాగరాజ ప్రధానమణికి. 34

మ. పరమశ్రీనిధి నాగరాజ సుయశఃప్రాంచత్సుధానిర్ఝరం
బరవిందప్రభవాండభాండమున నిండారంగ నస్తాద్రితో
వరహిం గానక వెల్లి నీదుకొని పోవన్నిచ్చలంభోజినీ
శ్వరపద్మారులకుం దరణ్యుడుపసంజ్ఞల్ సార్థమయ్యెన్భువిన్. 35

మ. ప్రియయౌ లక్ష్మికి నాగరాజునకు ధాత్రీనందనుల్గల్గి ర
వ్యయసత్కీర్తులు సూరయాహ్వయుఁడు నర్సామాత్యుఁడున్మల్లనా
హ్వయుఁడున్సుబ్బయవీరమంత్రిమణి బాపామాత్యచంద్రుండుధ
ర్మయుతాంతఃకరణైకమూర్తి శరభామాత్యేంద్రుఁ డప్పన్నయున్. 36

తే. అనఘగుణశాలినియగుపద్మాక్షివలన
శరభనాఖ్యుఁడు సుతుల మువ్వురను గనియె
రామయాఖ్యుని వేంకటరాయమంత్రి
మౌళి యజ్ఞనామాత్యు సమ్మదముకల్మి. 37

తే. మానితసుకీర్తి బుచ్చయామాత్యమౌళి
యనఘవియ్యమవలన నందనులఁ గాంచె
భూరికరుణాపయోధుల సూరనాఖ్య
సుబ్బయామాత్యకులమణి సుజనులెన్న. 38

మ. ఘనపెద్దాడకులామృతాంబునిధిరాకాచంద్రుఁడౌ నాగరా
ట్తనయాగ్రిమణిసూరయాఖ్యసచివేంద్రస్వామియొప్పెన్ఘనా
ఘన చింతామణి కల్పభూరుహ శిబిక్ష్మాభృ ద్దినాధీశనం
దన విశ్రాణనపోషితార్యజననానాబంధుసందోహుఁడై. 39

సీ. సుమనోనురాగవిస్ఫురణఁగాంచినమేటి యరిమండలమునూభయప్రదాయి
భువనజాతహితైకభూరివర్తనశాలి యనవద్యమనుధర్మాభిమాని
చిరతరద్విజకులాదరణమానితమూర్తి కుశలీకృతాహీనగుణవిహారి
చతురవాణీవశీకృతముఖాంబుజహారి సంపదబ్జేక్షణాజన్మభూమి
తే. ప్రకటితైశ్వర్య శుభయశో భవ్యదీప్తి
పరమసౌభాగ్య వరదాన పటుతరప్ర
తాప గురుమతి సుగభీరతల సుధీజ
నస్తుతికిఁజాలఁడే సూరనప్రభుండు. 40

సీ. తుదిఁగార్శ్యమొందఁడు తొలుదొల్త వసులక్ష్మి వసుమనఃపరంపరలకొసఁగి
కువలయద్వేషంబు దవిలి వర్తింపఁడు ఘనమార్గసంచారగరిమఁగాంచి
సరిలేనిభంగపాటొరయఁడానంతైన బహుజీవనసమృద్ధిఁబరిఢవిల్లి
కులగోత్రములవారిచెలువుఁగుంచఁడొకింత ప్రాజ్యసామ్రాజ్యభారము వహించి
తే. యతనితో సానరుచి గభీరతల వైభ
వమున శశి సూర్య వాహినీవర సురేంద్రు
లీఁడె యని రాజసభల నరేంద్రవంద్యు
సూరసచివాగ్రణి నుతించు సూరిజనము. 41

మ. కృతదక్షాధ్వర కార్య వర్తనుఁడు సాంద్రీభూతభూతిప్రశా
శ్వతుఁ డార్యానుమత ప్రవర్తనుఁడు భాస్వద్గోత్రధర్మప్రియుం
డతులానంత గుణాన్వితుం డతనుమాద్యద్వైరి నిర్భేదన
ప్రతిభాయుక్తుఁడు సూరమంత్రిమణి సర్వజ్ఞుండనం జాలఁడే. 42

సీ. మోమోటపడక తమ్ములఛాయ నిరసించి పలుతెఱంగులఁ గుందములహసించి
హిమశైలగిరులఁ బేరెదబలి [illegible]

కాలిగోరున రిక్కగములఁ బాఱఁగఁ జిమ్మి పలుకుజాణతనాన వాణి గెలిచి
యుత్కంఠరమ సంతసొలఱపు గీటడఁగించి వెలిదమ్మితుటుములఁ జులకఁ జూచి
తే. ఠవరతనమున నెచ్చోట సవతులేక
యెల్లజగములఁ దానయై యుల్లసిల్లె
మహితపెద్దాడసూరయామాత్యవాలి
బుధజనస్తుత్యకీర్తిసుభ్రూమతల్లి. 43

మ. ఇలపై సూరయమంత్రిపుంగవసమాఖ్యేందుం డహోరేవగ
ల్లులుపొందున్ బహురాజశేఖరశిరోలంకారపాదాప్తి వ
ర్ధిలి నానాఁట మహాబుధానుగతమైత్రిన్ నిష్కళంకప్రభా
కలితుండై యతమఃపరిగ్రహణరేఖాస్ఫూర్తిఁ గీర్తింపఁగన్. 44

మ. స్థిరసంపన్నిధి ముంజులూరికులవర్ధిష్ణుండు త్రైలోక్యసం
భరితోదారమహాయశోఘనుఁడు శ్రీమత్పద్మరాజాఖ్యమం
త్రి రహిం బోల్చుఁ దదీయపుత్త్రి సుగుణశ్రీరూపలక్ష్మీమనో
హర సావిత్రి వరించె సూరఘనుఁ డార్యన్ శూలిచందంబునన్. 45

మ. రతి సౌభాగ్యకళానిరూఢి రమ సాంద్రఖ్యాతసంపత్సము
న్నతి విశ్వంభర తాల్మి వాణి సరసానల్పోక్తిఁ గాత్యాయనీ
శతపత్త్రాక్షి సువాసినీత్వగరిమన్ సావిత్రికిన్ సాటిగా
కితరస్త్రీ లెనగాఁగఁ జాలుదురొకో యేనాఁటికూహింపఁగన్. 46

మ. విమలస్వాంతుఁడు సూరయప్రభుఁడు సావిత్రీవధూటీవతం
సమునం దాత్మజులన్ జగన్నుతతనూసౌభాగ్యశోభారమా
రమణీయాంగుల నేవురం బడసె నార్యత్రాణదీక్షామహో
ద్యములం గల్పకభూజపంచకము నయ్యంభోధిరాజున్ బలెన్. 47

క. అందగ్రజుండు వెంకప
చందనమందారకుందశరదిందుశరా
మందయశస్స్వీకృతది
క్కందరుఁడై ప్రబలె నార్యగణము భజింపన్. 48

సీ. శరదంబుధరకంబుహరిదంతకరిదంతనగరాజసురభూజగరిమఁ దెగడి
యరవిందహారకుందశరశీతకరసూతనరఘూతికరహేతిదర్ప మడఁచి

సితపత్త్రిసితగాత్రయతిహీరతతిహారకలికామగురురామకాంతి మీఱి
యురగేంద్రవరచంద్రహరగేహనరవాహహరిసౌరకరిభారమూర్తిఁ గేరి
తే. యఖిలదిగ్దేశకలిత రాజాధిరాజ
రాజదాస్థానభవనాంతరాళనిత్య
విహరణప్రౌఢి విలసిల్లె విబుధులెన్న
వెంకపామాత్యశేఖరు విమలకీర్తి. 49

ఉ. మందత నాస్తి లేదనెడుమాట హుళిక్కి మదంబు మిథ్య చు
ల్కందన మిల్ల కుత్సితము కల్ల యసత్యము సున్న లోభపుం
బొం దనృతంబు చిట్టకపుఁబోకలు దబ్బఱ లౌర కీర్తిమి
న్నందిన వెంకపాఖ్యసచివాగ్రణికిం బరికించిచూడఁగన్. 50

సీ. అద్దంపుబిళ్లలు నిద్దంపుఁజెక్కులు కపురంపుదీవి జఘనతలంబు
చలిగొండయును వెండిమల గబ్బిచన్నులు నిండుపున్నమరాజు నెమ్మొగంబు
కళలీను తెలిదామరలు సోగకనుదోయి యలతారకలు ముత్తియంపుసరులు
దులకించుచికిలివెన్నెలతేట చిఱునవ్వు పలుమురిమురిపంబు గళముసొబగు
తే. చెలమికత్తియ పలుకులకలువకంటి
యమృత మోరెంబు మినువాఁక యాటకొలను
నిఖిలభువనైకసంచారనిపుణతాభి
రామ యగువెంకపసుకీర్తిరాజముఖికి. 51

తే. సరసగుణశాలి వెంకపసచివమాళి
భూరిసంతోషకలన నండూరిరామ
యాహ్వయునికూర్మిపుత్త్రిఁ జేరమ నగస్త్య
రాజువెంకయసుత నిర్వ్వరను వరించె. 52

చ. అలసుగుణాబ్ధి వెంకపమహాసచివాగ్రణిసోదరుండ ని
ర్మలనిగమాగమాదికపురాణకళాచతురుండ సూరిమం
డలహితముఖ్యకార్యరచనాకుశలాత్ముఁడ నాగరాజునా
వెలసినవాఁడ నిచ్చ లరవిందహితప్రతిమానతేజుఁడన్. 53

తే. రూపసుమసాయకుండు లక్ష్మీపతియును
నబ్బలారాతివిభవుండు సుబ్బరాయఁ

డాయతసుకీర్తి గంటలరాయఁడనఁగఁ
బరఁగుమువ్వురు మత్స్యహౌదరులు ఘనులు. 54

సీ. శ్రీరత్నభర్మనిర్మితసౌధగోపురావరణాలయోద్భాసి వారణాసి
శ్రితజనమండలీహృదయసంతాపపర్వతసువేశపరాసి వారణాసి
పరిపూరితాఖిలపరయోగికులమనోవాంఛితఫలరాశి వారణాసి
త్రుటితనానాహరిత్తటసమాగతసుధీవరఘోరభవపాశి వారణాసి
తే. శ్రీమహితవిశాలాక్షీసతీమనోధి
నాథమనుజపనిష్ఠాసనాథసకల
భక్తవర్గాపవర్గసంపత్ప్రదాన
కారణనిరంతరోల్లాసి వారణాసి. 55

సీ. గగనగంగాంబుశీకరజాలవిమలముక్తావిభూషితకపర్దంబువాఁడు
నీలోత్పలప్రభాలీలాపఘనవఘూకమనీయవామభాగంబువాఁడు
శ్రుతివచోమకరందశోభితవిధిశిరఃకమలమాలాన్వితాంకంబువాఁడు
గ్రైవేయఫణిఫణాగ్రవినూత్నరత్నపుంజద్యోతమానవక్షంబువాఁడు
తే. సకలబర్హిర్ముఖశిరోగ్రమకుటతటవి
లసదసితమణికిరణరోలంబమిళిత
చరణకమలద్వయమువాఁడు చిరదయాస
నాథుఁ డగుకాశికావిశ్వనాథుఁ డలరు. 56

శా. ఆకాశీపురవిశ్వనాథుఁడు విశాలాక్షీమనోభర్త లో
కైకత్రాణపరాయణుండు శ్రుతివిద్యాహృద్యవిద్వన్మన
శ్శోకారణ్యధనంజయుండు విబుధస్తోత్రవ్యదీవ్యద్గుణ
వ్యాకీర్ణుండు వసించుఁగావుత మదీయస్వాంతపద్మంబునన్. 57

## షష్ఠ్యంతములు.

క. ఏతాదృశసద్గుణసం
ఘాతోలతారామునకు జగద్భయదబలో
పేతపురాసురహరణ
ఖ్యాతజయోద్దామునకు దయాస్థేమునకున్. 58

*క. శరణాగతశరణాయిత
చరణాబ్జాతునకు భక్తసంసారవిష
ద్ధరణాదరభరణాంతః
కరణాన్వీతునకుఁ గరిముఖప్రీతునకున్. 59

క. గంగోత్తమాంగున కుమా
సంగున కార్త్యేక్షణాంబుజపతంగునకున్
రంగదవనీశతాంగున
కంగజమథనస్ఫుటానలాపాంగునకున్. 60

క. భూరిచతుర్దశజగదా
ధారున కంహోగదాగదంకారునకున్
సారగ్లౌచూడాలం
కారున కమరారిసమరగంభీరునకున్. 61

క. సాహసరిపుశిక్షాస
న్నాహునకు సితాభ్రిచందనజ్యోత్స్నారు
గ్దేహునకున్ జుష్టసుర
వ్యూహునకున్ గరళపారణోత్సాహునకున్. 62

క. దక్షకృతక్రతుశిక్షా
దక్షునకు నిరంతరావితముముక్షునకా
ర్యాక్షీణాంహఃకరిహ
ర్యక్షునకుం గాశికాపురాధ్యక్షునకున్. 63

వ. సమర్పణంబుగా నారొనర్పంబూనిన శకుంతలాపరిణయంబను మహాప్రబంధంబునకుఁ
గథాప్రారంభం బెట్టిదనిన. 64

## కథా ప్రారంభము.

ఉ. శ్రీకరమై యశేషమునిసేవితమై ఫలపుష్పపల్లవా
నోకహశోభితంబయి మనోజ్ఞమధువ్రతకీరశారికా
కోకిలకేకిసారసశకుంతనికాయనినాదమేదురం
బై కనుపట్టు నైమిశమహావని సర్వజగత్ప్రసిద్ధమై. 65

ఆ. అనటఁగల్గుశౌనకాదిమునీంద్రులు
సుగుణసాంద్రు లతివిశుద్ధచరితు
లనఘమతులు రౌమహర్షణిఁ గనుఁగొని
పలికి రొక్కనాఁడు ప్రమద మెసఁగ. 66

చ. ఎఱుకయుఁ బాడియున్ ధృతియు నేపును జేవయుఁ గల్గిలోకము
ల్గెలిచికొని తన్నుఁ గొల్వఁగఁ జలీకృతవైరిచమూసమూహుఁడై
తఱుఁగనిసంపదన్ సకలధారుణి నేలినయట్టివాని మా
కెఱుఁగఁగఁ జెప్పు తొల్లిటిమహీశులలో మహిమాభిరామునిన్. 67

క. అన విని సూతుఁడు వినయా
వనతాననుఁ డగుచు మౌనివల్లభులఁ గనుం
గొని కేలుమోడ్చియభివా
దనమొనరిచిపలికె మృదుసుధామధురోక్తిన్. 68

సీ. ఋభుసరిత్కోకకార్కఘృణిసంశయాపాదిజలజరాగచ్ఛవిచ్ఛన్నసౌధ
మవితబర్హిసవిద్యుదభ్రవిభ్రమదసుభ్రాయుక్తనీలశిరోగృహాళి
మైందవమృగతృణబృందసందేహకృద్గారుడాశ్మప్రభాగారచయము
సౌరాగమధుపాబ్జశంకాకృదురునీలజలఖేయమధురసాకలితవరణ
తే. మనుదినచకోరనికరసమగ్రచంద్ర
చంద్రికాభ్రాంతికారివిశాలహీర
మణిగభస్తిపరిభ్రాజమానగోపు
రంబ ధిష్ఠానపుటభేదనంబు దనరు. 69

మ. ఘనచంచూపుటసంగృహీతదివిషద్గంగార్ధురాంభోజనూ
తననాళచ్ఛట మాచు నన్నగరికాంతాపాదవిన్యాసతు
ల్యనిరూఢిం దగ నంచపిండు సురసౌధాగ్రంబులన్ వ్రాలెనో
యనఁ జామీకరదండమండితపతాకానీక మొప్పారెడున్. 70

చ. తెఱవలు సౌధవీథికలఁ ద్రిమ్మరుచుం ద్రిదశద్రుసూనముల్
బిఱబిఱఁ గోయఁగాఁ జెదరి భృంగపరంపర ఝుంకృతిధ్వని
న్బఱవఁగ మింటఁ గన్గొని ఘనస్తనితాన్వితమేఘశంకఁ బ
ల్మఱు నటియించుఁ బోషితకలాపితతుల్ పుటభేదనంబునన్. 71

సీ. వరసుమనఃపరంపరల కాశ్రయభూమి సరసపల్లవవికాసముల కిరవు
శ్రుతిహితోక్తిద్విజస్తోమంబునకు చెంకి యామోదసంపదకాటపట్టు
మవ్యంపుఁగలికికొమ్మలకు జన్మస్థాన మాభవ్యతరుల కత్యాస్పదంబు
సురుచిరాబ్జాలయాస్తోకలీలకు నెల వలఘుఫలావాప్తికాకరంబు

తే. నవరసద్రవ్యవిభవంబునకుఁ గొటార
నూనగణికావ్రజంబున కునికిపట్టు
నంగఁ బొగడొందు జనములెన్నంగ నప్పు
రావతంసంబు తత్పురోద్యానసమితి. 72

మ. పురిమత్తేభఘటల్ కరప్రతతిచేఁ బూరింప జీర్ణాపయై
సురకల్లోలిని దొంటిచందము వహించున్ సౌధవాతాయనాం
తరముల్ డగ్గఱి తొంగిచూచు నృపకాంతావక్త్రచంద్రప్రభాం
కురముల్ సోఁకి కరంగు తచ్ఛశిశిలాకుంభీభవద్వాస్స్రుతిన్. 73

తే. నగరిసౌధసుధాంశు లంతఃకళంక
మమలముగఁ జేయుచోఁ దారకాధినాథుఁ
డదిమొదలుగాఁగ భువనంబు లభినుతింపఁ
జెలఁగె హరిణాంకనామప్రసిద్ధి జగతి. 74

చ. అతిముఱిఁ బాణికంకణము లందియలున్ మొరయంగఁజెక్కులం
జిఱుచెమటల్ సెలంగ సరసీజదళేక్షణ లాటపాటలం
దఱుచువిహారముల్ సలుపుతన్నగరీహరినీలసౌధము
ల్వాఱులు సగర్జితాల్పతరవారితటిజ్జలదంబులో యనన్. 75

ఉ. నందనసీమ వేల్పుచెలనాగలతో విహరించుకాముకుల్
సెందినవేడ్కఁ జిట్టకపుఁజేష్టలఁ దక్కటివల్వ లూడ్వఁగా
నందఱిసిగ్గు నిల్పు మని హర్మ్యసమున్నతకేతుశాటికా
బృందముఁ గట్టనిచ్చె నగరేందిర జాత్యభిమానధుర్యయై. 76

క. ఖరకరఘోటకనిష్ఠుర
ఖురటంకప్రహతి వరణగోత్రభిదుపలో
త్కరము పరిఖఁ బడఁ దజ్జల
చరతతి మెసవంగఁ దివురు జాంబవశంకన్. 77

సీ. అన్నియు నిరుపమానామూల్యగోత్రభిన్మణివికీలితకుట్టిమస్థలంబు
లన్నియు భువనమోహనవిభావిస్ఫుటస్ఫటికోపలాలితసౌధవీథు
లన్నియు వాలవాయజచిత్రితకవాటకుడ్యవితర్దికాగోపురంబు
లన్నియు నుడుమనోహరశిలాఫలకసంకీలితకేళీనికేతనంబు
తే. లన్నియును వజ్రగోమేధికాబ్జరాగ
రచితకళ్యాణమంటపప్రాంగణంబు
లన్నియును మౌక్తికవితానహాటకోద్య
దభినవాస్థానరంగంబు లప్పురమున. 78

చ. తగఁడు పదక్రమస్ఫురణఁ దాల్ప భుజంగమవల్లభుండు నా
లుగుతెరువుల్ విధాత కీఁక లోకమునందున వేదశాస్త్రపా
రగు లన మించుమాకు సరిరాఁగల రెవ్వ రటంచునంద్రు భ
ద్రగుణగరిష్ఠు లన్నగరిబ్రాహ్మణు లాత్మవిభానభోమణుల్. 79

చ. ఉరుసుమనోనురాగకృదనూనకళాగరిమన్ మదారిసం
హరణబలోన్నతిం గువలయావనచాతురి వాహినీపరో
ద్ధరణగుణప్రసక్తి సముదంచితసత్పథవర్తనంబునం
బురిఁ దగు రాజమండలము భూరిరమాసహజప్రసిద్ధమై. 80

చ. వనజహితాజ్ఞఁ బూని నిలువంబడనీక తదీయసూతుఁడో
య్యన నడపింప వే చనుతదశ్వపథశ్రమమార్చు నిచ్చలున్
ఘనధనకోటు లేర్పఱిచి కౌతుకలీలఁ బురీకిరాటులై
త్తినతపనీయదండపరిదీప్తపటాగ్రమరుత్కిశోరముల్. 81

చ. హలకులిశాదిలక్షణసమన్వితమై హరిపాదపద్మము
య్యలఘుతరాంఘ్రిఁ బుట్టినను రాపగ హారిమితోడఁబుట్టువై
వెలయ జనించి సంపదల విశ్రుతిఁగాంచినమాకు సాటి భూ
తలమున నెవ్వరంద్రు గురుధైర్యసురాద్రులు శూద్రు లప్పురిన్. 82

క. పరచక్రవర్ధనోద్ధతి
హరిపదగతిచతురతయు మహానంతమణి
స్ఫురణమును గల్గి రవిరథ
గరిమన్ విలసిల్లు నన్నగరియరదంబుల్. 83

మ. అరుదౌ నాత్మకటప్రదేశమదధారాస్వాదనోజ్జృంభబం
భరఝంకారరవంబుతోఁ గరిఘటల్ బల్మాఱు మోమెత్తి పు
ష్కరదేశాబ్జవిహారకేళికయి వే సాఁచుం గరశ్రేణి పు
ష్కరదేశాబ్జవిహారకేళి దమకుం గర్తవ్య మాటంబురిన్. 84

చ. అనవరతం బిసుం గడఁగి యప్పల ముంచుతదీయవాజిఁ జే
ర్కొనక నిజాంఘ్రివేగమునఁ గూడఁగలే కనిలుండు ఖంజతన్
గొన విహరించు తన్నగరఘోటకపంక్తి కొకింత సాటియా
ననువుగ నిర్జరాధిపహయం బది వెల్వెలఁ బోవకుండినన్. 85

చ. చలముమెయి న్నివాతకవచప్రతిరోధి భయానకోద్ధతిం
బలుపిడు గైనఁ జేనొడిసిపట్టుదు రేచి మహోగ్రుఁడైన దో
ర్బలమునఁ దాఁకి వెన్నొసఁగి పాఱఁగఁ బోరుదు రాహవక్షమా
తలవిజయాంకులై వినుతిఁ దాల్చినవీరభటోత్తముల్ పురిన్. 86

చ. అలికులవేణులార చెపుఁడా యిపుడూరులు గానరా పదే
యలవడు చేలచాలు పథమారయు బెట్టు లెఱుంగరొక్కొ భూ
స్థలి నతనుప్రదేశముల జాడ లెఱింగినజాణలంచుఁ బాం
థుల నిటు నర్మసూక్తిఁ బరితోష మొనర్తురు శాలిపాలికల్. 87

సీ. ఘననీలములఁ బూరి గఱపించు నన వేఱె కురులమెఱుంగు వాక్రువ్వ నేల
తొగతేనిఁ గొఱతఁ జెందగఁ జేయు నన వేఱె నగుమొగంబులఠీవిఁ బొగడ నేల
బెళుకుబేడిసల నవ్వలఁ ద్రోయు నన వేఱె క్రేగంటిచూపు లగ్గింప నేల
కనకకుంభములఁ గాఁకలఁ బెట్టు ననవేఱె గుబ్బపాలిండ్లఁ జేర్కొనఁగ నేల
తే. యనుచు నభికావళి పరస్పరానులాప
కలనఁ గొనియాడ సకలలోకప్రశస్త
నవవయోరూపశుభలక్షణములఁ దనరి
పణ్యయువతీజనం బొప్పుఁ బట్టణమున. 88

సీ. జిగికనుబొమలసోయగము చూడ్కుల నాన ధర్మానుగతమైత్రి దరలకున్నె
తెలికన్నుదోయినిగ్గులనీటుఁ గనుఁగొన్నఁ గువలయోపేక్ష లోఁ దవులకున్నె
బిగిగబ్బిగుబ్బలసొగసు వీక్షించిన దుర్గరక్షణకాంక్ష దొలఁగకున్నె
చలియించుచలఁతికొనులఠీవిఁ దిలకింప హరిపదస్మృతిలీల యరుగకున్నె

తే. యని యభినవానురాగమగ్నాత్మ లగుచు
నెలమి సరసాగ్రిణులు నుతియింతు రవ్వ
రమున నాట్యాభినయకళాప్రౌఢి నెఱపు
వెలవెలందులచెలువము ల్గలయఁ జూచి. 89

చ. కరకలితారుణద్యుతులు గ్రమ్మినపాండుసరోరుహోత్కరం
బరుణసరోరుహంబు లని యంచదపాంగవిలోకనోత్కరం
బొరసిన తెల్లగల్వ లసితోత్పలపాళి యటంచు డాయు న
ప్సరివిటకోటి నవ్వుదురుప్రౌ చతురోక్తులఁ బుష్పలావికల్. 90

క. ఆపట్టణమున కధిపతి
యై పరఁగు నిజప్రతాపహతనానాది
గ్ద్వీపస్థితవిద్విషదవ
లేపుఁడు దుష్యంతనృపతి లీలఁ జెలంగన్. 91

సీ. పరధరాధిపగర్వహరణభీకరమూర్తి యార్యానుగతమైత్రి నమరుజాణ
సరసవాగ్విహృతి నాస్యమున నిల్పినప్రౌఢ కువలయప్రేమ నూల్కొన్నవలఁతి
ఘననిధానసమృద్ధిఁ గాంచినబలుదంట మధురధర్మావాప్తి మలయుసుకృతి
బహువాహినీవ్యాప్తిఁ బరిఢవిల్లినమేటి పటురత్నకటకసౌభాగ్యశాలి
తే. భోగసురవల్లభుఁడు కళాపురవిరోధి
ధీవిధి యశోవిధుండు వితీర్ణిధనదుఁ
డాకృతిమరుండు గంభీరతాబ్ధి ధైర్య
జాతరూపాద్రి యనఁగ దుష్యంతుఁ డలరు. 92

క. ఆరాజమౌళి యనయం
బారూఢనిజాంబకోదితానలవిహత
క్రూరాతనుశాత్రవుఁడై
వీరగణాధిపులు దన్ను వేడ్క భజింపన్. 93

సీ. సిరి పెక్కురూపులై చెలఁగె నా హైమభిత్తికల మాణిక్యపుత్త్రికలు మెఱయ
నిజయశం బిరుచక్కి నెఱసె నాఁ బార్శ్వాగ్రవిమలాదర్శగభస్తు లొలయ
గ్రహరాజి శుభదృష్టిఁ గదిసె నా నవరత్నసలలితాభరణరోచులు వెలుంగ
రిపురాజ్యరమలు సేరి భజింప ప్రోల వర్తిలిరి నా వెలవెలందులు నటింప

తే. హృదయరాగంబు వే బయ లెనసెనా వి
శాలజాంబూనదాంబరచ్ఛాయ వెలయ
ఘనసభాస్థలి వందిమాగధులు వొగడ
వేడ్క వసియించి దుష్యంతవిభుఁడు దనర.

చ. తొలకరిమబ్బుడాల్ దొలఁగఁ దోఁియఁగ జాలినమేనిచాయల
న్సలలితకూర్పరస్థలుల నవ్యవనౌషధభూజవల్లికా
వలయము లుల్లసిల్ల బలవద్ధనురంబకపాణులై పుళిం
దులు జతఁగూడి శీఘ్రగతితోఁ జనుదెంచిరి రాజుఖోలికన్.

ఉ. వచ్చి పరాకు దేవ యని వ్రాలి ధరన్ జయవెట్టి లేచి వే
తెచ్చినచారపప్పు పెరతేనియ కీచకతండులవ్రజం
బచ్చపుఁబచ్చికస్తురియు నాదిగఁ గల్గినవన్యవస్తువు
ల్మెచ్చొదవన్మహీవరునకీనున కిచ్చి యుపాయనంబుగన్.

ఉ. వెండి కరంబు లెత్తి జయవెట్టుచు నిట్లనిపల్కి రేము బల్
గొండలఁ గానలం గలుగుకూరలు గాయలు కందమూలము
ల్పండులు మెక్కి యేయిడుమలం బడ కిన్నిదినంబు లాత్మకుం
బండువుసేయునీదగుకృపం బొడవై తిమిగాదె భూవరా.

తే. ఇంకఁ గానల మావంటియెలుకువాండ్రు
కాపురముసేసి బ్రతుకఁగా నోపరకట
మిత్తి చెలరేఁగి పలురూపు లెత్తెనా మె
కంబు లొనరించునిడుమలకతన సామి.

తే. వరుస మున్నీటితరగలు వానచినుకు
లిసుము రిక్కలు లెక్కింపఁ బోనఁగుఁ గాని
కానమెకములఁ జేర్కొనఁగాఁ దరంబె
నలువకైనఁ బుడమిఁదాల్చుచిలువకైన.

తే. కానఁ బుట్టినవారముకాని తాత
తండ్రుడు లెఱఁగింప వినము గద్దఱిమెకంబు
లిట్లు నలుగడ నిండి నేలీనినట్లు
ప్రజల వెతఁబెట్టు నని ధరారమణ తొల్లి.

మ. కలఁచెన్ శాలివనప్రదేశములు వీఁక న్మార్గముల్ గాచి పాం
థులఁ గూల్చెం బొలియించె నాలపరిఁదోడ్తో నూళ్లలోఁ జొచ్చి శే
యలుకం బూని సబాలవృద్ధముగ మర్త్యశ్రేణిఁ బోకార్చెఁ బు
94 ష్పలతాపల్లవ శోభితోపవనముల్ భంగించె సుగ్రాకృతిన్. 101

మ. హరిసందోహము లెందు నేయెడ మదవ్యాఘ్రంబు లెవ్వేటఁ గా
సరసంఘాతము లేదెసన్ శరభపుంజం బెచ్చటన్ లోకక్షీ
కరషండాలము లేకడం గిటితతుల్ గన్పట్టుఁ దత్తద్ధ్వని
95 ర్భరసాదార్భటి భూధరంబు లగలింపం జాల ఘోరాటవిన్. 102

లయగ్రాహి.

ఎండనక వాననక కండగలమానుసుల నెండొరులఁ జీరికొని నిండుధృతికల్మిన్
96 విండులును గోలలును దండిగను గేలఁగొని కొండగుహలారయుచు బెండుపడ కేము
ద్దండభుజశక్తిమెయి మెండుకొని నల్గడల గుండియలు ప్రేలఁగ నఖండబలవద్వే
దండరిపుషండ రురుగండకవరాహముఖచండమృగకాండములఁ జెండితిమి సామీ. 103

తే. పుడమియీనినచందానఁ గడలఁదిరుగు
97 దుడుకుమెకములు మాచేతఁ బొడవడఁగెనె
బిరుదు గాంచిన నీవంటిదొరలమేటి
పోటుబల్మినిగాక పల్మాటలేల. 104

క. అని పలుదెఱఁగుల విన్నప
98 మొనరించిన లుబ్ధకులకు నుర్వీవరుఁడా
ననమున లేనగ వొలయఁగ
నను మది భయమూనకుండుఁ డావంతైనన్. 105

క. క్షితిపతులకు వేఁట కులో
99 చితధర్మవు దానవఘము చెందదు సేనా
న్వితుఁడనయి వెడలి దుష్టమృ
గతతిఁ దునిమి మీకు వేడుకలు గావింతున్. 106

క. ఆ తేఁడీగతిఁ బొలయఁగ
100 మాఱడిలం బలికి కొలిచియున్న సుభటులం

దేటి కనుంగొని పయనం
బై శేఱ పరుదెండు వేఁట కరుగఁగ వలయున్. 107

మ. అనుచున్ భృత్యుల నిం వ్లకంపి జనపాలాధీశుఁ డాఖేటసా
ధనసామగ్రి వహింప నేపకడ చేతః ప్రీతిమై మీరు మీ
యనుగుంజుట్టలు గొల్వ వేఁటపయనంబై రండు వేగంబ పొం
డని సామంత నృపాళి వీడ్కొలిపి తా నత్యంతహర్షంబునన్. 108

చ. అట సభఁ గల్గువారిఁ గలయంగని యందఱ వీడుకొల్పి యం
తటఁ గనకాసనంబు డిగి నారులు నూరెలఁ బాణిపద్మవి
స్ఫుటనవరత్నకంకణరుచుల్ వెలిఁగ్రమ్మఁగఁ జామరంబు లొ
క్కటి విసరంగ రంగదుడుకాంతశిలామయసౌధవీథికిన్. 109

చ. అరిగి సుగంధిశీతల హిమాంబువులన్ జలకంబులాడి బం
గరుజిగినన్న పువ్వులువఁగట్టి మృగీమదచందనాద్యలం
కరణములన్ భుజిక్రియలఁ గౌతుకమొంది సుఖించి నిద్రచేఁ
గరములరెయిఁ ద్రోచి పానఁగ న్నఱునాఁ డరుణోదయంబునన్. 110

తే. కాల్యకరణీయములు దీర్చి కనకరత్న
రచితసింహాసనమునఁ బ్రాగచలకూట
దీపితవిభావసుఁడు వ్రాలెఁ దేజరిల్లు
ధారుణీవల్లభుని సన్నిధానమునకు. 111

క. పులిబోను మొత్తములు గు
వ్వలదీములు బల్లెములును వాలమ్ములు విం
డులు గురికైదువ లురులును
వలలుం జిక్కములు శునకవర్గముఁ గొనుచున్. 112

తే. వచ్చి పేరోలగంబున వఱలుపుడమి
యేలికను మ్రొక్కి బోయలు మ్రోల నిలిచి
వినయపూర్వకభాషల విన్నవించి
రచటి సభ్యులు డెందాన హాళిఁ బొదల. 113

సీ. కొంకక సింగంపుఁగొదమ నైననెదిర్చి నదమదంబాడు నీమదపువేఁపి
యుఱికి పైఁబడి పంటఁ గఱచి బెబ్బులినైనఁ బడవైవఁజాలు నీభవకమూర్తి

పెనుబందినైనఁ జెంగున దాఁటి మెడవట్టికొని త్రావు నల్ల నీకుక్కురంబు
కాలుదున్నలనైనఁ గఱకుగోరలఁ జెండి ప్రోగులఁబెట్టు నీజాగిలంబు
తే. లేటిదాఁటుల మేటికుందేటిగముల
నరసి చండకములఁగూడ నరిగి గావు
పట్టు నీదెనములవేల్పుదిట్టతేజి
యాడుదుమె కల్ల నీపాదమాన సామి. 114

చ. అని మృగయుల్గరంబు వినయంబునఁ జేతులు మోడ్చి విన్నవిం
చిన నృపుఁ డాలకించి కిటిసింహలులాయమదేభభల్లుకా
ద్యనుపమఘోరజంతునివహంబులఁ గూల్చెదఁ బెక్కుభంగులన్
దునిమెద నల్గడం దొలఁగఁదోలెద నాబెడిదంపుఁదూపులన్. 115

చ. అని మృగభంజనోదితమహాగ్రహ మాననసీమఁ దోఁప న
ట్లనఘుఁ డమూల్యరత్నరుచిరానన మొయ్యన డిగ్గి చెంతలం
దనుగతమై భజించువిబుధాప్తపురోహితమంత్రిపాళిఁ బొ
మ్మని తగ వీడుకొల్పి మృగయాగమనోన్ముఖుఁడైనయత్తఱిన్. 116

చ. జిలుగుపసిండిపాఁతపని చెల్వగుపచ్చలపల్లమూన్చి యా
దలఁనవకంపుఁగెంపుజిగిదట్టపుఁజిల్కుతురా ఘటించి వె
న్నెలరుచిఁజిమ్ముమేల్ రవలనిగ్గులచొక్కపుమోముపట్టనీ
టలరిచి రాజుమ్రోలకు హయం బొకసాహిణి దెచ్చిచెచ్చెరన్. 117

ఉ. చెంగట నిల్పరాజకులసింహుఁడు గాంచె సుమేరుభూధరో
త్తుంగముఁ బాదవేగపరిభూతకురంగము లక్షణప్రశ
స్తాంగము వైరిభీతికృదపాంగము దుర్దమసత్త్వవైభవా
భంగముఁ బార్శ్వకీలితకృపాణనిషంగముఁ దత్తురంగమున్. 118

మ. కని కేయూరకిరీటపాదకటకగ్రైవేయసంకీలితా
భినవాహార్యమణిప్రభల్ దిశలఁ బ్రాపింపం దురంగంబు నె
క్కె నృపాలుండు నిజాప్తదృక్సరసిజాక్షీనోత్సవాపాదియై
తనరం దూరుపుకొండపై వెలుఁగుమార్తాండుండు వ్రాలెం గడున్. 119

సీ. కనుఁగొంటె యివ్వేండికట్లబల్లెముకీవి యడవిపందులమేనియసువు లానుఁ
జూచితే యివ్వాఁడిసురియ బొబ్బమెకంపుఁదుటుముకుత్తుకలనెత్తురులఁ ద్రావు

నరసితే యియ్యుక్కటడిద మయ్యేనుంగుకొదమలయొదలమెదడు నంజుఁ
గంటె యిప్పుడుగుతున్కగటారి గబ్బిబెబ్బులిఁబొట్టయొఱచివిందులకు మెచ్చు
తే. నించు కిటు సూడు మిమ్మేటియీఁటె మిత్తి
కాసరంబులగావున కాససేయు
నని పుడమితేనిలోడ నిట్లాడికొనుచు
వేఁటపయనంబు గట్టిరి వీరభటులు. 120

సీ. తురగరింఖాసముద్ధూతధాత్రీధూళి యమరాపగాజలం బసలుచేయఁ
బ్రాంశుకేతనపటాగ్రి మరుత్కిశోరముల్ వినువీథి నెమ్మొగు ల్విరియఁద్రోలఁ
బ్రాసకుంతకృపాణపరశు ప్రభృత్యాయుధతతుల్ మెఱుంగుమొత్తములఁ జిమ్మ
ఘనభేరిపటహశంఖ మృదంగదుందుభి ధ్వానంబు దిక్కుల వ్రక్కలింప
తే. రథపదాతిచమూపదప్రహతి వసుమ
తీభరఘుకీణభుజగ సాంద్రీభవత్ఫ
ణానిరుపమానమణి వితానముఁ గదల్ప
వేడ్కఁజిగురొత్త నిజపురి వెడలె నతఁడు. 121

క. తురగంబు నెక్కి యీగతిఁ
బరివృతమాద్యత్కిరాత పరివారపర
స్పరవీరవచః కలనా
దరమానసుఁ డగుచు సమ్మదంబునఁ జనుచున్. 12

సీ. గిరిగుహానిర్గత కేసరిధ్వానభీత్యనుధావదున్మదహస్తికులము
చటులమృగాన్వేషిశబరహస్త గృహీతగురుచాపగుణరావగుంభితంబు
కటకభ్రమద్వ్యాఘ్రగళహుంక్రియా గతప్రాణ కుంజావ నదేణబృంద
మచ్ఛభల్లనఖప్రహారక్షుగన్మధు స్నిగ్ధజంబాలిత క్షితితలంబు
తే. దవదహనదగ్ధచందన స్థాణుపటల
ధూమరేఖాను కల్పితదుర్దినంబు
జలజబాంధవకిరణప్రసారశూన్య
మైనయొక కానఁ గనియె నయ్యవనివిభుఁడు. 123

ఉ. ఈసున వింట నారి ఘటియించి శరంబులఁ గూర్చి మానసో
ల్లాస మెలర్ప వాజిఁ గడలం దుమికించుచుఁ జొచ్చె సేనతోఁ

గానరకేసరిద్విరదఖడ్గరురూత్కరకోలభల్లుకా
గ్రేసరసత్త్వసంఘ పరికీర్ణతదుగ్రతరాయతాటవి౯. 124

మ. అలభూవల్లభుఁ డిట్లు కానఁ జొర సేనామానకోలాహలం
బలఘుత్రాసకరంబుగా నిజకులాయంబు ల్వేగం బాసి కో
కిలశారీశుకముఖ్యముల్ పులుఁగు లేఁగె న్మింటికి౯ దక్షిణా
నిలనిర్ధూతమహీజపాండురగళానీకంబు చందంబున౯. 125

మ. అలఘుప్రౌఢిమఁ బుల్కసుల్ పొలమునం దాడాడఁ బెల్లాఁడి పెం
టల నీవారక భూములందు నురు లొడ్డ౯ దీము లంతర్గతం
బులు గూయంగ సజాతిమైత్రికొఱకై పూరేండ్లు కౌఁజుల్ మొద
ల్గలనానావిధపక్షిజాతములు వ్రాల న్వాగురాశ్రేణికి౯. 126

క. వ్రాలి యురిత్రాళ్లఁ గీల్కొని
పోలేనివనీవిహంగములఁ బట్టి మహీ
పాలున కుపాయనంబుగ
మ్రోలం బెట్టిరి వనేచరులు ముద మొదవ౯. 127

ఉ. సాహస మూఁది సైనికులు శాద్వలభూమి నిశాతఘోరదం
ష్ట్రాహతి ముస్త లెత్తెడు వరాహతతిం గని బిట్టదల్చి ప్రో
త్సాహ మెలర్పఁ గుర్కురవితానములం బురికొల్పఁ బోయి య
వ్యాహతశక్తిమై నవి రయంబునఁ బందులఁ జుట్టుముట్టిన౯. 128

చ. అనుగతరోషభీషణములౌచుఁ గిటుల్ పటుశాతదంష్ట్రికా
ఘనకషణాభిఘాతపరికల్పిత విస్ఫురితస్ఫులింగముల్
దనుకఁగ ఘుర్ఘురధ్వనులఁ దారసిల న్సైనకాండ్రు దాల్మి నె
క్కొని యెదిరించి బల్లెములఁ గ్రుచ్చి ధరం బడఁగూల్చి రేపున౯. 129

చ. కొనకొని కోల మొండొకటి కోఱలు నిప్పులు గ్రక్క నెక్క శూ
రుని దెస రా నతం డధికరోష కషాయితలోచనాంతుఁడై
వెనుకకుఁ బోక వేఱొకనిఁ బిల్వక బల్మి కడిందివాఁడిబా
కున నఱుక్రో ల్దైరల్చి ధరఁ గూల్చెఁ బుళిందులు దన్నుఁ జేకొన౯. 130

శా. క్రోడ మొకండు దన్గవయు కుర్కురపాళి నదల్చి భీకరా
మ్రేడితఘుర్ఘురధ్వనులఁ ద్రిమ్మర దీని వధించు మేటియా

కూడినసేనలోఁ గలఁ డొకో యని సైనికు లాడ దాని మై
గాడఁగఁ గోల నెక్కువిలుకాఁ డదరించి వధించె వ్రేల్మిడిన్. 131

చ. మృగతనురక్తమాంసపరితృప్తి వనీసుమకుంజవాటిఁ గ
న్మొగిచి సుఖించుబెబ్బులుల మూఁకలఁ గూఁకల మేలుకొల్పుచో
నగణితరోషభీషణములై యవి పైఁబడ సైనికోత్తము
ల్దగిలి కడిందిచేసురియలన్ బలిగా నొనరించి రుర్వికిన్. 132

మ. పులి యొం డద్భుతశక్తిఁ దారసిలఁ బై పుట్టంబు వే చుట్టి డా
పలిచేఁ దానెఱ చూప దానిఁ గబళింపం దాల్మిఁ గోల్పోక లో
నలుకన్ వీరుఁ డొకండు చేసురియ చుట్టానించి వక్షంబు వ్ర
క్కలుగాఁ జీఱి చమూపతు ల్పొగడ వేడ్కం గూర్చె భూజానికిన్. 133

చ. కడిమికడిందికైదువులఁ గాఱెనుబోతులఁ జీఱి రొక్కటం
బొడిచిరి బల్మిమై నెలుగుమూఁకలఁ గుంతములూఁది తూపులన్
గడపిరి ప్రాణముల్ శరభగండకఖడ్గమృగాళిఁ దేలఁగం
గడువడి దాడివెట్టి విహగంబులఁ బట్టిరి లుబ్ధకాగ్రణుల్. 13

తే. హరియవిశ్వాసమును భవ్యతరులవంచ
నయు మధుపమైత్రి గలిగి సాంద్రతరమదము
కలిమి మేనులెఱుంగనికరటులను వ
ధించెఁ బతి యది రాజవృత్తియ తలంప. 13

ఉ. తుండము లెత్తి ఘీంకృతులతో నిజగండనిషక్తషట్పదీ
మండలఝుంకృతుల్ పెనఁగ మవ్వఁపుటందుగులేఁజిగుళ్లకొం
డొండగడంగు నేనుఁగులయున్నతకుంభదయం బగల్చె నా
ఖండలశస్త్రిసాయకనఖప్రతతిన్ నృపసింహ ముద్ధతిన్. 136

శా. జ్యాటంకారవిభిన్నదిక్కుహరుఁడై సర్వంసహావల్లభుం
డాటోపంబున నున్నచో ట్లరసి బాణాగ్నిజ్వాలజ్వాలికా
ధాటి న్స్రుగ్గఁగఁజేసె భీషణమృగేంద్రశ్రేణి నానావనీ
వాటీవాసకిరాతకోటి తను వాగ్వైచిత్రిఁ గీర్తింపఁగన్. 137

చ. అలఘుచమూసమాకలితుఁడై జనపాలుఁ డుదగ్రచాపకా
శలము మెయిం దురంగమవిశంకటచిత్రగతి న్వనోర్విం ని

పలరమ్యగేంద్రముల్గడుభయంపడిదిక్కులఁబాఱెఁబెక్కురూ
పులయితదీయకీర్తిహరిపుంజమువేరెమువారెనోయనన్. 138

సర్వప్రాసనీసము.

సీ. కదుపులై హరిణంబు లెదఁ బాదుకొనుభీతిఁ జెదరి నల్గడఁ బాఱి పొదల దూఱె
మదము గోల్పడి పీఁక వదలి బొబ్బమెకంపుఁగొదమ లద్రిగుహాళిఁ గుదురుకొనియె
పదములఁ దొట్రుపాటొదవ నేనుఁగుగుంపు లదరి కొండలలోయ నొదిగియుండె
వదనంబు లెండఁగా వదరుచుఁ గ్రోల్పులుల్ నదుల డొంకల డాగిమెదలవయ్యెఁ
తే. జద లద్రువ నార్చి కోపంబు గదుర వెదకి
వెదకి యిరవులఁ బొడగాంచి యద నెఱింగి
గదిమి పైఁబడి భూవిభుం డెదురులేక
పదనుఁబెట్టినయమ్ములగుదులఁ గ్రుచ్చ. 139

స్రగ్విణి. ధారుణీమండలాధ్యక్షుఁ డి ట్లుగ్రకాం
తారదుర్వారనానామృగానీకనం
హారియై సర్వలోకాధిపుల్ మెచ్చఁగా
భూరిబాహాబలస్ఫూర్తిఁ గాంచె న్నుతుల్. 140

కవిరాజవిరాజితము.

కరిరథఘోటకవీరభటాళి యఖండబలోన్నతిఁ గొల్వఁగ భూ
వరుఁ డొకయుగ్రతరాటవిలోని కవార్యధృతిం జనియెన్ నికట
స్ఫురితనదీజలశీకరశీతలశోభిమరుత్ప్రథుకంబులు పై
నొరసి యనూనపథిశ్రమ మార్ప సముజ్జ్వలకౌతుక మాత్మఁ దగన్. 141

చ. స్థిరబలుఁ డాతఁ డంతట నధిజ్యధనుర్ధరుఁ డై చమూసము
త్కరముఁ దొలంగి యొక్కరుఁడు గానలు గోనలు సాను లద్రికం
దరతటినీతటాకములు దాఁటి యొకానొకఘోరకాననాం
తరమున కేఁగె వాయుగమనంబున బాహుబలంబు పెంపునన్. 142

క. సరయంబుగ నొండొకద
వ్వరుగుచు ని ట్లమ్మహాగహనమున నొకచో
నిరుపమతరంగరంగ
ద్గిరిశిఖరగళత్స్రవాహతీరమునందున్, 143

సీ. ఏలాపనసపూగసాలామ్రకదళీరసాలాదినరసద్రులాలితంబు
కేళీచరద్భృంగపాళీసమాలీఢనాళీకగృహసముద్వేలితంబు
[illegible] లనాప్రపూరితంబు
శీతానిలకిశోరధూతాఖిలలతాంతజాతాభినవపరాగాతతంబు
తే. సకలవేదపురాణశాస్త్రప్రవీణ
జటికులానోన్యవాచాప్రసంగదత్త
నికటగిరికందరప్రతినిస్వనంబు
వసుమతీధవుఁ డొకతపోవనముఁ గాంచె.

క. కని యతఁడు తదీయతపో
వనతరుఫలకుసుమపల్లవలతావిభవం
బున కచ్చెరుపడి తనమన
మున నల్లన డాయుచోఁ బ్రమోదస్ఫురణన్.

మ. అలఘూద్యన్నవపల్లవైకగణికాశ్యామాంకమై ప్రోల్లస
ద్దళసందోహము నై యమందకురువిందప్రాంశుసాలావళీ
కలితంబై శ్రుతిజాలకప్రియదవాక్సంపద్ద్విజానీకమై
చెలఁగెన్ భవ్యతపోవనంబు నగరశ్రీఁ దెల్పి భూజానికిన్.

గీ. అతులకలకంఠశుభగానయుతముగా వ
నాధిదేవత నవకేసరారుణాక్ష
తమ్ము లామోదగరిమ నాదల ఘటించి
నరపతికి భావిశోభనస్ఫురణఁ దెలిపె. 147

సీ. సమదాళికబరీభరము రీవి చెలువొంద మృదులతాబాహుసంపదలు మెఱయ
వలచుపూగుత్తిగుబ్బలపెంపు దీపింప బింబోష్ఠరోచులు డంబుచూప
లలితరంభాస్తంభలసదూరురుచు లొప్ప నరసపల్లవపదచ్ఛాయ లెసఁగ
నవహేమనాసాంగకవిభూతి రాణింపఁ గలకంఠసల్లాపగరిమ దనర
తే. నభినవానూనసూనరజోంశుకాభి
రామయై నిశ్చలతఁ బూని రాగమున వ
నేందిర యెదురొ్కనియె డాయ నేఁగుదెంచు
భూరమణశౌరిఁ గరము నగౌరవముగ. 148

మ. అమితామోదిలతాంతబృందమకరందాసారలోలభ్రమ
ద్భ్రమరీగానము వందిమాగధకథాప్రాసీన్యముం దెల్ప భూ
రమణుం డశ్వము డిగ్గి దాని నొకయోరన్ గుజ్జుమావి నే
ర్పమరం గట్టి వనావలోకనమహాహ్లాదంబు రెట్టింపఁగన్. ౧౪

సీ. తలిరుటాకుల నఖంబులఁ ద్రుంచి కలభతుండముల కందిచ్చుసింగములఁ జూచి
యొకగూఁటిపిల్లలయోజఁ జిల్వలఁ గూడి క్రీడించువనశిఖిశ్రేణిఁ జూచి
మూషకార్భకజాతములకు మక్కువఁ జన్నుఁ గుడుపుమార్జాలికావులముఁ జూచి
చనువుఁ జేసికొని మెత్తనిపూరి లేటిదాఁటులనోటఁ దుఱుము బెబ్బులులఁ జూచి
తే. విస్మయం బొంది యిది యేమి వింత యిత్త
పోవనము నీంద్రునితపఃప్రభావమొక్కొ
జాతివైరంబు వెడలి యీజంతువితతు
లెనసి యుండుట యనుచు నూహించి యతఁడు, 15

సీ. మధుపాయిగంజాయమానసూననికుంజనిచయంబులకు డాయు నచటఁ బాయు
గదళీసువర్ణమాకందముఖానోకహచ్ఛాయలకు డాయు నచటఁ బాయు
నూరీకృతామోదకైరవేందీవరాయతనంబులకు డాయు నచటఁ బాయు
నిబిడనిస్తులగోస్తనీకాయమానాంబుయంత్రంబులకు డాయు నచటఁ బాయు
తే. నలసపవమానపోతధూతానవద్య
కరశిలాసంఘటితవేదికలకు డాయు
నచటఁ బాయు మహీజాని వాళిఁ బూని. ౧౬

చ. ఇలపయి నేత్రపర్వముగ నిట్టితపోవన మెందుగాన మిం
దుల గలవింత లెంతయుఁ గనుంగొనఁబోలు నటంచుఁ జొక్కి త్రో
వలఁ జరియించుచున్ సవనవహ్నిసముద్భవసాంద్రధూమకం
దళమిళితంబుఁ గాంచె నొకతాపసపర్ణకుటీర మచ్చటన్. ౧౭

సీ. ముఖతామరసగంధమునకు మూగినతుమ్మెదలరీతి కుటిలకుంతలము లమర
ఘనతారకానీకగర్భితాభ్రముభంగిఁ గ్రొవ్విరుల్ దుఱిమినకొప్పు దనర
వలఁబడ్డమదచక్రవాకద్వయముఁబోలెఁ గులుకుపయ్యెదనంటి గుబ్బ లెసఁగ
నాభివల్మీకరంధ్రజనూత్నవంశాంకురమువిధంబున రోమ రాజి మెఱయ

తే. ఫలభరానతసహకారపాదపాగ్ర
శాఖఁ గెంగేలఁ గొని పర్ణశాలమ్రోల
లలితకందర్పసామ్రాజ్యలక్ష్మివోలె
నిలిచియున్నశకుంతలాలలనఁ గాంచె. 153

క. కనుఁగొని తదీయనవయౌ
వనరూపశుభాంకగౌరవశ్రీలు మనం
బున కత్యనురాగభరం
బెనయింపఁగ నమ్మహీతలేశుఁడు మఱియున్, 154

చ. వెలదులమిన్న యిన్నెలత వేలుపుటింతియొ చిల్వచెల్వయో
పలుకులముద్దుగుమ్మయొకొ భావభవాంగనయో కురంగభృ
జ్జలరుహపాణియో కలిమిచానయొ కా కిలఁ గల్గుబోట్లకే
వలనఁ జెలంగు నిట్టిచెలువంబును జవ్వనముం గణింపఁగన్, 155

ఉ. మేను మెఱుంగుదీవసమమే తమమే జడ కౌనుకీవికౌ
నౌ నన మిన్నుచెన్నలరు నానన మానసవిల్తుమేనమా
మే నెఱిచూపు మీలగమిమే లెడఁబాపుఁ బిఱుందు సైకతం
బై నలువొందు లేఁతనగ వన్నెలవెన్నెలవన్నె కన్నెకున్. 156

చ. తెఱవమొగంబుసౌరు నడతీరు కనుంగవడాల్ బెడంగు ముం
గుఱులమెఱుంగు గుబ్బగవగొప్పతనంబు గళంబుసొంపు వా
తెఱరుచిపెంపు చెక్కుగవఁదేఱినయందముఁ గౌనుచందముం
నెఱిజఘునంబుసంపద గణింపఁ దరంబె విధాత కేనియున్. 157

సీ. సతిమోము రాకానిశాకరబింబంబు బింబంబు తరళాక్షిపెదవిసొంపు
తరుణీమతల్లిపదంబు కోకనదంబు కనదంబుదచ్ఛాయ కాంతకొప్పు
మదవతిజఘునప్రమాణంబు చక్రంబు చక్రంబు జవరాలిచన్నుదోయి
పడతుకయొయ్యారినడక పున్నాగంబు నాగంబు పొలఁతియందంపుటూరు
తే. బోటినెమ్మేనిజిగి తప్తహాటకంబు
కంబులక్ష్మివిలాసంబు గళము మించు
మించుమించుగమి నతిక్రమించుఁ జెలువ
చెలువలరుతళ్కుబెళ్కుచూపుల బెడంగు, 185

సీ. తెలివసోఁగమెఱుంగుకుఱులయందమునకు మొకరితుమ్మెదలు కానుకలొసంగు
లతకూననిజముఖద్యుతిసంపదకు సుధానిధిమండలము భృత్యనియతిఁ దాల్చు
బాలామణికటాక్షలీలావిభూతికి నంబుజరాశి జోహారొనర్చుఁ
జానచిబ్బెపుగబ్బిచనుదోయిఠీవికిఁ జక్రవాకయుగంబు జాగి మ్రొక్కు
తే. వెలదిశృంగారతనువిభావిభవమునకు
విమలసౌవర్ణ ముపచారవిధులు సలుపుఁ
జెలువచెలువంబుఁ బొగడ నీక్షింపశేషు
నకు నగారికిఁ గాక యేరికిఁ దరంబు. 159

క. కులుకువలిగుబ్బగుత్తుల
లలితోక్తిమరందకందళంబుల ననుగేల్
దలిరులఁ గుంతలమధుపా
వళితో నీకొమ్మ కొమ్మవలెఁ గన నయ్యెన్. 160

సీ. వదనచంద్రస్పర్ధ వదలెఁ గాక రథాంగములు పయోధరసామ్యమునకు రావె
తనుమధ్యహరివైరమున కోరసిలెఁగాక కరులుయానసమానగతికి రావె
యమృతవాక్యకభీతి కవిసెఁ గా కరుణబింబఫలంబు లధరంబుప్రతికి రావె
సరసనాసాహేమశంక బెగ్గిలెఁ గాక యళులు పెన్నెఱిగుంపుతులకు రావె
తే. విమలదరహాసకౌముదీద్వేషకలనఁ
దొలఁగెఁ గాక సరోజంబు లలరుకన్నుఁ
గవకు సరి రావె యిక్కలకంఠి కొర
దీనిఁ గొనియాడఁ దరమె వాగ్జానికైన. 161

క. రమణీరదనావళి హీ
రమణీరమఁ దెగడఁ జాలురా రాకాళు
భ్రమరీచిమదభ్రమరీ
సమరీతులు గాంచు ముఖకచశ్రీలు భళీ. 162

సీ. ఎలనాగమృదువచఃకలనాగరిమ కీరలలనాగణితసూక్తులను హసించు
బ్రమదావిలోకసంభ్రమదాసితకచాళి సమదాళిరుచి నుల్లసంబు లాడుఁ
గుముదాప్తనిభముఖీసముదారగతి దానిసముదాయలీల హాసం బొనర్చు
వనితానతంసాంగజనితాచ్ఛదీప్తి హేమనితాంతరుచులసంపద లడంచు

తే. ఫలభరానతసహకారపాదపాగ్ర
శాఖఁ గెంగేలఁ గొని పర్ణశాలమ్రోల
లలితకందర్పసామ్రాజ్యలక్ష్మివోలె
నిలిచియున్నశకుంతలాలలనఁ గాంచె. 153

క. కనుఁగొని తదీయనవయౌ
వనరూపశుభాంకగౌరవశ్రీలు మనం
బున కత్యనురాగభరం
బెనయింపఁగ నమ్మహీతలేశుఁడు మఱియున్, 154

చ. వెలదులమిన్న యిన్నెలత వేలుపుటింతియొ చిల్వచెల్వయో
పలుకులముద్దుగుమ్మయొకొ భావభవాంగనయో కురంగభృ
జ్జలరుహపాణియో కలిమిచానయొ కా కిలఁ గల్గుబోట్లకే
వలనఁ జెలంగు నిట్టిచెలువంబును జవ్వనముం గణింపఁగన్, 155

ఉ. మేను మెఱుంగుదీవసమమే తమమే జడ కౌనుకీవికౌ
నౌ నన మిన్నుచెన్నలరు నానన మాననవిల్తుమేనమా
మే నెఱిచూపు మీలగమిమే లెడఁబాపుఁ బిఱుందు సైకతం
బై నలువొందు లేఁతనగ వన్నెలవెన్నెలవన్నె కన్నెకున్. 156

చ. తెలివమొగంబుసౌరు నడతీరు కనుంగవడాల్ బెడంగు ముం
గుఱులమెఱుంగు గుబ్బగవగొప్పతనంబు గళంబుసొంపు వా
తెఱరుచిపెంపు చెక్కుగవఁదేటనయందముఁ గౌనుచందముం
నెఱిజఘునంబుసంపద గణింపఁ దరంబె విధాత కేనియున్. 157

సీ. సతిమోము రాకానిశాకరబింబంబు బింబంబు తరళాక్షి పెదవిసొంపు
తరుణీమతల్లిపదంబు కోకనదంబు కనదంబుదచ్ఛాయ కాంతకొప్పు
మదవతిజఘనప్రమాణంబు చక్రంబు చక్రంబు జవరాలిచన్నుదోయి
పడతుకయొయ్యారినడక పున్నాగంబు నాగంబు పొలఁతియందంపుటూరు
తే. బోటినెమ్మేనిజిగి తప్తహాటకంబు
కంబులక్ష్మివిలాసంబు గళము మించు
మించుమించుగమి నతిక్రమించుఁ జెలువ
చెలువలరుతళ్కుబెళ్కుచూపుల బెడంగు, 185

సీ. తెలివసోఁగ మెఱుంగుకుఱులయందమునకు మొకరితుమ్మెదలు కానుకలొసంగు
లతకూననిజముఖద్యుతిసంపదకు సుధానిధిమండలము భృత్యనియతిఁ దాల్చు
బాలామణికటాక్షలీలావిభూతికి నంబుజరాశి జోహా రొనర్చుఁ
జానసిబ్బెపుగబ్బిచనుదోయిఠీవికిఁ జక్రవాకయుగంబు జాగి మ్రొక్కు
తే. వెలదిశృంగారతనువిభావిభవమునకు
విమలసౌవర్ణ ముపచారవిధులు సలుపుఁ
జెలువచెలువంబుఁ బొగడ నీక్షింపశేషు
నకు నగారికిఁ గాక యేరికిఁ దరంబు. 159

క. కులుకువలిగుబ్బగుత్తుల
లలితోక్తిమరందకందళంబుల ననుగేల్
దలిరులఁ గుంతలమధుపా
వళితో నీకొమ్మ కొమ్మవలెఁ గన నయ్యెన్. 160

సీ. వదనచంద్రస్పర్థ వదలెఁ గాక రథాంగములు పయోధరసామ్యమునకు రావె
తనుమధ్యహరివైరమున కోరసిలెఁగాక కరులుయానసమానగతికి రావె
యమృతవాక్యకభీతి కవిసెఁ గా కరుణబింబఫలంబు లధరంబుప్రతికి రావె
సరసనాసాహేమశంక బెగ్గిలెఁ గాక యళులు పెన్నెఱిగుంపుతులకు రావె
తే. విమలదరహాసకౌముదీద్వేషకలనఁ
దొలఁగెఁ గాక సరోజంబు లలరుకన్నుఁ
గవకు సరి రావె యిక్కలకంఠి కౌర
దీనిఁ గొనియాడఁ దరమె వాగ్జానికైన. 161

క. రమణీరదనావళి హీ
రమణీరమఁ దెగడఁ జాలురా రాకాశు
భ్రమరీచిమదభ్రమరీ
సమరీతులు గాంచు ముఖకచశ్రీలు భళీ. 162

సీ. ఎలనాగమృదువచఃకలనాగరిమ కీరలలనాగణితసూక్తులను హసించు
భ్రమదావిలోకసంభ్రమదాసితకచాళి సమదాళిరుచి నుల్లసంబు లాడుఁ
గుముదాప్తనిభముఖీసముదారగతి దానిసముదాయలీల హాసం బొనర్చు
వనితానతంసాంగజనితాచ్ఛదీప్తి హేమనితాంతరుచులసంపద లడంచు

తే. నన్నుదలమిన్న క్రొమ్మెఱుఁగారుచూపు
చిగురువిల్కానివాల్దూపుఁ జెనక నోపు
నానిలింపాబ్జముఖు లైన దీని కెనయె
భళిర యిటువంటివాల్గంటి గలదె జగతి. 163

క. అనిపలుతెఱఁగులఁ బొగడుచుఁ
దనివి సనక మఱియుఁ బతి లతాంతన్వితనూ
ఘనరూపవిలాసములను
గని జనితమనోజరాగకలితుండగుచున్, 164

క. అనురాగ మొదవ నీజ
వ్వనిఁ బరిణయమై మనోభివాంఛితములపెం
పెనయ మనోజక్రీడా
వనరాశిం దేలునతఁడు వరసుకృతిగదా, 165

చ. అని వలమానసూనధనుర స్త్రనితాంతవిషాదవేదనం
గనలుచు నీలతాంగి మునికన్యక యేమొకొ యట్టులైన నా
మనమిటు లేల మోహరసమగ్నతఁ గాంచుఁ దదాభిజాత్యమా
త్త నెఱుఁగఁబోలు నంచు వసుధావరుఁ డంగన డాయ నెయ్యనన్, 166

క. ఆ వెలఁది ప్రియ మెసఁగ నల
భూవలయాధిపుని నర్ఘ్యపూజనముల సం
భావించిమశాననయుతుఁ
గావింపనతండు కౌతుకము దైవారన్, 167

గీ. అతివ నీ వొనర్చునర్ఘ్యసపర్యావి
ధానముల మదీయమానసము ప్ర
మోదగరిమఁ గాంచె ముంగిట నిరుపేద
మనుజుఁ డధికధనముఁ గనిన యటుల, 168

క. తరుకుసుమలతాపల్లవ
పరిపాకఫలాన్వితంబు బహుశుకశారీ
పరభృతమృదులస్వరబం
ధుర మివ్వన మేతపోధనునియది నవలా. 169

క. మొగులు తెగఁ బాసి పుడమికి
డిగి భాసిలుచున్నయాతటిత్పాళి యనన్
జిగి మెఱయు నీతనూలత
బొగడ నలవి యగునె యెట్టిప్రోడలకైనన్. 170

క. తెఱగంటిమచ్చెకంటుల
యొఱపును సోయగము నీక యొప్ప విధాత్రం
డఱలేక యిలసతులకం
దఱ కెక్కువగాఁగఁ జేసెఁ దన నేర్పు మెయిన్. 171

క. తలిదండ్రు లెవ్వ రంబుజ
దళలోచన యాఖ్య యెద్ది దారుణమృగమం
డలమిళితం బివ్వన మిం
దుల నున్కికిఁ గత మదెట్టిదో వినవలతున్. 172

క. అన విని లజ్జయు భయమును
మన మెనయఁగ మగువ రాజమార్తాండ బుధా
వన వినుము విన్నవించెద
నని పలికె వినమ్రయై సుధాలాపములన్. 173

చ. అలఘుతరద్రుపల్లవలతాంతఫలాసవసౌరభాప్తి ను
జ్జ్వలపికకీరశారికల షట్పదగాయకగానమాధురీ
కలనఁ జెలంగునివ్వనము కణ్వమునిప్రవరాశ్రమంబు శి
ష్యులు దనుఁ గొల్వఁగా నిచట నుండు నతండు తపంబు పెంపునన్. 174

శా. ప్రత్యూషంబున లేచి ప్రాంతసరిదంభస్స్నానసంధ్యాజపా
దిత్యప్రార్థన లాచరించి శుచివృత్తి న్నేఁడు లోకోత్తర
శ్రుత్యంతార్థవిచారశీలు రగుశిష్యుల్ వెంట రాఁ గానన
క్షిత్యుద్భాసిసమిత్ఫలేచ్ఛఁ జనియెన్ శీఘ్రప్రయాణంబునన్. 175

క. అరిగి తడ వయ్యె మీ రిట
కరు దెంచినవార్త వినిన నాయనయు నతి
త్వరితగతి వచ్చి నినుఁ దాఁ
బరితుష్టునిఁ జేయుఁ దగు సపర్యావిధులన్. 176

గీ. క్షితితలాధిప మాతండ్రి సేయునర్ఘ్యా
మఘనపర్యలఁ బ్రీతుఁడ వై యనంత
రమునఁ బోయెదు గాని యీరమ్యవనిఁ బ
థిశ్రమము దీఱ నందాక విశ్రమింపు. 177

క. నా విని పతి పల్కెఁ దప
శ్శ్రీవిలసితుఁ డాత డూర్ధ్వరేతస్కుఁ డనం
గా వెలయు నట్టివానికి
నీ వెట్టులఁ బుత్రి వైతి నిక్కము చెపుమా. 178

చ. అన విని యింతి యిట్లను నృపాగ్రణి కొండొక నా డహర్ముఖం
బున సకలశ్రుతిస్మృతిసమూహవిచారణశీలుఁ డై వనం
బునఁ బ్రియశిష్యయుక్తముగఁ బొల్పెసలార మునీంద్రుఁ డొక్కఁడా
యనకడ కేఁగు దెంచె నుదయారుణబింబవిజృంభితద్యుతిన్. 179

ఉ. అమ్మునిసార్వభౌమునిఁ గుశాస్తరణంబున నిల్పి యర్ఘ్యపా
ద్యమ్ములొసంగి తత్కుశల మారసి నీయది రాక మా కమే
య మ్మగుశోభన మ్మొసఁగె నాశ్రమదేశము మామకాన్వవా
యమ్ముఁ బవిత్ర మయ్యె సకలార్థవిధిజ్ఞుఁడ నైతి నేఁటికిన్. 180

క. అని కణ్వమౌని సరసవ
చనరచనాగరిమఁ దాపసకులాగ్రణి నె
మ్మన మలరించి యనంతర
మున వన్యాశనవిధానముల మెప్పించెన్. 181

ఉ. అంతట వార లిద్ద ఱఖిలాగమశాస్త్రపురాణవర్ణ్య వే
దాంతరహస్యగోష్ఠి నిరతాత్మకు లై యొకచో వసించి ని
శ్చింత నొకింతసేపు తమచెంగట రూపవయోరమాసమా
క్రాంతతనూవిలాసమున రంజిలు నన్నని సంభ్రమంబునన్. 182

క. మాతండ్రి కనియె నమ్ముని
యీతన్వి జగన్మనోజ్ఞ శృంగారకళా
న్వీత భవదీయ శుశ్రూ
షాతత్పరవృత్తి దా నిచట వర్తిలెడున్. 183

గీ. అనఘ శమితేంద్రియుండవై యలఘుతర త
పోమహత్త్వమునఁ బ్రసిద్ధిఁ బొరయు నియమ
శాలి విదినీకుమారినాఁ జనదు దీని
జననవిధ మెద్ది యెఱిఁగింపు వినఁగవలతు. 184

క. అనవిని యాయన కస్త
జ్జనకుఁడు నాపుట్టు తెఱఁగు సాంద్రానందం
బునఁ దా నుపన్యసింపఁగ
జననాయక వింటి నేనచలమానసనై. 185

క. వినునది నీకొరు లెఱిఁగిం
చిన మద్వృత్తాంత మేన చెప్పుటకు మనం
బనుమాన మెనయు నైనను
విను చెప్పెద నేనతక్కువెలయరిట నెరుల్. 186

సీ. మాన్పె నెవ్వాఁడు రామప్రతాపజ్యోతిఁ గ్రతుకార్యవైరి రక్షస్తమంబుఁ
ద్రోచె నేధీరుండరుంధతీవల్లభు నస్తోకపుత్రశోకాంబురాశిఁ
గూర్చె నేధన్యుండు గురుశాపదగ్ధత్రిశంకున్ కునకుఁ బ్రతిస్వర్గలబ్ధిఁ
గొనియె నెవ్వఁడు తపంబునరుద్రు మెప్పించి యతులప్రభావ దివ్యాస్త్రసమితిఁ

గీ. బఱచె నెవ్వాఁడు సత్యంబు జెఱుపనిరుప
మిత యశోధి హరిశ్చంద్ర మేదినీంద్రుఁ
బదవులనుబాపి యలజడిపాలుగాఁగ
నతఁడుచెలువొందుఁ గౌశిక యమివరుండు. 187

మ. చతురంభోధిపరీతభూభువనరక్షాదక్షదోర్దండలా
ర్జితసామ్రాజ్య సుఖంబునం బొదలి నిర్నిద్రప్రతాపారిసం
తతులం గూలిచికొన్ని నాళ్లు ప్రభుత్వంజెల్లి యంతఁ జ్ఞావశి
ష్ఠతపశ్శక్తి పరాజితుండగుచు విశ్వామిత్రుఁడాపిమ్మటన్. 188

చ. అవనిఁ బ్రభుత్వ మాత్మబలమల్ప మపూర్ణతపోబలంబె గా
రవము వహింపఁ జేయునని రాజ్యసుఖంబుఁ దొలంగి భీషణా
టవి బహువత్సరంబులు గడంకఁ దపంబొనరింపఁ బద్మసం
భవుఁడరుదెంచి మెచ్చి గరిమంబున రాజఋషిత్వమిచ్చినన్. 189

క. నెమ్మది దానికి మెచ్చక
క్రమ్మఱఁ దపమాచరించి కనియె మహర్షి
త్వమ్మది చాలక గాధిజుఁ
డమ్మేరవిరించిఁ గూర్చియతిశయనిష్ఠన్. 190

చ. పరిమిత కందమూల ఫలపారణ నీరస పర్ణ భుక్తి త
త్పరత నదీమనోజ్ఞ జలపాన రతిం బవమాన చంద్రభా
స్కర కరభక్షణం గృశతఁ గన్గొని త్రోచియ నేక హాయనో
త్కరముల నంతకీప్సితముఁగానక పిమ్మట నేకపాదుఁడై. 191

క. వానతఱి బయలఁ జలియును
రానీటజగద్భయంకరపు వేసవి దా
వానల మధ్యంబున ని
ష్ఠానిరతి నతండు తపము సలిపె మహాత్మా. 192

గీ. అతనితపమువలననలంబు వోఁచి జ
గత్త్రియంబుఁ గాల్పఁగాఁ దొడఁగిన
సురలు భయము గదుర సురవల్లభుని డాసి
భక్తిఁ బ్రణుతి సల్పి పలికి రపుడు. 193

మ. అరుణోద్యత్కిరణ వ్రజంబు దనకాహారంబుగా నింద్రియో
త్కర సంరంభమడంచి వాగ్వ రపద ధ్యానామృతా స్వాదనా
దరుఁడై బ్రహ్మఋషిత్వమొంద హిమవద్గ్రావంబునన్ గాధిభూ
వరసూనుండు తపంబొనర్పఁగ నపూర్వజ్ఞానసామగ్రితోన్. 194

చ. అనఘుమతిందపంబు బహుహాయనముల్ బచరింప గాధినం
దనుఁడు హిమాద్రిదానివలనన్ జనియించె మహోగ్రవహ్నియ
య్యనల శిఖాసముత్కరమనా హతమై భువనంబులాహుతు
ల్గానియెఁ బినాకభృన్నిటలలోచన వహ్నిశిఖాతి భీమమై. 195

చ. అతని తపస్సముద్భవ భయంకరవహ్ని శిఖార్తి విష్టప
త్రితయము క్రుంగకుండ సురబృందము గొందలమందకుండ న
ప్రతిమభవద్విభూతికొకభంగము సేకురకుండ నోదివ
స్పతియొనరింపు దీనికి నుపాయమపాయముఁ బొందకుండఁగన్. 196

చ. తడసినఁ దత్తపోదహన దారుణకీలలఁ గ్రాఁగి లోకముల్
బొడవడఁగు న్నిలింపులకుఁ బుట్టువిపద్దశనీ ప్రభుత్వముం
జెడునటుగాన విన్నపముఁ జేసితి మివ్వచనంబు నాత్మలో
నిడియొనరింపఁగాఁదగి నదద్దిరయొదానిన చేయుమీవనన్. 197

చ. వినియనిమేషభర్తభయ విహ్వలమానసుఁడై బృహస్పతిం
గనియనుఁ బెద్దకాలమన ఘామహనీయభవత్సునీతిభా
గనుపమ దేవరాజ్య విభవానుభవాతిశయంబునన్ జగ
త్ప్రిఖతి వహించితిన్ గడపరానివిపత్తిజనించె నేఁటికిన్. 198

మ. గగనోర్వీహరిదంతరాళమునఁ బ్రేంఖజ్జ్వాలికాభీలమై
జగముల్వ్రేల్మిడిఁ జేయుకౌశికతపస్సంజాతవహ్నిన్ శమిం
పఁగఁ జేయన్వెరవెద్ది తెల్పుమనఘాత్మా నీదుప్రజ్ఞాబలం
బగణేయంబది నాకనంతసురరాజ్య శ్రీదమూహింపఁగన్. 199

ఉ. మున్నతిదుష్టపాకబలముఖ్యనిశాటులొనర్పఁ బెక్కులా
సన్నములైన కష్టపుదశల్ దెగటార్చి నిలింపవైభవా
భ్యున్నతి నాకుఁ గూరిచినయూర్జితనీతి కళాప్రవీణత
న్వన్నియ కెక్కితీవు భువనంబుల నిన్నుగణింపశక్యమే. 200

ఉ. ఇప్పుడు పస్థితంబయిన యివ్విపదంబుధిని స్తరింపఁగాఁ
దెప్పవుమమ్మునెట్లు గడతేర్చెదవ్రౌఢిషణాబలంబునం
గొప్పవు నీదు ప్రాపుసురకోటికి సౌఖ్యదమద్రిభేదికె
ల్లప్పుడు స్వర్గరాజ్యవిభవానుభవ ప్రదమందు రెల్లరున్. 201

చ. అనిన దివస్పతింగని బృహస్పతి వల్కుసురేంద్ర నీమనం
బనఘమనాద్యధైర్యమహిమాన్వితమింత దురంతచింతనూ
ల్కొననిది వింతలోకములలో మనకెద్దియ సాధ్యమే నెఱుం
గనలఁతిగాని దుర్భరపుఁగార్యముగాదిది యెంచిచూడఁగన్. 202

ఉ. ఇప్పనికింతచింతఁ గృశియింపఁగ నేటికిఁ దొల్లిరక్కసుల్
గుప్పలుగూడి నీకమరకోటి కొనర్చు విపత్పరంపర
ల్సెప్పఘనంబులట్టివి చలింపకరూపడఁగించి నీకునే
నొప్పిదమాచరింప నెనయూర్జితనీతి కళాధురీణతన్. 203

క. నెమ్మది దానికి మెచ్చక
క్రమ్మఱఁ దపమాచరించి కనియెమహర్షి
త్వమ్మదిచాలక గాధిజుఁ
డమ్మేరవిరించిఁ గూర్చియతిశయనిష్ఠన్. 190

చ. పరిమిత కందమూల ఫలపారణ నీరస పర్ణ భుక్తి త
త్పర త నదీమనోజ్ఞ జలపాన రతిం బవమాన చంద్రభా
స్కర కరభక్షణం గృశతఁగన్గొని త్రోచియ నేక హాయనో
త్కరముల నంతకీప్సితముఁగానక పిమ్మట నేకపాదుఁడై. 191

క. వానతతి బయలఁజలియును
రానీటజగద్భయంకరపువేసవిదా
వానల మధ్యంబున ని
ష్ఠానిరతి నతండు తపమునలిపె మహాత్మా. 192

గీ. అతనితపమువలననలంబు దోఁచి జ
గత్త్రియంబుఁ గాల్పఁగాఁ దొడఁగిన
సురలు భయము గదుర సురవల్లభుని గాసి
భక్తిఁ బ్రణుతి సల్పి పలికిరపుడు. 193

మ. అరుణోద్యత్కిరణ వ్రజంబు దనకాహారంబుగా నింద్రియో
త్కర సంరంభమడంచి వాగ్వ రపద ధ్యానామృతా స్వాదనా
దరుఁడైబ్రహ్మఋషిత్వమొంద హిమవద్గ్రావంబునన్ గాధిభూ
వరసూనుండుతపంబొనర్పఁగనపూర్వజ్ఞానసామగ్రితోన్. 194

చ. అనఘుమతిందపంబు బహుహాయనముల్ బచరింపగాధినం
దనుఁడుహిమాద్రిదానివలనన్ జనియించె మహోగ్రవహ్నియ
య్యనల శిఖానముత్కరమనా హతమై భువనంబులాహుతు
ల్గానియెఁ బినాకభృన్నిటలలోచన వహ్నిశిఖాతి భీమమై. 195

చ. అతని తపస్సముద్భవ భయంకరవహ్ని శిఖార్తి విష్టప
త్రితయము ద్రుంగకుండ సురబృందము గొందలమందకుండ న
ప్రతిమభవద్విభూతికొక భంగము సేకురకుండ నోదివ
స్పతియొనరింపు దీనికి నుపాయమపాయముఁ బొందకుండఁగన్. 196

చ. తడసినఁ దత్తపోదహన దారుణకీలలఁ గ్రాఁగిలోకముల్
పొడవడఁగు న్నిలింపులకుఁ బుట్టువిపద్దశనీ ప్రభుత్వముం
జెడునటుగాన విన్నపముఁజేసితి మివ్వచనంబు నాత్మలో
నిడియొనరింపఁగాఁదగి నదెద్దియొదానిన చేయుమీవనన్. 197

చ. వినియనిమేషభర్తభయ విహ్వలమానసుఁడై బృహస్పతిం
గనియనుఁ బెద్దకాలమన ఘామహనీయభవత్సునీతిభా
గనుపమదేవరాజ్య విభవానుభవాతిశయంబునన్ జగ
త్ప్రఖ్యతి వహించితిన్ గడపరానివిపత్తిజనించె నేఁటికిన్. 198

మ. గగనోర్వీ హరిదంతరాళమునఁ బ్రేంఖజ్జ్వాలికాభీలమై
జగముల్వ్రేల్మిడిఁ జేయుకౌశికతపస్సంజాతవహ్నిన్ శమిం
పఁగఁజేయ న్వైరవెద్ది తెల్పుమనఘాత్మానీదుప్రజ్ఞాబలం
బగణేయంబది నాకనంతసురరాజ్య శ్రీదమూహింపఁగన్. 199

ఉ. మున్నతిదుష్టపాకబలముఖ్యనిశాటులొనర్పఁ బెక్కులా
సన్నములైన కష్టపుదశల్ దెగటార్చి నిలింపవైభవా
భ్యున్నతినాకుఁ గూరిచినమూర్జితనీతి కళాప్రవీణత
న్వన్నియ కెక్కితీవు భువనంబుల నిన్నుగణింపశక్యమే. 200

ఉ. ఇప్పుడు పస్థితంబయిన యివ్విపదంబుధిని స్తరింపఁగాఁ
దెప్పవుమమ్మునెట్లు గడతేర్చెదవ్రౌధిషణాబలంబునం
గొప్పవు నీదు ప్రాపుసురకోటికి సౌఖ్యదమద్రిభేదికె
ల్లప్పుడు స్వర్గరాజ్యవిభవానుభవ ప్రదమందు రెల్లరున్. 201

చ. అనిన దివస్పతింగని బృహస్పతి వల్కుసురేంద్ర నీమనం
బనఘమనాద్యధైర్యమహిమాన్వితమింత దురంతచింతనూ
ల్కొననిది వింతలోకములలో మనకెద్దియ సాధ్యమే నెఱుం
గనలఁతిగాని దుర్భరపుఁగార్యముగాదిది యెంచిచూడగన్. 202

ఉ. ఇప్పనికింతచింతఁ గృశియింపఁగనేటికిఁ దొల్లిరక్కసుల్
గుప్పలుగూడి నీకమరకోటి కొనర్చు విపత్పరంపర
ల్స్పృఘనంబులట్టివి చలింపకరూపడఁగించి నీకునే
నొప్పిదమాచరింప నెసమూర్జితనీతి కళాధురీణతన్. 203

గీ. మెలఁగునీయాజ్ఞఁ ద్రిభువనములు శిలోచ్చ
యములు బొడిసేయు శతకోటి యాయుధముని
లింపవల్లభ నీక సాధ్యంపుఁబనులు
గలవె యెచ్చోట నూరక తలఁక నేల. 204

గీ. నినుభజించెదరని శంబున్నృత్తగీత
వాద్యములఁ బ్రౌఢి నెరపుచు వర్ణనీయ
నవవయోరూప శుభలక్షణప్రశస్త
లచ్చరమెఱుంగుబోండ్లు సురాధినాథ. 205

గీ. రంభశశిరేఖ హరిణియూర్వశియు హేమ
యును ఘృతాచియు మేనకయును తిలోత్త
మయును మొదలైనయచ్చర మగువలందుఁ
గోరియొకదానిఁ గౌశికుఁజేరఁబనుపు. 206

క. పనిచిన నీయాజ్ఞ వెనం
జనియట నచ్చర వెలంది చలిగొండఁదపో
భినిరతిఁదగుగాధితనూ
జునితపముం దనదు నేర్పుచొప్పడ నుడుపున్. 207

క. అకుటిలమనమున నేఁదలఁ
చికొనిన పదుపాయమిదియ చేకూఱుచు ను
త్సుకమతిశయముగఁ జిత్తము
నకు నీకొండొక తెఱంగు నంగాదరయన్. 208

క. అనుగురువచనస్ఫురణం
బునకలరినభ్రాంతరాశిమునఁ బొల్పగువే
లు నెలంతలలో మేనక
తనురూపవిలాస సంపదలమేటియగున్. 209

చ. అనిమదినిశ్చయించికొని యంతికచారులఁగాంచి మేఘవా
హనుఁడుమదాజ్ఞ మీ రతిరయంబున నేఁగి శుభాంకరూపయా
వనవిభవోన్నతిం బ్రబలివారిజగంధులలో బాగస్త్రకె
క్కినయల మేనకాంబుజముఖింబిలు వుండనవారలత్తటిన్ 210

ఉ. అక్కులశైలమర్దనుని యాజ్ఞ శిరంబునఁ బూనిన మ్రుల్లై
మ్రొక్కి సురేంద్ర నీపదసరోరుహ సన్నిధికవ్వియచ్చరం
గ్రక్కునఁ దోడి తెత్తుమని కాంచనవేత్రధరుల్సనన్ సభం
దక్కిన వేల్పుటింతులనదల్బలె మిన్నక యుండిరంతటన్, 211

సీ. త్రిదశద్రుమాసవప్రా స్తదఖేచరీపాణి వీణామధురగా నవిశ్రుతంబు
రణరంగహతధరా రమణవర్గనిరర్గళానులాపకలాప మానితంబు
నిరుపమామూల్యమాణిక్యశోభాచక చకితకుడ్యకవాట సంగతంబు
దశదిశాచ్ఛన్ననిస్తంద్రమనోహరాగరుధూపవాసనా సురుచిరంబు
తే. పంజరాంతరశుకశుకీపఠ్యమాన
సూనధనురాగమ విశేషసూక్తికలిత
మగువియచ్చరకేళీగృహావతంస
మొక్కచోఁ గనియల చారులుత్సుకమున, 212

సీ. ధమ్మిల్లపారిజా తలతాంతవాసనా గతభృంగరవముపాంగతఘటింప
సంభోజరాగరత్నాకీర్ణపాణి కంకణనిక్వాణముతాళగతిఁ జెలంగ
శృంగారహారచిత్రిత దివ్యతాటంకరుచులు చెక్కునాట్య రచనఁ జూపఁ
గమనీయవిమల ముక్తాహారవారంబు గుత్తపుఁజనుదోయి నత్తమిల్ల
తే. గేళిభవనాంతరంబున మేలిపసిఁడి
గద్దియవసించి వల్లకీగానరసవి
లోలపరవశకించిన్ని మీలితాక్షి
యగునిలింపాబ్జముఖిఁ జేర నరిగియంత 213

క. అలనాకపతిభటులుచెం
తలనాఁగివియచ్చరాంగ నాయుత మేనా
లలనాకరవీణాకల
కలనాదజనిప్రమోద కలనాత్మకులై. 214

చ. మృదుమధురోక్తి నిట్లనిరి మేనకగానకళాభిరూప్యసం
పదలవిచిత్రనృత్తగరిమన్ హరిమన్ననఁ జూడఁ దత్సభా
సదులుహృదబ్జసంభ్రమ రసంబునఁ బ్రస్తుతిఁ జేయఁ గామరు
న్మదవదళీనకైశికలమండలిపన్నె వహింతు వెంతయున్. 215

క. కలవాణి వినుము నూఱం
చులవాల్దాలుపు సమస్తసురబృందము క్రే
వలఁ బాయ కుండఁగొలువై
తలవంచి మదిన్విచార తాత్పర్యమునన్. 216

ఉ. ఊరక తండు గొంత తడవుండి విశాలసహస్రలోచనాం
భోరుహసీమ విన్న దనముం గనుపింపఁగ సాదరంబునం
జేరవఁ గాంచి మమ్మునినుఁ జెచ్చెరదోకొని తేరఁబంపఁగాఁ
జేరఁగవచ్చినార మెడ సేయక రమ్ము వియచ్చరీమణీ. 217

క. అనుట యునచ్చర హృదయం
బునభయమును సంభ్రమంబుఁ బురిగొనఁగానె
య్యనఁ గరభృత వల్లకి యొక
యనుగుం జెలికరతలంబునందిడి యంతన్. 218

ఉ. తీవిమెఱుంగు క్రొమ్ముడి ఘటించిన వేలుపుమాని కమ్మపూఁ
దావులు గ్రమ్మనల్లడను దారకటీమణి కాంచిఘంటికా
రావములుల్లసిల్ల నభిరమ్యపదాంగద నిస్వనంబుతో
నావనజాక్షి కాంచన మయంబగు గద్దియడిగ్గి దిగ్గనన్. 219

చ. తొలుదొలుతన్ రతిక్రియకు దూకొను యజ్వలఁ బిమ్మటన్ రణ
స్థలహతవీరపుంగవకదంబములం బరిరంభసంభ్రమా
కలనసుధాధరానుభవకల్పితసౌఖ్య పయోధిఁ దేల్చియ
క్కలికి పులోమజారమణుఁ గన్గొను వేడుక చెంగలింపఁగన్. 220

సీ. వనదమ్ముజిగిఁ జిమ్మునను క్రొమ్ముడిసుమమ్ములళిమండలుల దండకామతింప
ఘనకాయజని సాయకని కాయములసోయగముఁ జూపుజిగి చూపుకడల బ్రాకఁ
బలుగుబ్బలుల గెబ్బగల నిబ్బరపు గుబ్బగవజంట రవికంటికాంతులీనఁ
బులినోన్నతులఁ దన్నగలచెన్నలరి యున్నకటిసీమనవహేమపటము వ్రేలఁ
తే. బంకరుహరాగ రుచిరతాటంక యుగళి
ధగధగలు తళ్కు చెక్కుటద్దములఁ గ్రమ్మ
మోహనాకారమున వేల్పుముద్దు గుమ్మ
కొమ్మనెక్కతెఁ గూడి గృహమ్ము వెడలె. 221

గీ. ఇట్లుహరిమణీ మయకేళిగృహము వెడలి
వెలఁది చూపఱమాడ్కి కివిందొనర్చె
సజలజలదాళిఁ దొలఁగి యక్కజపురుచుల
నతిశయిల్లెడు చంచలాలతికవొలె. 222

చ. కులుకుపసిండి చాయవలిగుబ్బల ప్రేఁగునఁ గౌనుదీవబి
ట్టులికిచలింపఁజంచలదృగంచల దీప్తిసెలంగనూపురా
కలితని తంబబింబ మణికాంచనకాంచికలాపఘంటికా
ఘళఘళరావముల్వెలయఁగాఁ జనియెంజెలియింద్రుఁజేరఁగన్. 223

ఉ. హాళిసువర్ణవేత్ర కరులంతకమున్నప రాకుదేవసీ
పాలికనంగరాజ్యరమ భంగివెలుంగుచు వచ్చెవేల్పుప్రో
యాలనిపోయిపాకదనుజారికి విన్నపమాచరించునా
లోలతకూనయింద్ర సభలోపలికేఁగి కుతూహలంబునన్. 224

సీ. సకలాగమేతిహాస కళానిపుణ తాపసకలాపగాఢాప్ర సంగకలన
నలకాపజాంభోధ్భ దలకాముఖామరీ తిలకాభినయనాట్య దివ్యమహిమ
వలమానగంధర్వ కులమానినీకంఠ కలమాధురీమయ గానరచన
కనకాభభూషావసనకాంతిమత్సుధా శనకాండచతుర భాషానిరూఢి
తే. రాజరత్నవితాన విభ్రాజమాన
బహుళసోపాన హీరదర్పణవితాన
పటలిగణియింపఁదగు సభాభవనసీమఁ
దనరుచున్న సహస్రలోచనునిఁ గనియె. 225

చ. పొడఁగనిడాయఁబోయిను నుపుంగలమేనిపసిండిచాయన
ల్గడమెఱయంగటాక్షరుచిలాలితఫుల్లసరోజమండలిం
బడిబడివేల్పుఱేనికి సపర్యలొనర్చుచు మ్రోలనిల్చియిం
పడరమెఱుంగుఁబోఁడివినయంబునఁగేల్గవమోడ్చియంతటన్. 226

ఉ. ప్రాంచితరూపలక్ష్మిఁ గనుపండువుఁజేయఁగఁ జూచువారికిం
క్కించుకసేపనేకవిధ నృత్యకళారచనావిభూతిహ
స్తాంచితవల్లకీ కలరవాన్విత పేశలగానలీలమె
ప్పించెఁబురందరాద్య మరబృందముడెందములన్ సభాస్థలిన్. 227

చ. నెఱినిటు లాస్యగానముల నేరుపుఁజూపుచు సాటివేలుపుం
దెఱవలు మేల్ భళీయనఁగ నిల్చెలతాంగి బలారిచెంగట
న్వెలుఁగు పసిండిబొమ్మబలె నీరదపాళిఁ దొలంగిచూడ్కికి
న్వెలుఁగుఘటించు మించుకరణిన్నవ విద్రుమవల్లిచాడ్పునన్. 228

క. అనిమిషపతి తనబహులో
చనత కృతార్థతవహింప సౌవర్ణమణీ
ఘనతర భూషాలంకృత
తనులతయై యున్నదానిఁ దగఁగనుఁ గొనుచున్. 229

సీ. మహనీయ తపనీయమణివారఘృణి పూరమండనుం డగగరుత్ఖండనుండు
తనుభూరిరుచి దారితని శాంతదిన కాంతమండలుండు విచిత్రకుండలుండు
గురుసౌరభ విహారసురసాలసుమ జాలదామకుండు జగన్నియామకుండు
త్రిదశాతిశయ భీతికృదఖర్వబలగర్వ మోచనుండు సహస్రలోచనుండు
తే. రంగదధ్యాత్మ విద్యాప్రసంగనిపుణ
తాప్రశస్తమహర్షి చేతః ప్రమోద
దాయకుండు పులోమజానాయకుండు
కట్టెదురనుండు మేనకకిట్టు లనియె. 230

సీ. తిలకింపనూర్వశిథిలభావయూర్వశిరతిరహస్యకళాభిరామ హేమ
లలితాంగజితచంచలామరీచిఘృతాచిమధురవాక్యవిశేషమంజుఘోష
చారులావణ్యపయోరేఖశశిరేఖనృత్యగానరమావిజృంభరంభ
స్తనజితశ్రీఫలోత్తమయాతిలోత్తమస్ఫురదపాంగవిధూతహారిణిహారిణి
తే. మొదలుగాఁగలయచ్చరలుదితభక్తి
భయవినయగౌరవంబులఁ బ్రతిదినంబు
గొలిచెదరునన్ను నీపయిఁగూర్మి పెద్ద
నాకెపుడు వారికంటె డెందంబునందు. 231

క. కావుననొకటితలఁచికొని
రావించితిఁజేయునదికరముసులభము రా
జీవాక్షినీకునప్పని
గావింపఁగనొరులకలవిగాదూహింపన్. 232

వ. అదియెట్టిదనిన. 233

సీ. ఏభూమి భృత్కులాధీశుండు పంటరాసామిదాలుపు లేమ జన్మసీమ
ఏమహీధర సార్వభౌముండు వెలలేని బలితంపురతనాల పంటసాల
ఏశిలోచ్చయమండ లీశిరోమణి తాపసకులాభరణకోటి సవనవాటి
ఏమహాగిరికుల గ్రామణి తెలుగంటి మచ్చెకంటులదాటు మన్కిచోటు

తే. ధరణి నే గట్టుఖం డవేదండపుండ
రీక గండక భల్లూక సూకరైణ
ముఖ భయానకమృగ కాండమునకుదండ
యట్టి చలిగొండ వెలయుఁ బ్రఖ్యాతభూతి. 234

ఉ. ఆచలిగొండదండ మరుదాతపశీత ఘనాంబు వృష్టి ధా
రాచలితుండు గాకమది బ్రహ్మఋషిత్వముఁ గోరి భూరి ని
ష్ఠాచతురుండు కౌశికుఁడు సల్పెఁదపంబిటు త త్తపోనలో
ల్కాచయముల్ జగ త్త్రయముఁ గ్రాఁచఁదొడంగె నటంచు నెవ్వగన్. 235

గీ. చారులెఱిగింప వింటిదు ర్వారభయద
మైన యీవార్త నీవు నాయాజ్ఞపడసి
తడయకించుక యిప్పుడే వ్వడఁకు మెట్టు
దొరగడియ నేగినీనేర్పుకరము మెఱయ. 236

చ. కమలదళాక్షి కౌశికు నఖండతపంబు ఫలింపనీక వి
ఘ్నముసమకూర్చి శాశ్వతముగా సురరాజ్యవిభూతి నిర్వహిం
పుము నిఖిలామరప్రకరముల్ నిను మన్ననసేయ వన్నెకె
క్కుము మదనుజ్ఞ శోభన మగుంజనుమా యనిపల్కు నుల్కుచున్. 237

చ. రమణి నగారిఁ బల్కునలరంభయు హేమ ఘృతాచియుందిలో
త్తమ శశిరేఖయు న్మణియుఁ దక్కిన యచ్చర లెల్లభక్తి పెం
పు మెయి భజింప నిన్న నిశముస్నది మిక్కిలి కూర్మి నాదెసం
గొమరెనఁగన్ సభాస్థలిని గొప్పదయన్ ననుఁ జూడమేలగున్. 238

ఉ. మించిన కూర్మి నీవు నియమించిన నెంతటి కార్యమైన ని
ర్వంశఁచ జేయమాకు సురవల్లభ నాయమ కాని చండకో

పాంచితమూర్తి గాధితనయాగ్రణి పాలికిఁ బోవ నెమ్మనం
బించుక కొంకుచున్నయది యింతుల కిప్పనిఁ బూన శక్యమే. 239

క. సామాన్యుఁడె తలఁపఁగ వి
శ్వామిత్రుం డతని కాగ్రహంబొ దవిన ది
గ్భూమి నగాంబుధు లదరున్
సోమార్క ప్రభలడంగుఁ జుక్కలు డ్రుంగున్. 240

చ. సమధిక సత్యసంధుఁడగు చంద్రమతీపతిఁ బ్రాజ్యరాజ్యభో
గమునకుఁ బాపి దుర్దశలఁ గప్పె వశిష్ఠ మునీంద్రుతో విరో
ధముఁ గొని తత్తనూభవశతం బడచెన్ సృజియించె మాఱుస్వ
ర్గమతని మ్ముబోఁట్లు చెనకంగల వారె బలాసురాంతకా. 241

గీ. సరస సంగీతనాట్య ప్రసంగములన
భానదుల చిత్త మలరింపఁ బ్రౌఢిగలదు
గాని కౌశిక తపము భంగం బొనర్చు
నట్టి సదుపాయముల వడదయ్య నాకు. 242

వ. అనిన బృందారక సుందరీ రత్నంబున కప్పురందర వరుం డిట్లనియె. 243

సీ. మొలకనవ్వుల ముద్దుగులుకు నెమ్మోముతోఁ గొజ్జంగి విరులకీల్గొప్పుతోడ
నపరంజి మెఱుఁగు టందపుమేనిచాయతో వృత్తంపు గబ్బిపాలిండ్లతోడఁ
గపురవీడ్యపుఁ దావి గ్రమ్ముకెమ్మోవితోఁ గలదు లేదనుకౌను చెలువుతోడఁ
గాటుక పసమీఱు కడకంటి చూడ్కితోఁ గలితకపోల భాగంబుతోడ.
తే. స్వర్ణ భూషణ మణి చకచ్చకల తోడఁ
గట్టెదుర నిల్వనినుఁ జూచి గాధిపట్టి
మదన శరవేద నాధూయ మానమాన
సాంబుజుఁడు గాక యతఁడేల నలుకఁ బొరయు. 244

మ. తరళాక్షీ జగదేకతావకతనూతారుణ్య లావణ్యవై
ఖరులం గాంచినఁ బంచబాణహుత భుగ్జ్వాలావళీతప్తమై
కరగుం జిత్త ఘృతంబు పద్మజునకున్ గాధిక్షమా మండలే
శ్వరపుత్రుండన నెంతవాఁడతఁడు నీవశ్యుండుగాకుండునే. 245

సీ. మందహాస విరాజమానచంద్రిక దండఁ జెదరక పూర్ణిమాశీతరశ్మి
యక్షీణచంచత్కటాక్షమార్గణపఙ్క్తి సరసఁ బాయక సూనసాయకుండు
కమనీయతరతనూ గంధసాంగత్యంబుఁ దరలకమలయభూధరసమీర
మఖిలలోకమనోజ్ఞ యౌవన శ్రీమైత్రి మహిమంబువదలక మాధవుండు
తే. తోడనరుదేరగాధి సుతుండుగాఁడు
సారసేక్షణవిను ప్రభంజనకుమార
దంతి ముఖధిషణాధురంధరులు నైన
జాలిఁబడుదురు నీరూపలీలఁ జూచి. 246

చ. అని నవరత్నకాంతి కలితాభరణోల్లసదంబరాదులం
దనిపి బహూకరింప సురనాథుని వీడ్కొని యవ్వియచ్చరాం
గన తనతోననుంగు చెలికత్తియలెల్ల సమానరూపయౌ
వన గరిమందనర్చి యిరువంకలఁ బాయకరాముదంబునన్. 247

మ. ఇరుచక్కన్మధుపూర్ణ శీతకరులుద్వృత్తిం దనుంగొల్వఁ దె
మ్మెర తేరెక్కి ధనుర్గుణీ కృతమదోన్మేష భ్రమచ్చంచరీ
క రవంబొప్పఁబికాది సైన్యములతోఁ గందర్పశూరుండు తో
డరుదేరన్ సురలోకనాయక కృతాజ్ఞాబద్ధ చిత్తాబ్జయై. 248

ఉ. అచ్చర వేల్పువీడ తిరయంబున వెల్వడి యిట్లు ధాత్రికిన్
వచ్చి సువర్ణహర్మ్య గృహవప్రములున్నత గోపురావళుల్
రచ్చలు నూల్కొ వల్లియలు రమ్యవనీతటినీతటాకభూ
భృచ్ఛ్రియముల్గనుంగొనుచు నిందుధరాస్త దిశాపదంబునన. 249

చ. అరుగుచు మ్రోలఁగాంచె శిఖరాగ్రగళత్తటినీతటీ నిరం
తరరణవన్మదాళి సముదాయమిళల్లవలీలతాగృహాం
తరనిరవద్యహర్మ్య హిమధామశిలాస్ను చరిష్ణుకిన్నరీ
కరగతివల్లకీమధుర గానవిశాలము శీతశైలమున్. 250

మ. కనిడాయంజను నంతనార్చెఁ దుహిన గ్రావాగ మవ్రాత పు
ష్పనికాయోదిత చారుగంధలహరీ సంక్రాన్తమంద ప్రభం
జన పోతమ్ములు దవ్వుదవ్వులఁ బధిశ్రాంతి ప్రభూతామరీ
ఘనసారంగ మదోన్మిళ త్కుచతటీ ఘర్మాంబుధారావళుల్. 251

క. చల్లని మారుతమిటు వెద
జల్ల నిలింపాంగనలు తుషారాగముపై
కల్లన నెక్కి మనోజ్ఞము
లుల్లసిలం గ్రీడసల్పుచుండి రనంగన్. 252

క. విని శౌనకాద్యఖిల స
న్మునిముఖ్యులనూన మోదమున సూత తనూ
జునిఁ గనుఁగొని యవ్వలికథ
ననఘాత్మ యెఱుఁగఁ జెప్పుమని యడుగుటయున్. 253

మ. అరుణాపత్యమనోజ భంజన దృగంతారుణ్య తారుణ్య వ
చ్చిరకర్పూర పటీర పాండురతనూ శృంగార శృంగారభా
సుర కైలాసమహీధరాయత మహాశుద్ధాంత శుద్ధాంతరా
త్మ రమామానవతీమనోరమణ శుంభద్రోప భద్రోపగా. 254

క. శ్రుత్యర్థ గోచర దయా
నిత్యాంతఃకరణలోచనీ భవదనలా
దిత్యోత్పలాప్త జలజా
పత్యప్రముఖార్చితాంఘ్రిపంకజ యుగళా. 255

స్రగ్విణీవృత్తగర్భితభుజంగ ప్రయాతము.

ఘనానార కీర్తి జగజ్జాల రక్షా
పినాకీ రణారాతి భీకృద్బలాదీ
ననాగారి వాహాస్త్రనవ్యక్షమాభృ
త్తనూజారతా దేవతా సార్వభౌమా. 256



ఇది శ్రీ విశాలాక్షీకాశీవిశ్వేశ్వరకరుణాకటాక్షవీక్షాలబ్ధసర-
సాహితీధారేయ విద్వజ్జనవిధేయ గౌతమగోత్రపవిత్ర
సూరయామాత్యపుత్ర సద్గుణసమాజ నాగరాజప్ర
ణీతం బైన శకుంతలాపరిణయం బను మహా
ప్రబంధంబునందు
ప్రథమాశ్వాసము.



# శకుంతలా పరిణయము.

## ద్వితీయాశ్వాసము.



లాలిత బాలమృగాం
కాలంకృత ఘన జటా కుహర శ్రీకాశీ
ఖేలన భవ్య విశాలా
క్షీలోల జగన్నివేశ శ్రీవిశ్వేశా.

గీ. అవధరింపుము శౌనకాద్యఖిలమునుల
కతివినయవాక్యముల సూతుఁడనియె నిట్లు
హిమవదచలాగ్రసీమ నయ్యిందుముఖులు
హర్ష మిగులొత్త విహరించు నవసరమున,

## వసంతఋతు వర్ణనము.

చ. అలరె వసంతకాలము వనాబ్జ కుటీ సుకటీ పటీ భవ
ల్లలిత మదాళినీ కుల చలద్గరుదగ్రమరుద్విధూత పే
శలతర మల్లికా ప్రసవజాల నితాంతర జఃప్రపూరితా
ఖిల హరిదంతరాళము శుకీశు కరావవిశాలమెంతయున్. 3

సీ. శశి రత్తురి పుజయోత్సేక చైత్రాత్మ భృత్య పురోధృతారుణ ధ్వజములనఁగఁ
బాంథావళీ మనోభయ దప్రసూన సాయక దోఃప్రతాపానలార్చులనఁ గ
దీప్తనానారామ దేవతా సముదయస్తనకుంభ కుంకుమచ్ఛాయలనఁగ
నలఘు పాదప తేలి హాన వితానదుర్భర ఫణారత్న గభస్తులనఁగ

తే. భ్రమద వనశక్తి సమ్ముఖ సమయ హాలిక
శేఖరానీతరక్తసంసిక్తభక్త
రాశి రుచులనఁ బొలుపొందెఁ బేశల ప్ర
వాళములు కేళికారామ జాలకముల. 4

మ. సరవిందా శిశిరారిఁ గెల్చి యసమాస్త్రిప్రౌఢితోఁ డన్ దళ
స్ఫురణం బావృత పల్ల వైకగణికా స్తోమంబు ప్రత్యుత్సవో
క్త రసోక్తి ద్విజమండలంబు కురువింద ప్రోజ్జ్వ లత్సాలసుం
దరముం గేళివనీపురోత్తముముఁ జైత్రస్వామి చెందెన్ రహిన్. 5

చ. అలఘుతర శ్రుతిప్రియ మహాద్విజ సూక్తివసేందిరన్ సమా
కలిత ముదాప్తి మాధవుఁడు గైకొను వేళ వనాధి దేవతల్
బలువిడి జాతరూప మయ పాత్రల నెత్తిన క్రొత్తముత్తియ
మ్ములనఁ దగెన్ దళోపరిసముజ్జ్వల సూనగుళుచ్ఛకచ్ఛటల్ 6

చ. అలశిశిరప్రభాకరు నియస్తమయంబున సంజకెంపు నా
నలరె నవాంకురత్కిసలయద్యుతి జాలము తారకాళి నాఁ
గలిత లతాంత కోరక నికాయము లుల్లసిలెం దమంపుగుం
పులనఁగ నామధువ్రత సముత్కరదీప్తి సెలంగె నల్గడన్. 7

మ. తలపన్మాఘు కరౌఘముల్ నవరస ద్రవ్యాప్తిఁ దోడ్తోడ స
ల్లలితాభీష్ట ఫలాను భూతి శ్రుతిజాలప్రీతి కృద్వాగ్ద్విజా
వళి యామోద సమృద్ధి సర్వసుమనో వ్రాతంబు గాంచె న్విని
శ్చల నానావని భారధూర్వహ మధుక్ష్మాభృత్ప్రభుత్వంబునన్. 8

చ. అలఘువసంతకాలనవ యౌవన యౌవనలక్ష్మి కొప్పెమం
జుల పదపాణి పల్లవరుచుల్ సునఖాంచలకోరకాళి వ
ర్తుల కుచసూనగుచ్ఛములు దోరపు బాహులతల్వినీల కుం
తల మధుపద్యుతుల్ శుకసుధాకలనాద వచో విశేషముల్ 9

చ. అలరువసేందిరాపరిణయంబునఁ జేర్చి పలాశకోర కా
నలము వనీవితర్దికఘనద్విజవాఙ్మను యుక్తిమాధవుం
డలఘుతర ప్రసూన నికరాసవపూర ఘృతాహుతి క్రియల్
నలుపఁగఁ దోఁచు క్రొంబొగల చాలనఁ బర్వె మదద్విరేఫముల్. 10

ఉ. రాజితుఁడై మహావని భరప్రభు తాప్తికి రావసంతుఁడన్
రాజ భిహృద్యమంగళ కరభ్రమరీ కలగానసంగతిం
దేజమెలర్ప వల్లియువతీజనమెత్తిన పద్మరాగనీ
రాజన రాజియోయనఁ గరంబు సెలంగెఁ బలాశ సూనముల్, 11

చ. వరశుకసూక్తులన్ బ్రణయ వాగ్విహృతిం గరఁగించి గంధబం
ధుర పవమానహస్తమున నూత్నరజోంశుకమున్ సడల్చుచున్
మరగిప్రవాళ పాణి నలమాధవుఁ డూనఁ దలంకి మైవ నేం
దిరపులకల్వహించె ననఁదేజరి లెన్విరి మొగ్గచేరువల్. 12

చ. ఘనతరులవ్వనంత మహికాంతునిఁజేరి మృదుప్రవాళ కాం
చన పరిధానముల్ సుమరజఃపటవాసక సౌరభంబు నూ
తనకళికాభరక్తి భవదామములాదిగ నిష్టనత్ఫలం
బనువుగ సంగ్రహించి నెరయన్ మినుముట్టెను రాగసంపదన్. 13

శా. ఆరామోర్విఁ జెలంగె నౌనిరుపమానామ్లానసూనచ్ఛటాం
తారాజన్మకరంద కందళమదోద్యత్సం భ్రమచ్చంచరీ
కా రావాన్విత కుంజపుంజ గృహమధ్యానంగ కేళీ కళా
ప్రారంభ ప్రియకామినీమణి తవాగ్వ్యాపార మయ్యామనిన్. 14

చ. ఘనతరులాశ్రిత ద్విజనికాయ హృదిష్టఫలప్రదాతృ తా
తనుసుమనశ్ఛటారుచి వితానము పేర సుకీర్తిలాభమున్
గనుఁగొని రాగ సంపద ననంతపదంబు భజించియెంతయున్
మనుటయుఁ బాత్రదాన మహిమంబదియట్టి ద కాగణింపఁగన్. 15

మ. శ్రుతిజాల ప్రియభాషిత ద్విజవరస్తోమంబు శ్రీమాధవాం
చిత కారుణ్యముచే నభీష్టఫలసంసిద్ధిం బ్రకాశించె నా
శ్రుతిజాల ప్రియభాషిత ద్విజవరస్తోమంబు శ్రీమాధవాం
చిత కారుణ్యముచే నభీష్టఫలసంసిద్ధిం బ్రకాశింపదే. 16

మ. అలగంధాద్రిజ నించినిర్ఝర నదీ ప్రాంచత్పయః పూరము
ల్గలయంగ్రోలి మధువ్రతాంగనలు జోలల్ వాడఁబూఁదీవ యు
య్యేలలందూఁగుచు నాడునాటికి రజోవృత్తిన్ వనక్షోణివ
ర్థిలి లేఁగాడుపుఁగుజ్జుత్రిమ్మరఁగ నేర్చెన్మందయానంబునన్. 17

మ. అలరెన్ సర్వవనావళుల్ సుమకదంబాలంబరోలం బసం
కులఝుంకార నినాదమేదురము లై కూజచ్ఛుకానీక కో
కిల సందోహములై సరోజనిలయత్రేంకార రావోజ్జ్వల
త్కలహంసీ ధవళీకృతాఖిల హరిత్కాండంబు లై యెన్నఁగన్. 18

చ. మురువగుమొగ్గముత్తియపు మ్రుగ్గులనైన మదంపుఁ జర్చబం
ధుర శుకరాగ్గరున్నికరతోరణ పాళిఁ బ్రవాళ కాంతి వి
స్ఫురణ వితాన రాజి మృదుశోభి పటీర రజంపు ధూపలీ
ల రహిఁదగెన్వనంబు వనలక్ష్మికిఁగేళి నివాసమోయనన్. 19

సీ. పొదలఁద్రిమ్మరు తేఁటి కొదమచేరువజాఱు కప్పుపెన్నెఱిగుంపు గరిమఁదెల్పఁ
గొసరి కోయిలచవి గొన్న పల్లవపాళి పలుగంటి కెమ్మోవి చెలువుఁబూన
లేగాలిఁ జెదరిరాలిన కోరకచయంబు త్రుటిత ముక్తాహార రుచులనెరప
నునుమంచుఁబొదవిన ననగుత్తిగమి పటీ రాలేపకుచకుంభ లీలఁజూపఁ

తే. దీవ చెలికత్తియలు దార్పఁగా వనీర
మా మహిళ మాధవ స్వామితో మనోజ
కేళి వర్తించెననఁగఁ దత్కాలజనిత
కలిత సరసాంగ శృంగార కలన దనరె. 20

ఉ. పంకరుహాంబకుండు నిజపాణి ధనుర్ఘటితాతి శాతచూ
తాంకుర బాణ సంకలితుఁడై శుకకోకిల షట్పదీనిరా
తంక చమూజయాంక నినదంబులు భోరు కలంగఁగాఁ గురం
గాంక సమీర మాధవ సహాయులతో గెలిచెన్వియోగులన్. 21

మ. పొలయల్కన్ సడలించి కెందలిరు పాన్పుంజేర్చి యామోదమం
జుల వల్లీసుమమాలికా ప్రభృతివస్తుశ్రేణిఁగై సేయఁగా
లలితాత్మ ప్రతిభానిరూఢి మధువేళాదూతి చేతోభివాం
ఛలు దళ్కొత్తఁగఁగల్గెదంపతులకున్ సంభోగ సౌఖ్యోన్నతుల్. 22

సీ. తేటగొజ్జఁగిమంచు నీటికాలువ దండవలచు మల్లియలపందిళులనీడఁ
గమ్మ పుష్పాడి దుమారమ్ముగ్రమ్మిన తమ్మి దాయతాజగతిమొత్తములమీఁద
వెలిదమ్మికొలకుల కెలనమావులక్రింద సొప్పారు కురువేరు చప్పరములఁ
గపురంపు రజపుపొక్కపుఁదావి తెమ్మెరల్ ద్రిమ్మరు నేలకీ తీవపొదల.

తే. మదన కద సోపలాలిత మదవతీ న
వాధర సుధార సాస్వాద నానుమోద
భరపరవశాంతరంగులై పరఁగుచెల్ల
పఱిలిరత్యంతమధు మాస వాసరముల, 23

సీ. ఇవి మానికపుఁగోన లివి మల్లియలతీవ లివి క్రపుటనంటు లివి మనోహ
రపుపొన్న లివి చందనపుమ్రాఁకు లివి గుజ్జులేమావు లివి తెలిదామరలకొ
లఁకు లివి మలయానిలవిధూతసుమనోరజపుదీవు లివి నిశాధిపశిలారు
చిరవేదు లివి కమ్మవిరితేనియలవాఁక లివి ద్రాక్షపందిళు లివి మిళింద
తే. గాయకనికాయకలగీతికావిరాజ
మానలవలీలతాకుంజమందిరంబు
లిట్టులనుచుఁ బరస్పర మృదులవచన
రచన లిరవొంద నంభ్రమాక్రాంతలగుచు. 24

సీ. చెలియోర్తు చరణమూన్చినశోకమునఁ గేలుగవనంటికొనియె మాకందమోర్తు
జళుకుచూపులఁజూచె సతియోర్తుతిలకంబు గొనబుపల్కులనించె గోఁగునొర్తు
మృదుగీతినలరించెఁ బ్రేంకణంబొకకల్కి మొగమెత్తెఁ గాంచనంబునకొకర్తు
మగువయొక్కతె మదింపఁగఁజేసెఁ బొగడనుగ్రుచ్చి కౌఁగిటఁజేర్చెఁ గ్రోవి నొకతె
తే. యువిదయోర్తుచల్లనూర్చె వావిలినొర్తు
నగవులీలనెరపెఁ దగనమేరు
నిక్కరణి నిలింప మృగలోచనలుతత్త
దుచితదోహదంబు లొనరసలిపి. 25

సీ. చెలువయొక్కతె గోరఁజిదిమెఁ గెంజిగురాకులడుగు కెంజాయతోఁదొడరుననియొ
కొమ్మ యొక్కతె గోసెఁ గమ్మపూగుత్తులు చనుదోయితో వాదుసలుపుననియొ
నెలఁతయొక్కతె త్రుంచెఁ గలికిమొగ్గలపిండు వరనఖశ్రీలతో దొరయుననియొ
మగువయొక్కతె వంచె మకరందరసముల నునుమోవిరుచులతో నెనయుననియొ
తే. ప్రమదవనదేవతలు నాగరమణకెక్కి
భ్రమరశుకపిక కలరవభ్రాజమాన
కుందకురువింద మందారచందనాది
తరులతారామ సీమమోదముదలిర్ప. 26

గీ. కొమ్మయొక్కతె లేమావి కొమ్మఁ బ్రాకి
ప్రోదిఁజిగురాకుఁ గోసి చేఁబూని నిలిచె
విరహిమథనార్థమై వేటవెడలుపతికిఁ
గైదువలుగూర్చు రతికాంతకరణిఁదోఁప. 27

చ. మృదుసుమశాఖ నొర్తు చెలిమెల్లనఁ గేలనమర్చి ధాత్రిపైఁ
బదయుగమూదినిక్కి సుమపంక్తులు గోయఁదదాస్యపంకజా
భ్యుదిత సుగంధపారణల కొయ్యనఁ బ్రోవయివచ్చి గండుదు
మ్మెదగమి ఘూర్ణిచంపక సమీక్షను బెగ్గిలిపాఱెనల్లడన్. 28

చ. పొలతుకయోర్తు కేలఁగొని పూవులగుత్తులఁ జెంత నొక్కపై
దలి దెసవైవఁ బెన్నురముఁదాఁకి తటాలున మ్రోల వ్రాలె న
క్కలికి సమున్నత స్తనయుగంబున కాత్మ చలించి తత్పదం
బుల శరణంబు వేఁడెనన భూరిమిళింద రవచ్ఛలంబునన్. 29

చ. పరభృతపాళినోటి కడిఁబాపిన రీతి మదావలంబబం
భరకులజృంభణంబడఁచు మాఁడ్కి శుకాళి యఖర్వగర్వని
ర్వారణ మొనర్చు భంగిఁ దలిరాకులు ద్రుంచిరి వంచిరంచిత
స్ఫురిత మరంద మెల్ల ఫలపుంజముల న్వడిఁగోసిరచ్చరల్. 30

ఉ. అంతమరుల్లతాంగులు హిమాచలకేళి వనీవిహారవి
శ్రాంతి నుపాంతపుష్పిత రసాలమహీరుహ మూలపద్మభి
త్కాంతమణీ విచిత్రిత వితర్దికఁజేరి నికుంజపుంజ వి
భ్రాంతసమీరణార్భక పరంపర లొయ్యన సేదఁదేర్పఁగన్. 31

మ. జతలైయాత్మ సఖీజనార్పితసమంచ ద్రౌప్య పాత్రాంతర
స్థితదివ్యాగమసీధువాని ప్రమదాప్తింబాడి రంతంతవి
స్మృత హస్తాంబుజ వల్లకీమిళిత తంత్రీ మంజులారావసం
గతిసంగీతకళావిశేష రచనాగంభీర భావంబులన్. 32

సీ. అరచందురుని చందమొరయు నెన్నుదుటిపైఁ గొమరారు మెఱుఁగు ముంగురులు సెదరఁ
గప్పు కీల్గొప్పు పైనొప్పు గొజ్జఁగి కమ్మవిరులు నెత్తావుల మురువుఁజూప
వృత్తంబులగు క్రొత్తముత్తియంపు సరంబులు దుటుసిబ్బెపు గుబ్బగుదులఁబొదలఁ
గసటులేనికడాని పసిఁడికమ్మలనిగ్గు లద్దంపుఁజెక్కుల ముద్దులాడ
తే. నెతిపదంబులఁ గెంపుటందియలు మొఱయ
రతిరహస్య కళాధి దేవతయనంగ
నొడలెఱుంగక నర్తింపఁదొడఁగెఁ జెలువ
మగువయొక్కతె యానవోన్మాదకలన. 33

చ. అతనునిమోహనాస్త్రమన నంగనయోర్తునటింపఁగాన ము
ద్ధతగతి నిర్జరద్రుసురఁ ద్రావ లసన్మదవల్లియంగనా
యతహృదయాలవాలమున నంకురితంబయి పాటలేక్షణ
ద్యుతులఁజిగిర్చితాఁ బ్రసవమొందె నకారణహాససంపదన్. 34

సీ. మోముదాఁటని నవ్వు మొగముగుబ్బెతయోర్తు నిర్హేతుహాసంబు నెరపఁజొచ్చెఁ
జనుకప్పు నించుక జారనీనిలతొంగి బిగువు కంచుకముఁజేదిగిచివైచె
సమయోచితమితోక్తి నమరుకొమ్మయొకర్తు వెడఁగుమాటలు పెక్కునుడువఁజూచె
నెట్టకేలకువీణఁబట్టులేమయొకర్తు బహురాగసంగతులాడసాగె
తే. ననుఁగు సకియల పజ్జఁ బాయక మెలంగు
మగువయొక్కతె యొంటిఁ ద్రిమ్మరఁగఁదొడరెఁ
గుంజదళిపుంజరంజిత కుంజసమితిఁ
ద్రిదశతరుసీధుపారణోన్మదనకలన. 35

జలవిహారము.

ఉ. పంకజగంధులిట్లు మధుపానమదోద్ధతిఁ గ్రీడసల్పి ని
శ్శంకముపాంతపంకరుహ సద్మవిహారకుతూహలంబు లో
నంకురితంబుగాఁజని నిజాననపద్మసుగంధసేవకుం
గొంకకవచ్చుతన్మధుప కోటులరొప్పుచు సత్వరంబుగన్. 36

సీ. కనదున్మదమిళింద కబరీభరము దానిఁ జలదంబుచరకటాక్షములదాని
నవఫుల్లపంకజాననవికాసము దానిఁ గలితాబ్జకంఠవైఖరులదాని
గురురథాంగవిహంగ కుచకుంభములదానిఁ బ్రాంచదూర్మివళిత్రయంబుదానిఁ
గమనీయజీవనభ్రమ నాభిగుహదానిఁ గచ్ఛపమృదుపదాగ్రములదాని
తే. లలితకలహంసగమన కౌశలముదాని
భూరిగంభీరభావ విస్ఫురణదానిఁ
బ్రబల సర్వంకష ప్రౌఢిఁబరగుదానిఁ
జెంతనొకసరోలక్ష్మి నీక్షించి చెలులు. 37

గీ. అళుల కాకటిపంట యంచలకువచ్చు
పట్టు వెలిదమ్మి తుటుములపుట్టినిల్లు

కమ్మతావులకత్యాస్పదమ్ము దీనిఁ
బొగడఁజాలుదు రెవ్వారుజగతి ననుచు. 38

గీ. బహుళతర కంకణోర్మికాభాసమాన
మబ్జరేఖాది శుభలక్షణాన్వితంబు
నగుచుఁగమలాకరంబ నిజగతిఁబొగడ
నతిశయిల్లదె యీకమలాకరంబు. 39

క. అనిపొగడుచు వనజేక్షణ
లనుగతసంభ్రమము కలిమినంఘ్రిసరోజ
స్వనదబ్జ రాగమణికాం
చన చిత్రితనూత్నకటక సంరంభమునన్. 40

ఉ. గంధపుఁగొండ వాసమపుగాలిఁజలించు ప్రఫుల్లమల్లికా
మందిరపాళిపుప్పొడిదుమారముఁజల్లిన చందమామ తా
యందపుఁద్రోవఁగాంచన సురాగరసాల నమేరుపాటలీ
చందన భూజరాజముల చాయలనేఁగి సరోవతంసమున్. 41

మ. ప్రమదల్ డాసి కటీదుకూలములఁ దత్ప్రాంతంబునం బెట్టి యొ
క్క మొగిం గట్టి జిలుంగుపావడలుడిగ్గన్ రత్నసోపానపా
ళిమరాళీకులముల్ త్రపాభరముఁదాల్చెన్ దేవకాంతాభిర
మ్యమణీనూపుర విస్ఫురచ్చరణవిన్యా సప్రభావంబునన్. 42

గీ. సరసిజేక్షణ లంత కాసారజలవి
హార మొనరింప భృంగరథాంగసమితి
తొలఁగి నల్గడఁ బఱచె నిస్తులతదీయ
కచకుచశ్రీల కోడిన కరణిఁదోఁప. 43

సీ. ఒకతమశ్చికుర మూలకు నెత్తి వెనువెంట నంటెఁబూర్ణసుధాకరాస్యయొకతె
యొకదంతి గమనఁగొంచకపట్టికొసి గాసిలఁగఁజేసె సింహావలగ్నయొకతె
యొకబింబ ఫలరదాంశుక డాసి చీకాకుఁజేసెఁ గీరవచోవిలాసయొకతె
యొకమీననయనఁ బైకుఱికి కాఱియవెట్టి స్రుక్కించెఁ జక్రవక్షోజయొకతె
తే. యలఘుగతి నొక్క భ్రమరరోమాళిఁ దఱిమె
గలితకాంచననాసి కాంగక యొకరితె

యంబుజాకర పాథోవిహార కలన
సమ్మదాంబుధినోలాడు సమయమందు. 44

సీ. విపులశైవల లతావిసరంబుఁ బెకలించెఁ గోకదంపతులఁ జీకాకుపఱచె
వ్యాకోచసార సానీకంబు దునుమాడె మృదు మృణాళంబులఁ జిదిమివైచె
సరసపత్త్రిల్లునంచలఁ జలింపఁగఁజేసె విమలదరశ్రేణికొమరు మాన్చెఁ
గమ్మతేనియలనల్లడలఁ గ్రమ్మఁగఁ జిమ్మె బెళుకుబెడిసమీల పాలుపడంచె
తే. నంగభవరాజు మదపుటేనుంగు కరణి
సుదతియొక్కతె కచకుచవదన బాహు
గమనకంఠోష్ఠరుచికటాక్షములతోడ
సరిబెనఁగవచ్చునని యెడిశంక నొక్క. 45

గీ. లికుచకుచయోర్తుతతిమిషట్టికొనరాఁగ
రమణియొక్కతె మునిఁగిదూరమునఁ దేలెఁ
దమ్మిఁగెంగేలఁబూని సుధాపయోధి
గర్భముననుండి వెడలినకమలవ్రాలె. 46

ఉ. కోమలియోర్తుకాంచన పుఁగొమ్మున నీరమునించి యొక్కక
న్యామణిమీదఁ జిమ్మఁగదియంజను దెంచిన నాత్మవక్త్రిమ
క్కామినికప్పుపెన్నెఱులఁగప్పిన నెప్పెమొగంబు షట్పద
స్తోమము గ్రమ్మికొన్న నవతోయరుహస్ఫురణంబుఁ దెల్పుచున్. 47

వ. అంత. 48

మ. జనలోకాంతర భూరి వైభవనిరీక్షాబుద్ధినాత్మీయ సం
జననస్థానముఁ బాసివచ్చిన ఫణిశ్యామామణుల్వోలె జీ
వనజాగార విహారముందొలఁగియవ్వామల్ సరస్తీరమెం
దినఁ జెన్నొందె సవృష్టి మేఘములరీతిందచ్ఛిరోజావళుల్. 49

గీ. అంబుజాకరతటినిట్టులలరుచున్న
యంగనలయార్ద్రధవళాంశుకాంత రాళ
విలసదూరు ప్రదేశముల్ పొలుపెసంగ
మంచుఁ బొదివి నయ నఁటికంబములువ్రాలె. 50

సీ. తడియొత్తి నెఱులార్చి తావులీను సుపర్వతరుసూనమాలిక లిరవుకొల్పి
తెలికొత్తుసబ్బపొందమ్మి మొగడలఁ బిక్కటిలుగుత్తపుఁ గంచుకములు దొడిగి
కమనీయకస్తూరికాకుంకుమాగరుఘనసారసురభిచందన మలంది
నిరుపమామూల్యమాణిక్య భూషణపరంపరలంగల తలఁజొప్పడనమర్చి
తే. సారసరసీతటీ ప్రదేశంబుఁ బాసి
సానబట్టిన ననవిలు కానిచేతి
శాతశర హేతులన మించి చంచలాక్షు
లతిశయోల్లాస పారవశ్యమునఁ బొదలి. 51

సీ. మణికూట పటలి వెంబడిడిగ్గుమిన్నేటి నీటితుంపురులరాణించుచోట
హరిదంతరంబుల కామోదము ఘటించుఘనసారకదళికల్ గలుగుచోట
మలయానిలకిశోరములు గదల్పఁగసురాగపరాగపూరంబు గప్పుచోట
నళికదంబములపేశలగాన మధురిమ నలరుజొంపపుఁ దీవలలరుచోట
తే. సమదశుకపిక కలరవశారికామ
యూరసారసముఖవిహంగార వ్రాద్య
దభిన వారామసీమలొప్పారు చోట
లీలవిహరింప నందు మేనాలతాంగి. 52

సీ. ముడిచిన జడగట్టు నిడుదపెన్నెఱిగుంపు దలిరుజొంపపుఁ గెంపుఁదళుకులీన
బ్రహ్మతేజంబుట్టి పడునెమ్మొగమురీవి రాకాశశాంకగౌరవ ముఁదెల్ప
నానిమీలిత విశాలాలోకగరిమంబు ముకుళితాంభోజనంభూతి నెరప
నాభోగభవుక భస్మాంగ రాగ విలాసమమృతంపుఁ జాయచందము ఘటింప
తే. నిస్తులతపోని హతపాపు నిరతశాంతు
వీతరాగున ఖండసంవిత్స్వరూప
భావనాభ్యాస పరవశు భవ్య చరితు
మారసుకుమారు గాధికుమారుఁ గనియె. 53

చ. కనుఁగొని తన్విభీతిదొలఁకన్స్మరుదాత పశీతవృష్టిసం
జనితములైన బాధలకు సైఁచినవాఁడచలస్థిరుండఖం
డనియతుఁడేయుపాయమునడాయుదుఁ జేయుదు విఘ్నమేతెఱం
గుననితఁడాచరించునతి ఘోరతపంబునకంచు వెండియున్. 54

ఉ. కామకళాభిరూప్యమృదుగాన వినోదములం జరించుక
న్యామణులిట్టికార్యములొనర్పఁగఁజాలుదు రేయుగంబునం
దీముని సార్వభౌముని సమిద్ధతపో మహిమాంతరాయచిం
తామయమంతరంగమున కార్తిఘటించెన వైద్యసాధ్యమై. 55

గీ. విషయసౌఖ్యంబుఁ గోరక విమలచిత్తుఁ
డై తపోనిష్ఠనూఁది హిమాద్రిఁ బెక్కు
హాయనంబులు గడపిన యనఘమూర్తి
యితఁడు సామాన్యుఁడే జగన్నుతుఁడు గాక. 56

గీ. శమము దమము బ్రహ్మచర్యంబు శాంతియుఁ
దాపసులకు సర్వధర్మములగు
నెక్కుతఱినిఁ గోపముదయింపదు దయించె
నేని జగము తెల్లహానిఁ బొరయు. 57

క. మొదలఁగుపితాత్ముఁడవ్వల
సదమల యోగప్రశమిత సర్వేంద్రియుఁడై
సదుపాయమున నితనిఁజెన
కఁదగు సతులకంత తాల్మిగలదే జగతిన్. 58

క. కనుఁదెఱచి దెసలు చూడక
మనమతి నిశ్చలతఁ బెనఁచిమానని యతిఁదా
ల్చునితనిఁ బల్లవశరభ
ల్లనిపీడితుఁ జేయనేనెలఁత నేర్తుమహిన్. 59

మ. ననురావించి సభాంతరాళమున సన్మానించి యింద్రుండు బం
చిన నేనిచ్చటి కేఁగుదెంచి యిదినాచేఁగా దసాధ్యంబటం
చని యేఁ గ్రమ్మఱిపోయినన్ నగరె రంభాదుల్ ననుంగాంచి య
య్యనిమేషాధిపుఁడేల గౌరవముఁ జేయంజూచు నూహింపఁగన్. 60

చ. అనితలపోసి నెమ్మదిసురాంగన చారున మేరుకుంద చం
దనకురువిందపాదపవితానసమావృతనిర్ఝరీతటం
బునలవలీలతాగృహము బొంతవసించికరాబ్జవల్లకీ
నినదముతోడఁ బాడెహరినీలదరీనికరంబురంజిలన్. 61

మ. కమనీయంబగు వల్లకీరవము సాంగత్యంబునన్మించుచం
ద్రముఖీగాన సుధారసంబు శ్రవణానందానుసంధానమై
యమరం గౌశికుఁ డంతలో వికచనేత్రాంభోజుఁడై తేచిబ్ర
హ్మమసుధ్యానపరాయణంబగు నిజస్వాంతంబు రంజిల్లఁగన్. 62

క. ఆమెతలోసంగెఁగలకం
ఠీమృదుగానంబు పొందు నెలకొనియళినీ
కోమలరుతి జతయైది
వ్యామృత మాధుర్యధుర్యమై వీనులకున్. 63

శా. ఈనీహారనగాధి రాజమున నీహారాబ్జరాగాదిర
త్నానూనద్యుతి వొల్పునీదరులనీ యారామసీమాలతాం
తానేకాయతన ప్రదేశముల మున్నాలింపలేదెన్నఁడీ
గానంబిప్పుడె సంగె మామకమనః కౌతూహలాపాదియై. 64

మ. అతిమాధుర్యరసైకమై శ్రవణయోగ్యంబై ప్రతిధ్వానఘూ
ర్ణిత దిక్కందరమై విచేష్టిత శకుంతీబృందమై పల్లవ
ప్రతతస్థాణుకదంబమై నవరసార్ద్రంబై ద్రవీభూతసా
రతరాశ్మవ్రజమై చెలంగెమృదులారావంబుతోరంబుగన్. 65

మ. తలఁపన్నా నవమానినీ మణులకేతద్విస్ఫురద్గానల
క్ష్మీలవంబబ్బునెకిన్నరీకరవిపంచీగానమో షట్పదీ
కలగానామృతమోవియచ్చరవధూగానంబొ గంధర్వభా
మలసంగీత నినాద మొక్కొయిదిసామాన్యంబెచర్చింపఁగన్. 66

క. అనిపొగడుచు గాధిసుతుం
డనుపమహిమశైలకల్పకారామదరీ
ఘనసానుకటకసులతాం
తనికుంజకుటీవిహారతత్పరమతియై. 67

చ కనియెఁగనత్కపోలతలఁగంజవిలోచనఁ గంబు కంఠిఁగాం
చనసుమనాసఁ గర్కశ కుచద్వయఁగజ్జలకైశికంగల
స్వనఁగనకాభదేహఁ గరిసన్నిభయానఁగశాధరోపమా
ననఁగమనీయ భూషణ గణంగలికిం గరభోరుఁగన్యకన్. 68

గీ. అన్నుఁదలమిన్న నెమ్మోము గన్నుదోయి, యబ్జరాజీవసంపద నపహసించుఁ
గన్యకామణిమృదుగళకరతలంబు, లబ్జరాజీవసంపద నపహసించు. 76

ఉ. చానమెఱుంగుమే న్పసిఁడిచాయకు దాయ గదా రదాంశుక
శ్రీ నగుఁ గెంపుపెంపుఁ గబరీనిబిరీసరుచుల్ మొయిల్ బయల్
గానుహూయల్ దొడల్ కదళికల్ కళికల్ నఖకాంతి దంతి సొం
పొనడ మోముక్రొమ్మెఱుఁగు నద్దపునిద్దపుడాల్ నుతింపఁగన్. 77

మ. సతి శృంగారరసస్రవంతి యనఁ జంచద్వేణిశైవాలసం
తతి శ్రోణీపులినోన్నతి న్నయనమీనశ్రీ వళీభంగసం
గతి నాభీసలిలభ్రమాప్తి గళశంఖస్ఫూర్తి వక్త్రాంబుజ
ద్యుతి వక్షోజరథాంగలీలఁ జెలువొందుం జూడ్కికి న్వేడ్కగన్. 78

చ. కటి నటియించు వేణి దెలిగన్నులు వీనులతోడఁ గూర్మిము
చ్చటలకు డాయుఁ జన్నులకుఁ జాల దురం బతిసూక్ష్మమధ్య మె
న్నటి కొరుకన్నులం బడదు నాతికి నాభిగభీరభావ ము
త్కటమతి శేషుఁడే పొగడఁ గావలె నన్యుల కెన్న శక్యమే. 79

మ. కమలానందనభాగ్యరేఖ శుకరాడ్గంధర్వసమ్మోహనా
స్త్రము మీనధ్వజరాజ్యలక్ష్మి రతిరాజప్రాజ్యకేళీవనీ
సుమనోవల్లరి సూనకార్ముకకళాస్తోమాధిదైవంబు మా
రమహత్త్వోదితమంత్రవిద్య యన నౌరా యింతి చూడం దగున్. 80

ఉ. శంబరభంజనుం డజుని సంప్రతియై సృజియింపఁ బోలు నీ
యంబుజగంధి నీమెఱుఁగుటద్దపుఁజెక్కులు ముద్దుమోము పొం
కం బగుచన్నులున్ బెళుకుఁగన్నులు సన్నపుఁగౌను మించుఁదీ
వం బురడించుమేనిచెలువంబును నెవ్వతె కబ్బుఁ గానిచోన్. 81

ఉ. ఇన్ననబోఁడి నీచెలువ నీయెలప్రాయపుముద్దుగుమ్మ నీ
యన్నులమిన్న నీమెఱుఁగుటందపుమేనిమిటారిఁ జూడ్కిఁ గ
న్గొన్న మనంబునం గలయు కోరిక లీరికలెత్తు బాపురే
క్రొన్ననవింటిరాచదొరకు న్నరమాత్రుల కెన్న నేటికిన్. 82

చ. మరుఁ డనుశిల్పకారకుఁ డమర్చినచిత్తరుబొమ్మ నామనో
హరతనురూపలక్షణకళాన్విత యై తగుదీనిఁ జూచి దు

గీ. అన్నుఁదలమిన్న నెమ్మోము గన్నుదోయి, యబ్జరాజీవసంపద నపహసించుఁ
గన్యకామణిమృదుగళకరతలంబు, లబ్జరాజీవసంపద నపహసించు. 76

ఉ. చానమెఱుంగుమే న్పసిఁడిచాయకు దాయ గదా రదాంశుక
శ్రీ నగుఁ గెంపుపెంపుఁ గబరీనిబిరీసరుచుల్ మొయిల్ బయల్
గానుహళాయల్ దొడల్ కదళికల్ కళికల్ నఖకాంతి దంతి సొం
పౌనడ మోముకొమ్మెఱుఁగు నద్దపునిద్దపుడాల్ నుతింపఁగన్. 77

మ. సతి శృంగారరసస్రవంతి యనఁ జంచద్వేణిశైవాలసం
తతి శ్రోణీపులినోన్నతి న్నయనమీనశ్రీ వళీభంగసం
గతి నాభీసలిలభ్రమాప్తి గళశంఖస్ఫూర్తి వక్త్రాంబుజ
ద్యుతి వక్షోజరథాంగలీలఁ జెలువొందుం జూడ్కికి న్వేడ్కగన్. 78

చ. కటి నటియించు వేణి దెలిగన్నులు వీనులతోడఁ గూర్మిము
చ్చటలకు డాయుఁ జన్నులకుఁ జాల దురం బతిసూక్ష్మమధ్య మె
న్నటి కొరుకన్నులం బడదు నాతికి నాభిగభీరభావ ము
త్కటమతి శేషుఁడే పొగడఁ గావలె నన్యుల కెన్న శక్యమే. 79

మ. కమలానందనభాగ్యరేఖ శుకరాడ్గంధర్వసమ్మోహనా
స్త్రము మీనధ్వజరాజ్యలక్ష్మి రతిరాజప్రాజ్యకేళీవనీ
సుమనోవల్లరి సూనకార్ముకకళాస్తోమాధిదైవంబు మా
రమహత్త్వోదితమంత్రవిద్య యన నౌరా యింతి చూడం దగున్. 80

ఉ. శంబరభంజనుం డజుని సంప్రతియై సృజియింపఁ బోలు నీ
యంబుజగంధి నీమెఱుఁగుటద్దపుఁజెక్కులు ముద్దుమోము పొం
కం బగుచన్నులున్ బెళుకుఁగన్నులు సన్నపుఁగౌను మించుఁదీ
వం బురడించుమేనిచెలువంబును నెవ్వతె కబ్బుఁ గానిచోన్. 81

ఉ. ఇన్నవబోఁడి నీచెలువ నీయెలప్రాయపుముద్దుగుమ్మ నీ
యన్నులమిన్న నీమెఱుఁగుటందపుమేనిమిటారిఁ జూడ్కిఁ గ
న్గొన్న మనంబునం గలయు కోరిక లీరికలెత్తు బాపురే
క్రొన్ననవింటిరాచదొరకు న్నరమాత్రుల కెన్న నేటికిన్. 82

చ. మరుఁ డనుశిల్పకారకుఁ డమర్చినచిత్తరుబొమ్మ నామనో
హరతనురూపలక్షణకళాన్విత యై తగుదీనిఁ జూచి దు

స్తరతరమోహవిభ్రమముఁ దాల్చు విభూతిమృగాజినాంబరా
భరణుని నన్ను నేపగిదిఁ బైదలి పొందుఁ గృపార్ద్రచిత్తయై? 83

క. తలిరుంబ్రాయము చెలువము, గలవానిన కాక రూపకాంతివిలాసం
బులు సెడి యుపవాసవ్రత, ముల డస్సినయతుల సతులు మోహింతురొకో? 84

మ. అనయం బీచలిగొండ నెత్తముల నేత్రానందసంధానచం
దనమందారవనప్రదేశముల నానాసూనసౌరభ్యశో
భనవల్లీనిలయంబుల న్మణిదరీభాగంబులం బాయ కి
వ్వనితం గూడినవాఁడు గోరఁడు గదా స్వర్లోకసౌఖ్యోన్నతుల్? 85

మ. అని చింతించి విరించిపాదకమలధ్యానామృతాస్వాదసం
జనితామోదరసానుబద్ధుఁ డమరశ్యామాతనూరూపయౌ
వనలావణ్యనిరీక్షణోచ్చలితభావస్థైర్యుఁ డయ్యెంగదా
యని పైపై నిగిడించె మారుఁ డనివార్యక్రూరనారాచముల్. 86

సీ. కలకంఠకంఠిమంజులవచోగరిమ వీనులవిందుగా వినఁ గలిగె నేనిఁ
గొమరాలిసిబ్బెంపుగుబ్బపొందమ్మిమొగ్గలు పేరెదకుఁ జేర్పఁ గలిగె నేని
నచలోపమనితంబరుచు లీను కెమ్మోవికమ్మఁదేనియ లానఁ గలిగె నేని
బిసజాతముఖికొప్పున సురద్రుసుమమాలికలు ప్రోది యొనరింపఁ గలిగె నేని
తే. లలితయౌవనరూపవిలాసభాస, మాన యగునీతలోదరి మనసు దీఱ
రతిఁగలయఁగల్గెనేనిఁ బూర్వకృతభూరి, సుకృతఫలరాశిఁ గన్నులఁ జూచినటుల.

ఉ. ఆరయ నిమ్మృగేక్షణ ఐయశ్శుభలక్షణలక్షితాంగి శృం
గారకళాభిరామ త్రిజగన్నుత దీనిఁ బరిగ్రహించి యి
చ్చారతిసౌఖ్యసంపదభిషంగతుఁడై తగఁ డెవ్వఁ డాతఁ డ
మ్మారునిబారిఁ బ్రాణమును మానము నిల్పికొనంగ నోపునే? 88

ఉ. ఏచి మనోభిమానధన మెల్ల మనోజుఁడు చూఱఁ బట్టె నా
రాచపరంపరానిహతి రాజముఖీమణి నన్నుఁ గూర్పఁగా
నేచినపుణ్యశాలి కవినిందిత మాత్మతపఃఫలంబు నే
డాఁచక యిత్తు సర్వముఁ గడంకమెయిన్ జను లెల్ల మెచ్చఁగన్. 89

క. అపరిమిత మైనయిమ్మో, హపయోనిధి నిస్తరింప నలవియె నాకుం
జపలమృగాయతనయనా, విపులకృపాతరణిఁ గాక వే ఱొకభంగిన్. 90

చ. హరిహరపద్మగర్భులు మహామహులంతటివారు నాత్మసుం
దరుల నురంబునం దనువునన్ వదనంబునఁ గూర్చి నిల్పి సు
స్థిరతరసౌఖ్యసంపదలఁ జెన్నలరారుటఁ జిత్తభూభయం
కరవిశిఖార్తికిన్ వెఱపుఁ గైకొని కాదె తలంచి చూడఁగన్. 91

ఉ. ఈకమలాక్షి యీకలికి యీమెఱుఁగారుపసిండిబొమ్మ యీ
కోకిలవాణి యీకుసుమకోమలి యీలలితాంగి కూరిమిం
గైకొని నన్ను నీప్సితసుఖంబులఁ దేల్చినఁ గాక కానిచో
నాకుసుమాంబకుండు నిశితాస్త్రముల న్ననుఁ గోలుపుచ్చఁడే. 92

క. అని యివ్విధమున నబ్జా, ననమోహనరూపయౌవనవిలాసములం
దనివి సనక తనమనమునఁ, గొనియాడుచు వలపు నిలుపఁ గూడక యంతన్. 93

ఉ. ఆపరమర్షిపుంగవుఁ డనాహతకంతులతాంతకుంతసం
తాపభరంబునం బొడమతత్తఱపాటునఁ దాల్మిఁ దూలి ని
ల్వోపక వెచ్చ నూర్చుచుఁ బయోజముఖీమృదుగానగుంభితం
బై పొలుపొందుకుంజనిలయంబున కేఁగె దృఢానురాగుఁడై. 94

ఉ. భూరితపఃప్రభావపరిపూర్ణుఁడు గాధిసుతుండు చిత్తజ
ప్రేరితచిత్తవృత్తి నధరీకృతశాంతశమక్షమాతపో
గౌరవుఁడై నిలింపగణికాసురతప్రియుఁ డయ్యె నుర్వి నె
వ్వారల కింద్రియంబు లనివార్యము లుద్ధతముల్ గణింపఁగన్. 95

క. అరుదెంచుజటామకుట, స్ఫురితశిరోభాగు భూతిశోభితదేహున్
హరిణాజినరుచిరాంబర, ధరుఁ గౌశికుఁ జూచి చెలులు తన కెఱిఁగింపన్. 96

సీ. జలజారిఁ బొంచి లగ్గలు వట్టునిరులు నా లపనమండలిఁ గుంతలంబు లెసఁగఁ
గనకాద్రిశృంగసంగతవినిర్ఝరవారిధార నాఁ గుచపాళి హార మలర
విపులరత్నాకరావృతమహీతలము నా రత్నకాంచీకటీరంబు వెలయ
స్మరశరాసనాన్వితశాతాంబకములు నా భ్రూచంచలకటాక్షములు చెలఁగ
తే. నులికి డిగ్గన లేచి వేనలియుఁ గొనుఁ, గదల నొక్కింతజిలుఁగుఁబయ్యెదయుజాఱ
నెదురుగా వచ్చి కొంతద వ్వుదితభక్తి, యుక్తిఁ గేల్మోడ్చి సతి మునీంద్రోత్తమునకు.

క. కొమ్మని యుపాయనమ్ముగఁ, గమ్మనివాసనలు దెసలఁ గ్రమ్మెడుసుమహా
రమ్మొకటి యప్పు డనురా, గమ్మున నర్పించి పలికెఁ గాంత మృదూక్తిన్. 98

సీ. కృతకృత్య యిది యెల్లఋతువుల హృద్యానవద్యసౌరభరమావాప్తి నలరు
ననఘాత్మ యిది మనోజ్ఞామందమకరందధారాప్రవాహసంతతుల నీను
మౌనీంద్ర యిది పూర్ణిమాసుధాకరమండలాంశూపమాన శైత్యంబు నెరపు
రవితేజ యిది చతుర్వనధిమధ్యక్షమారాజ్యభోగధురంధరత్వ మొసఁగు
తే. నాయురారోగ్యపుత్రపౌత్రాది సకల, కామితఫలప్రదానదీక్షావిరాజ
మాన మిది దీనిమహిమ మనూన మహిత, లాధిపున కైన వాక్రువ్వ నలవి యగునె.
క. మీర లనూనతపోమహి, మారూఢచరిత్రు లీశ్వరార్చాపరు లౌ
టారయ నీకల్పకసుమ, హార ముచిత మూన మీ కనర్ఘ మెరులకున్. 100
క. చిరకాలతపోనిష్ఠా, గరిమ నభిమతార్థసిద్ధిఁ గాంచినత్రిజగ
త్పరిపూరితనిర్మలతర, చరిత్రులరు గాక మీరు సామాన్యులరే. 101
క. త్వరితగతి మీర లెచ్చటి, కరుగుచు నిచ్చోటి కిప్పు డరుదెంచితి రి
గ్గిరిఁ దరియరు మానవు లెవ్వరు మీ రుత్తముల రగుట వచ్చితి రిటకున్. 102
ఉ. ధీయుతమూర్తి సర్వజగతీజనతాభినుతప్రభాతనూ
ర్జ్యాయతతేజ నీయది సమాగమనం బభివాంఛితార్థసం
ధాయక మయ్యె నీచరణతామరసార్చ లొనర్ప నోచితిం
గా యిటువంటిపుణ్యఫలగౌరవ మేరికిఁ గల్గు నుర్వరన్. 103
చ. అనుడుఁ బ్రమోద మొంది విను మబ్జముఖీమణి గాధిరాజనం
దనుఁడను కౌశికుం డనెడునామముఁ దాల్చినవాఁడ నిన్నగం
బున నజుఁగూర్చి నిశ్చలతపోనియతిన్ వసియించి యుండఁగాఁ
జనియె గణింప రాక నిమిషంబులు వోలె ననేకవర్షముల్. 104
గీ. అనిన నింతి పల్కె ననఘాత్మ నీ వెద్ది, గోరి యీహిమాద్రి భూరినిష్ఠఁ
దపము సలిపి తయ్య కృపతోడ నెఱిఁగింపు, మనిన మరల నిట్టు లనియెఁ జెలికి.
క. కడలిమొలనూలిపడఁతికి, నొడయఁడనై యెల్లసిరుల నొరయుచుఁ బగఱన్
బొడ వడఁచి రాజధర్మము, లెడపక యిల నాల్గుచెఱఁగు లేలుచు మఱియున్. 106
ఉ. ఏ నొకనాఁడు వేడుక మదేభరథాశ్వపదాతిసైన్యసం
తానము గొల్వ వేఁటపయనం బయి కానకుఁ బోయి దుర్మదా
నూనమృగావళిం దునిమి యుద్ధతశక్తి నగమ్యభూమిభృ
త్సానుదరీఝరీకటకసాంద్రతదుగ్రతరాయతాటవిన్. 107

క. చతురంగంబులతో నా, యత మగునొండొకమహీరుహచ్ఛాయఁ బ్రచం
డతరార్కకిరణజనితా, ద్భుతతాపముఁ దీర్చికొనఁగఁ బోలు పొందుతతిన్. 108

క. చారు లరుదెంచి పలికిరి, చేరువఁ గనుఁగొంటి మధిప సెలయేటిదరిన్
జారుతరశ్రుతిచయవా, చారంజిత మొకఁడు తాపసవనోత్తమమున్. 109

చ. అన విని సంతసిల్లి చతురంగబలంబులతోడఁ జెచ్చెరన్
జని యభిరమ్యసర్వమహిజాతలతాఫలపుష్పశోభితం
బనుగతభృంగకోకిలశుకారవవిస్ఫురితంబునై జగం
బు నుతికి నగ్గలం బగుతపోవనిఁ జూచి తదంతరంబునన్. 110

గీ. బలసమూహ మెల్ల నిలిపి యొక్కరుఁడన, చని నిమీలితాక్షు శమితమోహు
నతికృపార్ద్రహృదయు నాత్మానుసంధాన,పరు వశిష్ఠుఁ గాంచి పరమభక్తి. 111

క. ప్రణమిల్లి సముచితోక్తులఁ, బ్రణుతించిన నా కతండు బాహుయుగాశ్లే
షణసుఖవిమలాశీర్భా, షణకుశలప్రశ్నములను సంభ్రమ మూన్చెన్. 112

ఉ. నన్నిటు గారవించి జననాథశిరోమణి నీప్రభుత్వసం
పన్నతఁ గాదె నిచ్చలును మాదృశమౌనిమహాతపంబులున్
జన్నములున్ శుభక్రియలు సర్వమహీరుహగోకదంబముల్
వన్నెయు వాసియుం గలిగి వర్తిలుటల్ వసుధాతలంబునన్. 113

గీ. అవనిరాజవు నీకు నెల్లవియుఁ గలవు, వేఁటనెపమున ఘోరాటవీప్రదేశ
మునకు వచ్చుట నాతపోవనము నన్నుఁ, గనుఁగొనఁగఁ జాలి తిది నీకుఁ గరము శుభము

క. నానెలవునఁ గల దెద్దియొ, దానిన నీ కిడుదుఁ గూర్మిఁ దగఁ గుడిచి చనం
గా నర్హమగు ననిన విని, యే నాతని కంటి నప్పు డిందునిభాస్యా. 115

క. మిముఁ గనుఁగొనుటయ యతిభద్ర మదియ యాతిథ్య మొండు దలఁపకుము రథే
భముఖాత్యురుతరబలసం, ఘముతో వచ్చుట నొకండఁగాను మహాత్మా. 116

చ. అనుడు నతండునున్ బలచయం బవిలేఖ్యమకాని నాకుఁ గ
ల్గినయవి వన్యముల్ నృపకులీనసమాదరణీయవస్తువు
ల్వనమున నుండువారల కలభ్యము లెయ్యది ప్రీతిఁ బెట్టినన్
గొను నది యెంతవారలు మనోజ్ఞసుధారసధారకై వడిన్. 117

వ. అని యమ్మహానుభావుండు కామగవిసంతానం బైన హోమధేనువు నాకర్షించి, యితం
డఖండభూమండలాఖండలుం డగువిశ్వామిత్రుండు మృగయావినోదంబు దవిలి

యిద్దురంతకాంతారంబునం గలమృగసంతానంబు నోడించి బహుసైన్యసమేతుండై మనయాశ్రమంబున కరుదెంచినవాఁడు,సగౌరవంబుగా నితని కాతిథ్యంబుఁజేయు నది నీ నేర్పుకొలఁదిరాజపరివారంబులఁ దత్తన్మనోభీష్టమృష్టాన్నంబుల సంతుష్టంబులుగాఁ జేయు మనిన నది మహాప్రసాదం బని యంగీకరించి యంత. 118

క. పలుతెఱఁగు లైనవంటక, ములుఁ గూరలుఁ బాయసాన్నములు మృగమాంసం
బులు దధిమధుఘృతసూపం, బులతో నాసురభి సైన్యముల నచుఁ దేల్చెన్. 119

క. మది నెవ్వ రెద్ది గోరిన, నదియ పొదలుఁ గుడుచుపాత్రలందు మిగుల నె
య్యది కొదువఁ గాన మించుక,సుదతి మొదవుమహిమఁ బొగడ శూలికిఁ దరమే?

ఉ. అంతఁ గుతూహలాద్భుతము లాత్మఁ బెనంగఁ జతుఃపయోధిప
ర్యంతధరాధిరాజ్యవిభుతాధికభోగము లెన్నియేని నా
వంతయు నీడె దీనిమహిమాతిశయంబున కౌర యంచు నే
నెంతయు నమ్మహాసురభి నెన్నుచు నమ్మునితోడ వెండియున్. 121

చ. పలికితి గోసహస్రము లపారధనంబు మదేభఘోటకం
బులు బహులక్షలిత్తు మునిపుంగవ యిమ్మొదవి మ్మటంచు న
య్యలఘుఁడు దాని నీ కునికి నాగ్రహ మూఁది మదీయభృత్యులం
బలువురఁ బుచ్చితిఁ బలిమిఁబట్ట సమర్థత గల్గువారలన్. 122

సీ. పనిచిన నురిత్రాళ్లుఁ బగ్గముల్ సెలగోలలును మొదలైనసాధనము లూని
యెలుఁ గెత్తి యదలించి నలుగడఁ గ్రమ్మి యల్లనఁ బట్టఁ బోయిన ఘనవిషాణ
ఖురటంకహతిభటోత్కరముల నలయించి కాననశైలదుర్గమనదీన
దమ్ములు దాఁటి యుద్ధతిఁ బట్టు వడక యేపును చేవయును గల్గి భూరిరోష
తే. మెనసి యమ్మొదవు వశిష్ఠమునివరేణ్యుఁ, గదిసి దీనాస్యయై నయగౌరవోక్తిఁ
బలికె నీభూవరకిరాతభటులు దొడరి, బలిమి నసుఁ బట్ట వచ్చిన నలుక నోడమి.

క. ఘనఖురటంకవిషాణా, గ్రనిహతిఁ బోఁ జిమ్మి తత్కిరాతబలతతిం
జను దెంచితి నీచెంతకు, ననఘా న న్నొసఁగితే దయాహీనులకున్. 124

చ. అనుటయు నాతఁ డిట్టు లను నక్కుశికాన్వయమౌళి నీవు పె
ట్టినవివిధాన్నపానముల డెందమున న్వెఱఁ గంది న న్నతం
డెనసినపేర్మి ని మ్మొదవు ని మ్మన నామది నొప్ప కున్కి నా
యన బలవంతుఁ డౌట జనితాగ్రహుఁడై నిను బల్మిఁ బట్టఁగన్. 125

గీ. బహుకిరాతకోటిఁ బనుచుటయు నెఱింగి, యును బలాధికుండు మనుజనాథుఁ
డేఁ దపస్వి బలవిహీనుండను నిరాయు,ధుండఁ గాన నూర కుండ వలసె. 126

గీ. అనుడు మొదవు వల్కు నడఘాత్మ నాకాన, తిమ్ము నృపబలమ్ముఁ దెంపు మిగిలి
యోపినంత పోరి యు క్కడఁ గింతు నా, నట్ల సేయునది జయంబుఁ గోరి. 127

క. అని మాని యాన తిచ్చిన, ననుగతరోషారుణాక్షమై యప్రతిమం
బనితరలక్ష్యం బగుబల, మున మెఱసి నిలింపసంఘములు వెఱఁ గందన్. 128

మ. ఖురనిర్ఘాతమహీరజస్స్థగితదిక్కూలంబు లాంగూలని
ష్ఠురవిక్షేపసమీరణోత్పతదగస్తోమంబు వజ్రాతిభీ
కరశృంగాగ్రవిభిన్నభూధరశిలాకాండంబు నై యమ్మహో
సురభిగ్రామణి సేనలం గదిసి యస్తోకప్రతాపంబునన్. 129

గీ. వాలవిక్షేపసంజాతవాతనిహతిఁ, గఠినతరఖురటంకవిఘట్టనమున
గాఢనిర్ఘాతపాతశృంగప్రహార, ముల నెదురు లేక సేనలఁ బిలుకు మార్చె. 130

సీ. వృథశక్తి మూత్రపురీషాంగరోమకూపముల దుర్భరభుజాబలసమగ్రు
లను మలీమసగాత్రులను భూధరోన్నతులను శరాసనబాణనునిశితాసి
పరశుముద్గరగదాప్రాసైకపట్టసప్రభృతిసాధనులను బహుకిరాత
యవనపుల్కసుల సంఖ్యల కశక్యముగ సృజింప నాశూరు లాశీవిషోప
తే. మానరోషాకులస్వాంతు లై నితాంత,శౌర్యదుర్వారు లై రథాశ్వద్విపాది
సైన్యసంక్షోభ మొనరింప జాలిమాలి, శరశరాసనపాణి నై యరద మెక్కి.

గీ. కడఁగి యవనకిరాతపుల్కసుల వేల,సంఖ్యల వధించి దివ్యాస్త్రసమితి నవ్వ
శిష్ఠుఁ బొదివిన నతఁ డతినిష్ఠ బ్రహ్మ, దండమును మ్రోల నిడుకొని యుండఁ గినిసి

క. ఏనంత దివ్యశరసం, తానముఁ బరఁగింప బ్రహ్మదండంబు మద
స్త్రానీకంబు హరించెఁ బ,యోనిధి నిర్ఝరులయోజ నుగ్గలి వింటే. 133

గీ. కడఁగి బ్రహ్మాస్త్రమును వింటఁ దొడఁగియేయ,నదియు రిత్తయైచనిన నెమ్మదిఁ గరంబు
విస్మయము లజ్జయును దోఁప విల్లు విడిచి, కొంతదడ వూరకుండిటి వంతగదిరి.134

క. నాలావు నస్త్రపాండితి, దాలిమియును నేర్పు కలిమి తన్వీ వృథగాఁ
బోలదు కేవలబల ము,ద్వేలతపోబలముతో భువిం బరికింపన్. 135

క. అని చింతించి మనంబున, వనరాశిపరీతభూభువనసామ్రాజ్యం
బును వదలి బ్రహ్మఋషితకు, వనజాసనుఁ గూర్చి తప మవారితనిష్ఠన్. 136

గీ. సలుపుచున్నవాఁడఁ జలిగొండ నిమితేంద్రు, యుంచెనై మదీయయోగమునకుఁ
బార మెద్ది నేఁడు సారవిపంచికా, గీతి వినఁగవలెఁ బ్రీతి నొసఁగ. 137

ఉ. ఇమ్మహనీయగానరవ మెచ్చటిదో యని విస్మితాంతరం
గమ్మున నిర్ఝరీతటులఁ గాంచనకందరచెన్నుసానుజా
తమ్ములఁ గమ్మతావులకుఁ దావల మైనలతానికుంజపుం
జమ్ములలోన నారయుచు జాడల వచ్చి కుతూహలంబునన్. 138

ఉ. కెంపుజిగిన్ గణింప నగుకేల్దలిరాకుల గుబ్బగుత్తులం
దుంపెసలాడుకుంతలమదభ్రవతంతితెఁ బల్కుఁదేనియం
బెం పగుబాహువల్లరుల పేర్మి నఖాంచలకోరకంబు లన్
సొం పెసలారఁ గొమ్మ నినుఁ జూచితి నివ్వనభూతలంబు నన్ 139

ఉ. ఇన్న నఁబోఁడులం గలసి యిం పెసఁగన్ భువనైకమోహనో
ద్యన్నిరవద్యరూపనవయౌవనశాలిని యున్నఁగంబునై
గ్రొన్ననతీవజొంపములఁ గోనలఁ గానలఁ గిమ్మకప్రపుం
దిన్నియలం జరించెద వనేకవిధంబుల నాటపాటలన్. 140

ఉ. చొక్కపుఁగుందనంపుజిగిపోయగఁ ముం గలముద్దుగుమ్మ యో
చక్కరబొమ్మ యోకుసుమసాయకశాతకలీముఖంబ నీ
వెక్కడిదాన వెందు జనియించితి వెయ్యది నామధేయ మే
దిక్కున నున్కి నీవిధముఁ దెల్పఁగదే జగదేకమోహినీ. 141

క. ఈతెఱఁగు పల్కునాధి, క్ష్మాతలపతిసూతి కధికసమ్మదమున న
క్కాతరమృగాక్షి వాచా, చాతురి మెఱయంగఁ బలికె సస్మితముఖియై. 142

సీ. జనికర్త నిరుపమచ్ఛాయాభినవరత్నజాలంబు గలసుధాజలధిరాజు
సహజాత ధవునివక్షమునఁ గౌస్తుభముతోఁ గ్రీడ సల్పెడురాయ గేస్తురాలు
కులవిద్య జగము చేర్కొనుమాధురీసాధురీతిధురీణసంగీతలక్ష్మి
రచ్చపట్టు మనోహరసురాగమచ్ఛాయ లాలయుచింతారత్నకలితవేది

తే. చెలిమికత్తెలు రంభోర్వసీతిలోత్త, మాప్రభృతు లగునప్సరోమానవతులు
కమలభవభర్గహరిసభాంగణము లెప్పు,డమణఁ జెలువొందు నాట్యరంగములుమాకు.

ఉ. మేనక పేరు వేడ్కకలిమిం దుహినాచలరత్నకాంతిమ
త్సానుదరీఝురీవిమలసైకతపుష్పనికుంజపుంజితో

ద్యానతలంబులం బ్రియవయస్యలఁ గూడి కరాబ్జవల్లకీ
గానకళావినోద మెసఁగం జరియింతు వనారతం బిటన్. 144

సీ. కడుభక్తి మాధ్యాహ్నికస్నాన మొనరింప గురుహేమకుంభవక్షోజ యోర్తు
దేవపూజకుఁ గమ్మపూవు లెత్తు లొసంగ నభిరామమృదులతాభాంగి యోర్తు
వలసినవేళఁ బక్వఫలంబు లర్పింపఁ గోమరుఁ బ్రాయపుఁగల్కి కొమ్మ యోర్తు
జిలుఁగుఁబల్కులఁ నొద్దికలఁ బ్రొద్దు జరిగింప శుకమంజుభాషణ ప్రకర యోర్తు

తే. వ్యజనసంజనితాతిశీతానిలముల, దినకరకరార్తిఁ దీర్పఁ బావనచరిత్ర
యోర్తు నీచెంత సంతతం బుండ వలదె, వననిధిగభీర గాధిభూవరకుమార. 145

క. కుందనమునంటి నెమ్మెయి, కందె మరుజ్జలదశీతఖరకరకిరణా
మందార్తి నకట రాజపు, రందర నీ కీతపశ్చరణ మేలయ్యా? 146

ఉ. కొంచక శత్రుమండలముఁ గూల్చుట బంధుసుహృజ్జనాళి ర
క్షించుట రాజ్యవైభవముఁ జెందుట దిక్కులఁ గీర్తిచంద్రికల్
నించుట రాజధర్మము లనింద్యచరిత్ర సమస్తము న్విస
ర్జించి దురంతకాననధరిత్రిఁ జరింతురె తాపసాకృతిన్. 147

సీ. ఆలింప నంతఃపురాంగనోక్తులె నీకు జంతుసంతానగర్జారవములు
సంచరింప సువర్ణసౌధవీథులె నీకుఁ గఠినగండాశ్మశృంగాటకములు
మెసవంగ మది కిష్టమృష్టాన్నములె నీకు నారణ్యకందమూలాదికములు
శయనింపఁ గేళికాసదనపాళులె నీకు ఘనసానుమదధీశకందరములు

తే. కాయమునఁ దాల్పఁ జిత్రాంశుకములె నీకు, నారచీరలు హరిణాజినవ్రజంబు
లెక్కడితపంబు నీవంటినృపకులోత్తమున కయో! యిట్టివెతలు విప్రునకుఁ గాక.

మత్తకోకిల. అంబురాశిపరీతసర్వధరాధిపత్యముఁ బూని భ
వ్యంబులైనసుఖంబు లొంద భవాదృశక్షితిపాలలో
కం బయో ఋషివోలె నీబలుగానఁ జేయుతపంబు లా
భం బదేమి యొసంగుఁ గష్టపుఁబాటు దక్కఁగ మేనికిన్. 149

క. అని పల్కి వేల్పుఁబైదలి, గొనబుంబలుకులకు గాధికొమరుం డెలన
వ్వొ నగుచు నిట్లను డెందం, బునఁ గలయగ్గలపువలపు ముప్పిరి గొనఁగన్. 150

మ. కనుఁగొంటి న్మను కామినీమణులఁ బెక్కుం డ్రక్క జగద్గీతమో
హనసౌభాగ్యవయఃకళానిధుల నయ్యబ్జాక్షులం దోర్తు నీ

కేనగాఁ బల్కు విధాత కేని వశమే యింకేల పల్మాట లం
గన నీ నెయ్యముఁ గోరి వచ్చితిఁ జుమీ కంజాశుగాస్త్రుండనై. 151

చ. అరనెలతాల్పువేల్పు దురహంకృతి డాసి తదీయలోచన
స్ఫురితదవాగ్ని రూపు చెడిపోయి మనోభవుఁ డింతి నేఁడు నీ
తరళకటాక్షవీక్షణసుధారసశీతలసేచనాప్తి ని
ర్భరపయిఁ గ్రమ్మఱం దనువుఁ దాల్చెఁ బాంథులపాప మెట్టిదో. 152

ఉ. భావజుతూపులం బొడముభారిపుగాయపునొప్పి దీర్ప సం
జీవనివై యభీష్టఫలసిద్ధికి భవ్యసుఃద్రుమవల్లివై
తావల మైనమోహపరితాపవిదాహ మడంపఁగా సుధా
జీవనరాశివై కరుణఁ జేకొనుమా కనుమా శుభోన్నతుల్. 153

ఉ. క్రొత్తమెఱుంగుముత్తెపుసరుల్ మెలిగొన్నపసిండిచాయఁ ద
ళ్కొత్తుమిటారిగుబ్బకవ యుబ్బునఁ బేరెదఁ జేర్చి తేనియల్
జొత్తిలుమోవి ముద్దు లిడుచున్ సురతాంబుధిఁ దేల్ప వేని న
న్నిత్తఱిఁ జిత్తజన్ముఁ డలయింపఁడె సంపఁగిమొగ్గతూపులన్. 154

చ. ఎడపక మాఱుఁ డిక్షుధను వెక్కుడి తుమ్మెదనారిఁ గమ్మపూ
బెడిదపుఁదూపులం దనువు బిట్టగలింపఁగఁ దాల్మి కల్మి గో
ల్పడి యతిదీనవృత్తి వొదలన్ నిను డాసితిఁ గూర్మిఁ బ్రోవవే
తడయక పుణ్య మెక్కుడు గదా శరణాగతరక్షణంబునన్. 155

చ. చలిమలఁ బెక్కుకాలము విశంకటశీతమరున్నిదాఘబా
ధలకుఁ జలింపకే నచలతన్ విధిఁ గూర్చి తపంబునిష్ఠఁ జే
న్నలర మనోభవుండు విశిఖాహతి మానముఁ జూఱ పట్టె భూ
స్థలి విరు లంద్రు వానిశరజాలము వజ్రకఠోర మారయన్. 156

చ. అనుడు మదీయరూపవిభవాతిశయంబున కమ్మహాతపో
ధనుఁ డసమాస్త్రశస్త్రజనితప్రబలార్తి వహించె నేఁ దలం
చినది యసాధ్యపుంబనిఁ జెచ్చెర దైవము దోడు సూపె నం
చనుపమసమ్మదావృతమనోంబుజయై సతి మౌని కిట్లనున్. 157

సీ. గాంగేయశోభాధగద్ధగితోన్నతప్రాసాదతలవిహారములు మాని
చతురంబునిధిమధ్యసర్వసర్వంసహాప్రాజ్యసామ్రాజ్యభారంబుఁ దొలఁగి

నవవయశ్శ్రీనిధానప్రియాకుచకుంభపరిరంభజృంభణపదవి వదలి
మాణిక్యభూషణాంబరపుష్పమాల్యానులేపనాలంకారలీల లుడిగి

తే. భసితహరిణాజినజటావిభాసమాన, తనుఁడవై వాయుభుక్తి దుస్తరతపంబు
నిష్ఠఁ దవిలిననీవంటినియమశాలి, దలఁపఁ దగు నయ్య మాబోంటిచెలులపొందు.

గీ. అనఘ నీవంటియోగవిద్యానవద్య, మానసుఁడు పూర్ణసుఖ మెద్ది దాని మిగులఁ
గోరఁ దగుఁ గాక మారవికార మూఁది, యలఁతిసుఖమున కాసింప నర్హ మగునె.

మ. అవిభేద్యం బయి నిత్యమై యధికసౌఖ్యశ్రీదమై యూజవం
జవదుర్గార్ణవబాడబజ్వలనమై సంపూర్ణమై లోకసం
స్తవనీయం బగు నెద్ది తద్విమలతేజం బాత్మఁ జింతించుసా
రవివేకుం డతితుచ్ఛ మాసుఖముఁ గోరం డెన్నిచందంబులన్. 160

గీ. కాపిశాయనబిందుసంకలిత మైన, కలశపూరితవిమలగంగాజలంబు
కైవడి నిషిద్ధసౌఖ్యసంగతి భవత్త, పోమహిమ నిష్ఫలము గాదె పుణ్యచరిత. 161

గీ. మనసుపాదునఁ బొడమి సమగ్రభక్తి, రసపరిప్లుతిఁ దాలిమి ప్రాఁకు వడసి
తనరునీయోగనిష్ఠాలతామతల్లి, కనఘ శాతలవిత్ర మంగనలపొందు. 162

చ. ఇడుమల కోర్చి కాననమహింగ రణానుగతప్రవర్తనం
బడఁచి సమీరపర్ణసలిలాన్నరతిం దప మూని కాలముం
గడపుమహామునీశ్వరశిఖామణి వల్పసుఖంబుఁ గోరి యె
క్కుడువగ నూల్కొనం గడులఘుత్వము సు మ్మిది నీకుఁ జూడఁగన్. 163

చ. లత ధర నాటి నిర్మలజలప్లుతిఁ బెంపఁగ నాఁడునాఁటి కా
యత మయి యేచి పూచి ఫల మందుతటి న్వెరు లెల్లఁ గోసి న
ట్లతివలపొందుఁ గోరి మదనార్తి ననేకసహస్రవత్సరా
ర్జితతప మక్కటా చెఱుతురే లవమాత్రసుఖానుభూతికిన్. 164

క. నా విని గాధిసుతుం డను, భావజసుమనశ్శరాసబంధురమార్వీ
రావము సోఁకినవీనుల, కేవలన రుచించు నీయహీనవయోక్తుల్. 165

ఉ. భామలపొందు మానికిఁ దపఃఫలహాని యటంచుఁ బల్కితిం
కే మన నేర్తు నోమగువ యిట్టితపంబులు పెక్కులైన దీ
ప్తామతి సల్ప వచ్చు నవి సాధ్యము లెన్నఁటి కబ్బు నీదుము
క్తామణిహారశోభికుచదత్తబృహత్పరిరంభసౌఖ్యముల్. 166

క. గౌతమపత్నీసురత, ప్రీతాత్ముఁడు దివిజపతికిఁ బ్రేమ గురుస్త్రీ
పాతివ్రత్యముఁ జెఱిచిన, శీతాంశున కేమి హాని నేసు వెఁ జెపుమా ?. 167

శా. వాగీశాంఘ్రిసరోజయుగ్మభజనవ్యాలీఢనిష్ఠాపరి
త్యాగంబై మదనాంబకప్రహతిఁ జిత్తం బుత్తలం బందె న
య్యోగారింపక రిత్తనాయములు న న్నుద్రేక మేపార సం
భోగాంభోనిధిఁ దేల్చి పొందఁగదవే పుణ్యం బగణ్యంబుగన్. 168

ఉ. మాదృశవాఙ్నిపుంగవసమగ్రమనోరథసిద్ధిఁ జేయు మో
పైదలి నీకు మిక్కిలిశుభం బటు గావున నన్నుఁ బొందు మ
త్యాదరలీల నంచు మదనార్తిఁ గనుంగవ మోడ్చి మూర్ఛమై
నాదినరాజతేజుఁడు రయంబున వ్రాలె మహీతలంబునన్. 169

చ. అది గని జంకి పంకజదళాంబక యమ్మకచెల్ల ధిజుం
డుదితమనోజవేదనల కోర్వక మూర్ఛిలె నంచు జల్లుఁబ
య్యెద దొలఁగంగ నాతనిపయిం బడి సిబ్బెపుగుబ్బదోయిఁ జే
రెదఁ గదియించి కౌఁగి లిడి యెత్తి మదిం బెనఁగొన్నకూరిమిన్. 170

చ. తొడపయిఁ జేర్చి మోడ్పుఁగనుదోయిఁ దుషారపయఃకణంబులం
గడిగి పదాబ్జముల్ నలఁ గ్రమ్మి పటీరమలంది వ్రేలుకెం
జడ లొకయోరకై ముడిచి చారుకుచాంచలచేల మూని లోఁ
జిడిముడిపాటుతో మొగముచెమ్మట లార్చుచు సేద దేర్పఁగన్. 171

## సూర్యాస్తమయవర్ణనము.

సీ. పూర్వగోత్రత్యాగమున కచ్చుగించుటఁ దమి చనఁ బద్మినిఁ దగిలికొనుటఁ
గువలయక్షోభకృద్గుణయుక్తిఁ బ్రబలుట హరిపదోల్లంఘనత్వరితుఁ డగుట
నరుల విచ్చలవిడి నలరారఁ జేయుటఁ బుణ్యజనద్వేషిపొందుఁ గనుట
సరసులజీవనహరణం బొనర్చుట గురుభామహితవృత్తిఁ గోరి మనుట
తే. నతిరయంబున లజ్జానతాస్యుఁ డగుచు, నవగతానూనవసులక్ష్మి నఘము లెల్ల
నడఁచికొనుబుద్ధి నేగెనో యన నినుండు, చనియె నంతంతఁ బశ్చిమశరధిదరికి.

చ. చనవున వెంట నంటి నిమిషం బెడఁ బాయక వచ్చునన్నుఁ గై
కొనక నిరాకరించి మది గోనిధిరాడ్దిగధీరలోచనా

జనితనవానురాగవివశత్వముఁ దాల్చె నినుం డటంచు నం
దు నిల కసూయ నా మరలెఁ దోడన చాయ విచారశీలయై. 173

చ. వరుణదిగబ్జగంధి గని వచ్చు నినుక్ జనదృష్టిదోషసం
హరణమనీషమైఁ దిగిచి యాతనిఁ కెవలఁ బాఱఁ జల్లుశో
ణరసపరిప్లుతాశనకణంబులు నాఁ దగె నాతపస్ఫుర
చ్చరమధరాధిరాట్శిఖరసానుఝరీజలశీకరచ్ఛటల్. 174

సీ. చరమభూధరకూటజనితస్ఫుటాశోకసరసప్రసూనగుచ్ఛం బనంగ
నాథాభిముఖవరుణానిమ స్తతలాగ్రకురువిందవర్తులాభరణ మనఁగ
సమయాధికారిపార్శ్వమహీతలన్యస్తతరుణారుణాతపత్రం బనంగ
పాశభృత్కేళికాప్రాసాదశిఖరాగ్రఘటితజాంబూనదకలశ మనఁగ
తే. గగనరమ ముందు రాఁగలఘననిశాట, చోరభయశంకతస్వాంతయై రయమున
జలధిపేటిక నిడి డాఁపఁ దలఁచికొనిన, తనదువెలలేనిమణి యనఁ దనరె నినుఁడు.

మ. సమయానేకపధూతలేఖతటినీసంజాతభర్మాంబుజా
తము నా వ్రాలెఁ బయోధి నభ్రమణి తత్సంపాత వేగోన్నమ
త్సముదంచద్రజ మంబరం బలమె నా సాంధ్యద్యుతుల్ గ్రమ్మెఁ ద
ద్భ్రమరీజాలము నద్దెస గ్రమిచె నా రంజిల్లెఁ గ్రొంజీఁకటుల్. 176

సీ. అతులత్రయీవపుష్పతనవేగోన్నమత్సింధుగర్భార్వాగ్నిశిఖ యనంగ
జలధీశయోగకాంక్షాలి ప్తచరమదిక్కాంతరీకుచాగ్రసిందూర మనఁగ
క్షితిసురాంజలిపుటోత్క్షిప్తార్ఘ్యవాఃకణాస్త్రక్షుణ్ణమందేహరక్త మనఁగ
విరహిణీలోకసంహరణప్రయాణకృద్రతిరాడురుక్రోధరస మనంగ
తే. నరుణకిరణావసానాపరాద్రినివస, దలఘుశమిరాట్కరానిలజ్వలితగాఢ
తరహుతాశశిఖాపరంపర యనంగ, జనము లీక్షింప సంజకెంజాయ పొడమె.177

చ. ఇనుఁ డపరాశఁ జేరిన సహింపఁగ రానివియోగభారవే
దనలఁ గృశించి యంబుజిని తమ్మిమొగంబుపయి న్వివర్ణత
ల్గనఁబడఁగా నిజోదరమిళద్భ్రమరీకృతఝుంకృతిచ్ఛలం
బున విలపించె సీధురసపూరనిరంతరబాష్పసంగతిన్. 178

గీ. సలిలకుల్యాగమాంతద్విజవ్రజారి, వములతోఁ గూడ నేకీభవమ్ము లగుచు
సలిలకుల్యాగమాంతద్విజవ్రజారి, వమ్ములు శ్రుతిప్రమోదకరమ్ము లయ్యె. 179

ఉ. చాయమగండు గ్రుంకె వసుసంపద పెంపఱి చక్రరక్షణో
పాయకళావిహీనుఁ డయి పశ్చిమవారిధి వంచు వేగ రే
రాయనిఁ గాలదూత సుకరప్రభుతాప్తిఁ బిల్చునే రెలుం
గో యనఁగా నిరంతరశకుంతరవంబు సెలంగె దిక్కులన్. 180

సీ. కమలజాండవనాంతరమునఁ ద్రిమ్మరుకాలభిల్లున కవతంసపింఛపాళి
మురువు గొల్పడినకుముద్వతీదళనేత్రరంజనంబునకు శుద్ధాంజనంబు
విభుసన్నిధికి డాయునభిసారికాకటీవిసరంబునకు నీలవసనరాజి
యినసమాగమనోత్సహన యానిశావధూస్తనపాళిక మృగీమదవ్రజంబు
తే. కామినీరచితాగరుధూమసమితి, గాదె యిది యనఁ గరటిరాక్షసవిరోధి
ఘనశిరోధిహాలాహలగాఢదీప్తి, నంధకారంబు నభ మెల్ల నాక్రమించె. 181

సీ. కాలకంధరకంఠకాళిమ నిరసించి నీలోత్పలద్యుతి నిగ్రహించి
ఋభుగణప్రభుమణీఘృణుల నుల్లస మాడి హాలికటీపటిలీల నగడుఁ జేసి
ప్రావృడంభోధరప్రభలఁ బాములఁ బెట్టి తాపింఛరుచులరారాపు లుడిపి
మలచూలిమేనిచాయల దిసంతులుగొట్టి భాస్కరజాశ్రీఁ దిరస్కరించి
తే. నందనందనమస్తకన్యస్తభుజగ, భుక్కలాపచ్ఛటారుచిస్ఫూర్తిఁ దెగడి
దిక్కులం దెల్లఁ దామయై యుక్కుమిగిలి, కరముఁ బెంపొందిచిమ్మ చీఁకటులు మెఱసె.

సీ. సాంద్రీభవత్తమస్సవిత్పృజాలహరిలో బెళుకు బేడిసమీలతళుకు లనఁగ
రమణీయగతిఁ జకోరకుమారికలు గుంపుగొని యాడు వెన్నెలకుప్ప లనఁగ
వనజభిద్రజనీవివాహోత్సవారంభమునఁ దోఁచుజాజాలమొలక లనఁగ
ననిమిషాళి ప్రదోషమున ధూర్జటిశిరంబుపైఁ బెట్టుమంత్రపుష్పంబు లనఁగ
తే. నంబరశ్రీకుచాగ్రవిలంబమాన, విమలముక్తామణీహారవితతు లనఁగ
నంతరము లేక దిశ లెల్ల నాక్రమించి, కొమరెసఁగె నింగిఁ దారకాసముదయములు.

చ. గురుతరపాంథహృత్పవనకుండనిగుప్తశిలీముఖాగ్ని దు
ర్భరసుమనశ్శరాసగుణరావమనూక్తిమనోజయజ్వరా
ద్రరసఘృతాహుతిక్రియలఁ దద్దయు సంజ వెలుంగఁ జేసె నాఁ
గర మెసఁగెం బ్రదీపకళికాచయముల్ నిలయాంతరంబులన్. 184

వ. అంత. 185

## చంద్రోదయవర్ణనము.

చ. ఎనసినప్రేమతోఁ గువలయేందిర కుత్సవ మాచరింప హే
చ్చినపరచక్రగర్వము నశింపఁగఁ జేయఁ గళాభిరాముఁడై
యనువుగ వచ్చురాజు విడియ న్మునుము న్నమరుల్ ఘటించున
ర్జునపుఁబటీకుటీర మనఁ జూడఁ దగెం దొలుదెల్వు దూర్పునన్. 186

చ. వలపులవింటివానిదళవాయి చకోరమనోరథంబు శే
వెలఁదిమగండు బాల్కడలివెన్న నిలింపగణాన్నరాశి చు
క్కలదొర శూలిమౌళిమణి గల్వలవిందు తమంబుగొంగ చ
ల్వలగని జింకతాలుపు కళానిధి దూర్పునఁ దోఁచె నత్తఱిన్. 187

ఉ. పంచశరుం డఖండశరపాళి వియోగిజనాళి జాలిఁ దూ
లించె సరోజరాజి ముకుళించెఁ జకోరకజాతి ప్రీతి న
ర్తించెఁ గుముద్వతీనికరదీధితి మించె వియత్తమంబు శో
షించె రథాంగమండలి కృశించె దురంతవిషాదవేదనన్. 188

క. మంజుతరఫుల్లహల్లక, గంజామధుపానజనితగాఢమదోద్వృ
త్తిం జతగూడి మధువ్రత, పుంజము లిచ్ఛానువృత్తిఁ బొల్పెసలారెన్. 189

గీ సమయగోపాలకాగ్రణి చదలుపేరి, సురభిజాబిల్లి పొదువునఁ గర మెసంగు
విమలచంద్రికాదుగ్ధపూరములు పిదికి, ఘనతరచకోరవత్ససంఘముల మనిచె. 190

ఉ. ఆశమిలోకలోకహితుఁ డంత నితాంతనిలింపలోకబా
లాశిరోపచారవిధులం గులిశప్రతిమానభీమకా
మాశుగవేదనాసముదితాతనుమూర్ఛఁ దొలంగి పద్మసం
కాశనిరీక్షణాంచలయుగం బపు డల్లన విప్పి చూచుచున్. 191

క. వనితా నీయతికృప భా, వనితాంతమనోజశరదవజ్వాలనశిఖా
జనితాతితాప మెడలితి, నని తాపసమౌళి మఱియు నంగన కనియెన్. 192

సీ. కమ్మతెమ్మెరలఁ బొందమ్మిపుప్పొడి గ్రమ్మ పలచువేలుపుశేటికొలఁకు లందుఁ
జదలుమ్రాఁకులనీడఁ జలివెల్గుటావేదికలఁ బ్రోది ద్రాక్షపందిళులక్రిందఁ
గపురంపుటనఁటిచొక్కపుమంచునీటిబోదియల చెత్తావిపూఁదీవపొదల
నెలదేఁటిజోటిపాటలతేట లలరుమల్లిక లల్లికొనినమానికపుదరుల

తే. ననుదినము నన్ను సురతిసుఖాంబురాశిఁ, దేల్చి మనిచెదో లేక ప్రదీప్యమాన
సూనశరశూరకులిశోపమానవిశిఖ, జాలశిఖిపాలుగాఁ జేసెదో లతాంగి. 193

చ. అన విని యింతి యిట్లను ననంతతపోమహిమాభిరామ నీ
మనమున కెద్ది యిష్ట మది మా కొనరించుటకంటె నొండు శో
భన మిఁక నెద్ది నీచరణపంకజసేవఁ గృతార్థురాల నై
మనియెదఁ బెద్దకాల మన మౌనివరుండు ప్రహృష్టచిత్తుఁడై. 194

చ. ఒకసెలయేటిచెంతఁ గన నొప్పరసాలసువర్ణపాటలీ
వకుళకదంబనింబవనవాటి నమందమిళిందదంపతి
ప్రకరనినాదమేదురముఁ బల్లవపుష్పలతాభిరామ మొం
డొకలవలీలతాసదన మూర్జితసౌరభకాంతికాంతమున్. 195

చ. కని యరుణప్రవాళచయకాంతికలాపమణిప్రదీపిక
ల్దనుక మరుత్కిశోరవిగళత్సుమకోరకశుక్తిజాతనూ
తనశుభరంగవల్లికల దట్టపుపుష్పరజంపుధూపవా
సనల నళీనగానముల జా నగు నేలకితీవయింటికిన్. 196

మ. కెలనం గేళిసరోనుషంగమదభృంగీకంఠసంగీతమం
గళనాచార్భటిఁ దీవతొయ్యలులు వేడ్క న్నవ్యశోణచ్ఛదాం
చలహస్తంబుల మొగ్గముత్తియపుసేసల్ జల్ల మందానిల
చ్ఛలనం డాసి సుధాకరోపలసమంచద్వేదికాసీనుఁడై. 197

క. నెలరాజగతి నలరి యా, నలరాజసమానమోహనశరీరుం డ
వ్వలరాచపట్టివిరితూ, పులరాయిడిఁ గెరలి వేలుపుంజెలి కనియెన్. 198

క. రమ్మా యివ్వల పాఁగఁ ద, రమ్మా మారవ్యథాభర మ్మాత్మ వికా
ర మ్మానఁ జేసె ననుఁ జే,ర మ్మానవతీమణీ కర మ్మాదరణన్. 199

చ. అని యలవేల్పుజవ్వని నిజాంకమునం దిడి కుంతలంబు ల
ల్లనఁ దమిచే నఖాంచలములన్ సవరించి కుచోత్తరీయ మొ
య్యన సడలింపఁ దద్విమలహారవితానము సూడ నొప్పెఁ గాం
చనగిరిశృంగసంగతవిశాలపయోర్ఝరధారకైవడిన్. 200

సీ. బెళుకుఁగందోయికజ్జలమేచకచ్ఛాయ మెఱుఁగుముంగురులడాల్ మేలుగొసర
భరితనాసాంగకాభరణముక్తాదీప్తి చిఱునవ్వువెన్నెలఁ జెలిమి సేయ

నిగనిగల్ గులుకుమానికపుసొమ్ములతీవి తనుతటిద్రోచుల ననుసరింపఁ
బస మించుకౌసుంభవసనాంచలశ్రీలు చరణశోభాసమర్చల మెలంగ
తే. మోము మోమునఁ జేర్చి యామోదగరిమ, సుదతి మృగమదచందనసురభితోన్న
తస్తనాశిథిలాశ్లేషనిస్తులైక, సౌఖ్యమునఁ దేల్చె నమ్మునిస్వామి నంత. 201

చ. సమధికమోహవిభ్రమరసమ్మెదఁ గ్రమ్మఁ గవుంగిలింప న
య్యమరవిలాసినీగురుకుచాంతరసారమృగీమదద్రవాం
క మయి తపోధిరాడ్భసితకాంతిమదుద్యదురస్స్థలంబు పొ
ల్పమరె వినీలమేఘశకలాప్తహిమాచలసానువైఖరిన్. 202

ఉ. భూనుతమామకాలఘుతపోమహిమంబు ఫలించె నంచు న
మ్మౌని సమగ్రహర్షరసమగ్నమనోంబుజుఁ డయ్యె లేఖపా
శీనవిలోచనాకుచతటీఘటితాశిథిలోపగూహన
శ్రీ నిరవొందె ముంగిట దరిద్రుఁడు పెన్నిధిఁ గన్నచాట్పునన్. 203

సీ. జిలుఁగుఁజీఁకటుల కెగ్గులొనర్చుకప్పుఁబెన్నెఱిగుంపుఁ గెంగేల నిమిరి నిమిరి
చిఱుతబొమ్మంచువాతెఱదొండపంటిపై నునుగెంపుమొలకల నునిచి యునిచి
యపరంజిమెఱుఁగుటందపుడాలుబిగిగబ్బిగుబ్బలఁ గౌఁగిట గ్రుచ్చి గ్రుచ్చి
చికిలియద్దపుచాయలకు దాయ లగుతేటచెక్కులఁ గొనగోట నొక్కి నొక్కి
తే. ముదముదళుకొత్తఁ గోరికల్ మొలకలెత్తఁ, గుసుమశరతంత్రసంధానకుశలుఁ డయ్యె
నయ్యమిస్వామి యెంతమహాత్ము లేని, వసుమతీస్థలి స్త్రీలకు వశులు గారె. 204

మ. తతబంధాన్వితమై విముక్తనవముక్తాహారమై యస్ఫుటాం
చితవాగంకురమై గళత్కటితటీచీనాంబరంబై సమ
ర్పితబింబాధరమై వినీలకుచభూభృన్మండలాశ్లేషమై
యతి కంభోజదళాక్షికిన్ సురత ముద్యత్సౌఖ్య మిచ్చెం గడున్. 205

క. వేలానికుంజమణిమయ, లీలామందిరనితాంతలేఖప్రమదా
హేలాసురతసుఖశ్రీ, లోలాత్ముం డత్తపోబలుఁడు విలసిల్లన్. 206

## సూర్యోదయవర్ణనము.

చ. అనుపమరాగసంకలితుఁడై యుదయాచలశృంగపీఠి కొ
య్యనఁ జనుదెంచునయ్యినుఁ డటం చలరాజకరాప్తిఁ గుందుప

ద్విజులమనంబునం గలఁక దీఱఁగ భావిశుభంబుఁ దెల్ప వ
చ్చినక్రియ వేగుఁజుక్క పొడిచెం గమనీయవిపాండురద్యుతిన్. 207

మ. ప్రకటాశాంతరగామిపాంథవితతిప్రస్థానవేళాభిసూ
చక మూర్వీసురనిత్యకర్మసమయజ్ఞానప్రపంచవ్యంజం
పక నాసాసురలైకలోలరమణామర్షాంగనాకర్ణరం
ధ్రికతోరాశనియై చెలంగెఁ జరణాయుధధ్వాన ముద్వేలమై. 208

ఉ. తొలఁగె వధూవరాళికలదోరుపగూహము లష్టదిఙ్ముఖం
బులు దెలివొందెఁ గోకనియముల్ గవగూడి చరించెఁ దారకం
బులు శమసె న్మనోభవుఁడు పుష్పధనుర్గుణ మెక్కుడించెఁ ద
మ్ములు మెఱసెం జకోరకసమూహము లూఱటఁ బొందె వేకువన్. 209

క. జలజారి యపరదిశఁ జె, న్నలరెన్ బింబావశిష్టుఁ డగుచు వసుశ్రీ
దొలఁగి ప్రభుత్వాంతము సం, ధిల నేరక సిరులు నిల్చునే పరికంపన్. 210

గీ. మధుపగుణయుక్తి గలవాని మైత్రిఁ బాంథ, జనవధంబునఁ బొడముదుస్తరతరాఘ
మంటికొని యంకమిషమున నంబురాశి, వైచె ననఁ గ్రుంకె నంత జైవాతృకుండు.

గీ. కుముదినుల నేలి పద్మినీసముదయముల, సిరులు గొని షడ్గుణంబులమరువు మాన్చి
చక్రపాలనవిముఖుఁడై సంచరించు, రాజునకు ధాత్రి నాపద రాక యున్నె. 212

చ. అరుదుగ నాత్మనాయకసమంచితసాంద్రకరాభియోగజా
గరజనితశ్రమం బెడలఁగా దళలోచనముల్ మొగిడ్చి పొం
పిరి సుఖనిద్రఁ గూరె గుఱు వెట్టుచుఁ గైరవిణీవధూటి బం
ధురనిజగర్భసంగతమధువ్రతగానరవచ్ఛలంబునన్. 213

సీ. తఱివెజ్జు కమలినీతాపంబుఁ దీర్పఁ జేకొనురససిందూరఘుటిక యనఁగ
నొడలిచూపులఱేనికడకొమ్మనుదుటిపైఁ దనుకొత్తుకాశ్మీరతిలక మనఁగఁ
గవఁ బాసి నొగులుజక్కవదంట తొలుమేన భక్తి నోఁచిననోముఫల మనంగఁ
బొడుపుగుబ్బలిసెత్తమునఁ దోఁచి వెలుఁగొందునభినవాశోకలతాంత మనఁగ

తే. సమధికధ్వాంతనిర్మగ్నసకలవస్తు, సముదయాలోకనోత్సాహజనసమాద
రామరోత్థితమణిదీప మనఁగ వాస, రేంద్రుఁ డుదయించెఁ గాంతిని స్తంద్రుఁ డగుచు.

వ. అంత. 215

సీ. నృత్యదున్మత్తబర్హికలాపరమఁ దెల్పఁ బ్రిదిలి జాఱినకబరీభరంబు
తారకాన్వితసుధాధామవైఖరిఁ జూప విమలఘర్మాంకురావృతముఖంబు
సంధ్యారుణోత్పలచ్ఛవిసొంపు సూచింప నిద్రాసుఖవిరక్తనేత్రయుగము
పరభృన్నిపీడితపల్లవశ్రీఁ జాట రదనసందళితాధరస్థలంబు
తే. భ్రమరనికురుంబసంబంధసుమగుళుచ్ఛ, లీల నెఱపఁగఁ బెనఁగొన్న నీలహార
శోభితోత్తుంగపీనవక్షోజపాళి, తనరె సురతాంతవిశ్రాంతిఁ దలిరుఁబోఁడి. 216

చ. అలఘుముఖాబ్జదీప్తి నయనాంచలమీనగభస్తి వేణిశై
వలరుచి గుబ్బజక్కవకవన్ మృదుబాహుమృణాళసంపద
న్లలితగళాబ్జరేఖ నతనాభిజలభ్రమవిభ్రమంబునం
బొలుపగునప్సరస్తిలకముక్ జత గూడి మునీంద్రుఁ డత్తఱిన్. 217

మ. సరసం దీర్ఘికలూర్మికానికరహస్తశ్రేణికన్వారిశీ
కరముక్తామణులొలిఁ జల్ల సుమనోగర్భాసవోన్మత్తబం
భరగానంబులు వందిసన్నుతులు గాఁ బైపైఁ జెలంగన్వనాం
తరనానావిధసద్ద్విజోత్కరముఖాంతర్భాషణాశీరుతుల్. 218

ఉ. ఏలకితీవయిల్వెడలి యిందుశిలామయమందిరంబుల
న్లాలితరత్నకోరకకలాపనితాంతరుచిప్రదీపికా
జాలసువర్ణకందరనిశాంతములన్ గగనాపగాసరః
కూలవనాంతరాళసుమకుంజతలంబుల సంచరింపుచున్. 219

సీ. కందుకం దెడలినకల్వపూవులవిందు కప దొలంగ నిరథాంగకయుగంబు
కఠినతావాప్తిని గనినమేల్పవడంబు పొదలఁ దూఱినితేఁటికొదమచాలు
పంకసంకరవృత్తిఁ బాసినతమ్ములు పొడసూపి రూపఱి పోనిమెఱుపు
కరసానఁ బట్టనికాముశరమ్ములు పెనుమ్రోఁత సుళ్లఁ జిక్కనిదరంబు
తే. ముదితనీమోముఁ జనుదోయి మోవిఁ గురులుఁ, గన్నుఁగవ మేనుఁ జూపులు గళము సొంప
టంచు గాధిజుఁ డొక్కొక్కయవసరమున, గమలముఖి నిట్లు గొనియాడు మమతఁ దవిలి.

చ. వెలఁదుల కెల్ల మిన్న యగు వేలుపుటన్నువ గన్నుసన్నఁ జెం
తల నివసించు మాట జవదాఁటక త్రిమ్మరు మత్పురాతపః
ఫలమున దీనితోఁ జెలిమి పాటిలె నాకని సంతసిల్లు న
గ్గలముగ నమ్మహామునిశిఖామణి నెమ్మది కూర్మి యెట్టిదో. 221

ఉ. స్నానపయస్సరోవరము చామకటాక్షసుధారసం బజ
ధ్యానము గొమ్మరూపరుచియౌవనసన్నుతి సత్పురాణగా
థానిబిడప్రసంగములు తన్విమృదూక్తులు సత్యలోకసౌ
ఖ్యానుభవంబు పంకజదళాక్షిరతంబు యతీంద్రమౌళికిన్. 222

చ. పగలును రేయు నింతి నెడఁబాయక కాయజచాపశింజినీ
విగళితపుష్పబాణపరివేదన గోడి యనేకకాల మి
ప్పగిదిఁ జెలంగె గాధిజుఁ డపారమనోజవికారచిత్తుఁడై
మగువలపొత్తున న్మెలఁగుమానుల కేడఁ దపంబు లారయన్. 223

చ. శరదముఁ జంచలాలతికచందమునన్ రవిఁ జాయకైవడిం
దరళము హారవల్లరివిధంబున న్మునిరాజుఁ గూడి సుం
దరి బహుకాల మిష్టసుఖదం బగుభంగిఁ జరించి దౌహృదం
బరుదుగఁ దాల్చి యొక్క తనయన్ సనయం గని కొన్నినాళ్లకున్. 224

చ. సముచితభక్తిఁ గేల్మొగిచి సారసుధామధురోక్తిఁ బల్కె న
య్యమి కనఘావతంస వినుమా భవదీయసపర్య నింతకా
లముఁ గడఁద్రోచితిం జలిమలం గృప నాకిఁక నీ వనుజ్ఞ ని
మ్మమరపతిన్ భజింపఁగ రయంబునఁ బోయెద నింక నావుడున్. 225

ఉ. ఈదృశలేఖయోషిదభిహృద్యవచఃకలనాదరాన్వితుం
డై దృఢబుద్ధి గాధితనయాగ్రణి పల్కెఁ దుషారభూమిభృ
న్మేదురరత్నకందరవనీసరసీసుమకుంజపాళి స
మ్మోద మెలర్ప నీవలన ముద్దియ కంటి నభీష్టసౌఖ్యముల్. 226

ఉ. తుంటరిమారుబారిఁ బడఁ ద్రోయక పూవునఁ దావి పోలె లో
గొంటనికూర్మి నన్ను బ్రతికించి యశంబు వహించి తంచు వా
ల్గంటి దృఢానురాగమునఁ గౌఁగిట గ్రుచ్చి యతండు పోయి ర
మ్మింటికి నా లతాంగి ముని కెంతయు భక్తిఁ గృతప్రణామయై. 227

చ. కనికర మింత చొప్పడక కన్నకుమారిక మీఁద నీఘనీ
ఘనపులినాంతరస్థలవికస్వరనీపనికుంజసీమ నొ
య్యన నిడి వేల్పుఁదొయ్యలి పయస్యలఁ గూడ నగారిప్రోలికిం
జని హర్షప్రేమఁ గాంచి నిజసద్మమునందు వసించె నంతటన్. 228

చ. లఘుసమస్తరాజ్యవిభవాతిశయంబుఁ దొలంగి సారచీ
లు జడ లూని కాననధరం గలయాకలముల్ భుజించి ని
ర్మలమతిఁ జేయు నాతపము సౌరవఘూరతిసౌఖ్యలీల వ
ర్తిలఁ దుది ముట్టఁ కింకెఁ గద గ్రీష్మసరిత్సలిలంబు చాట్పునన్. 229

క. డచన్నపనికి నెమ్మది, నడ లూనఁగ నేల నీహిమాద్రి వదలి యెుం
డెడ నే ఁజేయుదుఁ దప మె, క్కుడునిష్ఠ నటంచు గాధికొమరుం డరిగెన్. 230

వ. ... 231

గ్రీష్మఋతువర్ణనము.

సీ. అతితీక్ష్ణసింధురాడ్ఢరిదాశుగోద్ధూతకురజగిపరీతపుష్కరతలంబు
ప్రబలత్రిధామదీవ్యజ్జ్వాలికాదగ్ధన మస్కరోన్నమన్మాక్తికంబు
జ్వలదినాభిషువినిర్దళితకాననమృగస్తోమమస్త్రస్త శోణితంబు
అధికదృక్కంబరభ్రాంతికృద్దశదిశాభ్రామ్యన్మరీచికాబంధురంబు

తే. చతురకైవర్తకకరాగ్రజాలజాల, పరిగృహీతవినశ్యదంభస్తటాక
గతఘనీగర్భజనితమత్స్యవ్రజంబు, గ్రీష్మవాసర మరుదెంచె భీష్మమగుచు. 232

చ. కరుదవహవ్యభుక్శిఖలు గోత్రజశుష్కతరుప్రకాండము
స్థిరగతిఁ గాల్చ బిట్టెగయుధూమము గన్నులఁ గప్పఁగా విభా
కరరథవాజి దారిఁ బొడఁ గానక యానజడస్వభావమై
కరము జవంబు వీడె ననఁగాఁ గడుదీర్ఘము లయ్యె ఘస్రముల్. 233

చ. నక ప్తయై ధర యహీనసమీరవిఘూతశాల్మలీ
ఘన తూలరాశి పయిఁ గన్పడఁ బర్వమహోరజోమిషం
లు పొందె నొక్కవెలిపుట్టము మేలుముసుంగుఁ బూని య
కార్తిఁ దెల్పి సురదీర్ఘికఁ గ్రుంకఁ బోవుచాట్పునన్. 234

ప్తి సదధ్వసంగతి జగద్విఖ్యాతభాస్వద్ఘనా
దెం పయి చంచలాప్తత మెలంగ న్మాకుఁ గా దంచుఁ గం
నోయఁ దదీయమైత్రిఁ జెలు వొందం గోరి శంపల్ దపః
నా నిశఁ గిరులఁ గన్పట్టెఁ దవజ్వాలికల్. 235

బూని వినతావనితాగ్రసుతుండు హస్తతా
తమున మాటికి బి ట్టదలింపఁగా హరు

ల్పరువులు వాఱుచో సెలవులం బయిపై దిగజాఱుచట్టి పె
న్నరువులు నా వసుంధరఁ గనుంగొన నయ్యె మరీచికాచ్ఛటల్. 236

మ. దగ దొట్ట న్నదిలో జవంబు సెడి పాంథశ్రేణి దూరప్రయా
ణగతగ్లాని సమీపదృష్టమృగతృష్ణాపాళి నీ రాస డా
యఁగఁ దోడ్తో నవి వెన్కకై చనఁగ దైన్యం బూని రా దప్పి వా
యఁగ నీరం బిడి సేదఁ దేర్తురు ప్రపోద్యత్కాంత లవ్వేసవిన్. 237

మ. అల సూర్యోదయవేళ మేలుకని హైమాంభఃకృతస్నాతులై
చలువల్ గట్టి యలంకృతాత్తవసుమస్రక్చందనామోదసం
కలితాంగంబుల గోమనోజ్ఞదధియుక్తస్వచ్ఛపాథేయభు
క్తుల నానాశిశిరోపచారముల భోగుల్ దోఁచి రవ్వేసవిన్. 238

వ. ఇట్లఖిలలోకసంతాపకారణం బైనయాగ్రీష్మకాలంబున. 239

చ. ఇనుఁ డుదయాద్రిమీఁద నుదయింపఁగఁ బ్రాంతవినిర్ఝరాంబుమ
జ్జనముఖకాల్యకృత్యములు సల్పి యొకానొకనాఁడు కాననం
బునకు సమిత్కుశప్రసవముఖ్యఫలగ్రహణేచ్ఛ మానసం
బునఁ దలకొత్త శిష్యజనముల్ భజియింపఁగఁ బోయితిం జుమీ. 240

చ. చఱియలఁ గొండలం దిరిగి చాయమగం డతితిగ్మరోచులం
గొఱవులు సూఁడఁ దాల్మిరహిఁ గోల్పడి ప్రాఁకులనీడఁ జేరి యం
దఱముఁ దనుశ్రమం బెడలఁ దామరసాప్తుఁడు పశ్చిమాద్రికై
యొఱగ సమిత్కుశాదికము లూఁది యటం గనుఁగొంటిఁ జేరువన్. 241

సీ. తావుల వేదచల్లుతమ్మి నెమ్మొగముతో శఫరీచలత్కటాక్షములతోడ
గమనీయతరకంబుకంధరరేఖతో భృంగనీలాలకశ్రేణితోడ
గురరథాంగవిహంగకుచకుంభభరముతో రమ్యశైవలరోమరాజితోడ
సలలితావర్తవర్తులనాభిగరిమతో సుకరభుజామృణాళికలతోడఁ
తే. దరళతరకంకణోర్మికాస్ఫురణతో వి,చిత్రనిర్మలమౌక్తికశ్రీలతోడ
నలరుఁ గలహంసగమనలీలాభిరామ, మాలినీనామశైవలినీలలామ. 242

ఉ. సారసుధాసమానజలశాలిని మాలినిఁ జేరి తీరకాం
తారసుగంధబంధురలతాఫలపుష్పనికుంజమంజులా
గారవిహారదూరితవిగాఢనిదాఘవిభాకరప్రభా
ఘోరతరార్తినై యచటఁ గొండొకసేపు వసించి యంతటన్. 243

చ. సలలితమాలినీనికటసైకతవాటి లతాంతసౌరభా
మలినకదంబభూమిరుహమధ్యమునన్ భ్రమరీకదంబముల్
కలయతి జోల వాడ వలిగాడ్పుల సారెకుఁ దూఁగుతీఁగయు
య్యెలఁ దలిరాకుఁబొత్తుల పయి న్వలసిల్లుకుమారికామణిన్. 244

గీ. కని శకుంతజాతిగరుదంశుకాచ్ఛాద, నమునఁ దరణికిరణసముదయార్తిఁ
బొరయ కుండఁ గూర్మిఁ బ్రోది యొనర్పఁగా,గదియఁ బోయి వెఱఁగుగదుర మగిడి.

సీ. ఇది మాలినీనదీభృతశుక్తిసంజాతలలితముక్తారత్నతిలక మొక్కొ
యిది రతిమాననీహితచిత్రకారకరచితచామీకరప్రతిమ యొక్కొ
యిది యధికోన్నతద్వీపాంతరోద్భవలసమానవిద్రుమలతిక యొక్కొ
యిది దివ్యబాలికాకృతి దాల్చి విలసిల్లువిపినాధిదేవతావిసర మొక్కొ

తే. కానిచో నీమనోహరాంగకశుభాంక, సౌకుమార్యరుచిశ్రీలు సన్నుతింప
మనుజశిశువుల కలలేశమాత్రమైనఁ,గలదె యని సంభ్రమంబాత్మఁ గడలుకొనఁగ.

గీ. జగదభీష్టత్వరూపలక్షణనిధాన, మీనిసువు సింహశరభాదిమృగసమాకు
లమ్మడవి దుర్గమము మర్త్యులకుఁ దలంప, నిచట నొంటి వసించుట కేమి కతము.

గీ. అని యభిజ్ఞానదృష్టిచే నాత్మ నెఱిఁగి, మేనకాగాధినందనానూనగర్భ
శుక్తిముక్తాఫలం బని జోక దానిఁ, గేలుఁగవ నెత్తి యక్కునఁ గీలుకొలిపి. 248

చ పడఁతుక సంతతిం బడసి భావమునం గడుకూర్మి నుగ్గుఁబా
లిడి యొడఁబాయ కెప్పుడు మహీస్థలిఁ బెంచుచు వృద్ధిఁ గాంచి న
ల్గడఁ దనయింట ముంగిటఁ దగం జరియింపఁగఁ జూచుఁ గాక క
ట్టిఁడి యయి యేటిలోపల వడిం బడఁద్రోచునె కన్నసంతతిన్. 249

చ. అని యిటు లన్నిలింపవనజానన దూఱుచు నక్కుమారి న
క్కున నిడి తెచ్చి యెక్కుడగుకూరిమిఁ బెంచి మదాశ్రమస్థలం
బునఁ గలవస్తుజాలమున ము న్నిపినోర్వి శకుంతరక్షఁ గై
కొనినది గాన నెంతయు శకుంతల నాఁ దగు పేరొసంగితిన్. 250

వ. తరుణుల కిరువురు జనకు లభయప్రదాతయు నన్నప్రదాతయుఁ, బురుషునకు ముగ్గురు, జనికర్తయు నుపనీతయు విద్యాప్రదాతయుం గావున దీని కేనభయాన్నప్రదాత నగుట జనకుండ నైతి, నా కిది కుమారి యయ్యె నని కణ్వుం డమ్మునీంద్రునకుం దెలిపిన సంతసిల్లి యతిం డతని వీడ్కొని సగౌరవంబుగా నిజాశ్రమంబునకుం జనియె నివ్విధంబున. 251

క. భూయువతీవర యిట్టిది, నాయది పుట్టువు తెఱంగు నా విని సంతో
షాయత్తచిత్తుఁడై యతఁ, డాయంగన కనియె మంజులాలాపములన్. 252

ఉ. పాత్రము నీచరిత్ర మిలఁ బ్రస్తుతి కంబుజనేత్ర మౌనిరా
ట్పుత్త్రి వటన్న సందియముఁ బొందితి మున్ గనునప్పు డుత్తమ
క్షత్త్రియవంశపావనుఁడు గాధిజుఁ డమ్మహనీయమూర్తికిం
బుత్త్రిక వౌట నిన్ను మదిఁ బూనిన ప్రేమ వరింపఁగాఁ దగున్. 253

చ. అలఘుమరుత్పయోదతపనాతపబాధల కాత్మ నోర్చి కా
నలఁ గలకాయగూర లశనంబులుగాఁగఁ గటీనిబద్ధవ
ల్కలపరిధానవై యిడుమలం బడి తక్కట పెక్కువత్సరం
బులు విధిచేఁత యేరి కనుభూతిక రాక తొలంగ దుర్వరన్. 254

ఉ. కాలము రిత్తపుచ్చక ప్రకాశితమానవయశ్శుభాంకలీ
లాలలితాంగి నీవు నవలా తగినట్టివరు న్వరించి యీ
ద్వేలహృదిష్టసౌఖ్యములఁ దేలి యశంబును గౌరవంబు రాఁ
జాలినభంగి వర్తిలుచు సజ్జనసన్నుతిఁ గాంచు మింకటన్. 255

గీ. కులసురూపకాంతిగుణయశోగౌరవ, ములఁ జగత్ప్రసిద్ధి నలరుమేటి
రాచపట్టి వగుటఁ బ్రకటింప లోకము, మగువ యేన నీకుఁ దగినవరుఁడ. 256

క. మొదల నినుఁ జూచునప్పుడు, మదికిఁ బొడమె మోహవిభ్రమము మరుఁ డాపైఁ
బదను గలతమ్మితూపుల, గుది నలజడిఁ బెట్టెఁ గుసుమకోమలి వింటే. 257

క. సంతసమున నను గైకొని, కాంతునిఁగ రతిప్రసంగకలనాసుఖిత
స్వాంతునిఁగఁ జేయ వేని శ, కుంతల మరుఁ డేల నన్నుఁ గోల్కొన నిచ్చున్.

క. గెలిచితి నసహాయుఁడనై, పలువురఁ గులిశోపమానభయదాస్త్రధురీ
ణుల నని మార్తురఁ దలిరు, న్విలుఁ దాల్చినమేటి కొక్కనికిఁ జాలఁ జుమీ. 259

ఉ. సంగరభూమి న న్నెదురఁ జాలక మేటిగుఱాలు దేరు లే
నుంగులు కాంచనాంబరమణుల్ మొదలైనవసువుల్ వరా
టాంగకళింగకేరళశకాంధ్రవిదర్భకరూశదేశరా
ట్పుంగవు లిచ్చి కొల్తురు కడుం బ్రియ మారఁగ నెల్లకాలమున్. 260

చ. సలలితహేమసౌధములు సారసుధాకరకాంతకుట్టిమ
స్థలములు పద్మరాగమణిధామము లింద్రశిలాశిరోగృహం

బులు నవహీరరత్నరుచిభూషితకుడ్యకవాటగోపురం
బులు ఫలపుష్పశోభివనముల్ గల వెంతయు మత్పురంబునన్. 261

గీ. అతివ ననుఁ గూర్మిఁ బాణిగ్రహం బొనర్చి, బహుతరామూల్యమణికలాపప్రదీప్త
వై మహీరాజ్యసంపద లనుదినంబు, ననుభవింపుము లోకంబు లభినుతింప. 262

చ. తఱిఁ గని తుంటవింటిదొర తామరతూపులఁ దాల్మికత్తళం
బఱవఱఁ జేసి నాదువల పంగడిఁ బెట్టఁగ నిల్వ నోడి నీ
మఱువునఁ జేరితిన్ భువనమాన్య సుధీజనతాభిగణ్య డ
గ్గఱి యభయం బొసంగి ననుఁ గ్రిక్కున నక్కునఁ జేర్చి కావవే. 263

క. భూనాథమణి మనోజశ, రానలపరితప్తహృదయుఁడై యిటు లాడన్
మానిని యమందమందా, ఘానతముఖి యగుచు నిట్టు లనియె నతనికిన్. 264

మ. క్షితిలో లేరె తలోదరుల్ నవవయశ్శ్రీరూపలావణ్యజృం
భిత లుర్వీశ వరింప నీకుఁ గడుఁగూర్మిం గందమూలాశన
వ్రతనై నారలు గట్టి తాపసకుటీరక్షోణి నక్రాంత మీ
గతి వర్తింపుచు నున్ననన్నుఁ గవయం గాంక్షింతురే నెమ్మదిన్. 265

మ. చతురంభోనిధిముద్రితాఖిలమహీసామ్రాజ్యలక్ష్మీధురీ
ణతిఁ బెంపొందిన మేటిరాజ వయి వన్యగ్రాసదీక్షాకృశీ
కృతగాత్రి న్మునివేషధారిణి ననుం బ్రేమాతిరేకంబునన్
సతి గాఁ గోరి వరించినన్ నగరె రాజన్యుల్ సుహృద్బాంధవుల్. 266

క. నెలఁత లసంఖ్యలు ధర వా, రలలో నొకదాన రాజరాజవు నీ వ
ర్మిలి నను వరింపఁ గోరుట, సొలపున నేఁ జేయుపూర్వసుకృతమ్ము గదా. 267

క. తొలుబాముల నోములు పె, క్కులు నోఁచినసతికిఁ గాక గురుయశ మీయం
తలవారితోడ నెయ్యము, గలుగునె సామాన్యకన్యకల కూహింపన్. 268

క. నా విని భూవిభుఁ డను లల, నా వేయేటికి వచింప నను మది ప్రేమం
గేవలసురతైకసుఖ, శ్రీవివశునిఁ జేయు మనినఁ జేడియ వలికెన్. 269

క. పరతంత్ర లింతు లెచ్చట, వరియింతురె తమ్ముఁదామ వరులఁ బ్రమోద
స్ఫురణ ధరిత్రీవర నీ, వరయనియది నీతి గలదె యవనీస్థలిపై. 270

క. విను ననుఁ బాణిగ్రహణం, బొనరింపఁ దలంచినాఁడ వూర్జితకరుణా
వననిధి మజ్జనకుం డా, తనియానతిఁ గొనక పూనఁ దగ దిప్పనికిన్. 271

క. తడ వయ్యె మునివల్లభుఁ, డడవికిఁ జని ఫలసమిత్కుశాదులు గొని తె
వ్వడు వచ్చు నని మెఱసె దివి, నడుమ సమయవిధులు సలుప నాటిననిష్ఠన్. 272

ఉ. వచ్చి త్వదీయరూపరుచివైభవముల్ బొడఁగాంచి సెమ్మదిన్
మెచ్చి ప్రసన్నదాశ్రుకణమిశ్రితలోచనుఁ డౌచు నన్ను నీ
కిచ్చి వివాహముల్ సలుపు నెల్లజనుల్ గొనియాడ నంత నీ
యిచ్చ మెలంగ వచ్చుఁ బృథివీశ ననుం గొని యెల్లకాలమున్. 273

క. ఇది నిక్కము సందియము వల దనంగ శిలీముఖజ్వాలనసంతాపం
బెదఁ జొనుపఁగ తాలిమిఁ బూన్పఁ దగు నని వచ్చు దాఁకఁ బార్థివముఖ్యా. 274

చ. అన నరనాయకుం డనియె నాయతకాయజసాయకవ్యథం
గనలుచు నుండు నాకుఁ ద్రుటికాలముఁ ద్రోయ విధాతృకల్పమం
గన మును వచ్చు టెప్పు డెసకం బెసఁగ న్నను నిచ్చు టెప్పు డ
క్కునఁ గదియంగఁ జేర్చికొని కోర్కులు దీర్చుట యెప్పు డాయన్. 275

చ. కులబలరూపసంపదలఁ గోవిదు లెన్న జగత్ప్రసిద్ధిఁ బొ
ల్పలరుమహీధవోత్తముఁడ వర్మిలి నన్నుఁ బరిగ్రహించినన్
గలికి మునీంద్రుఁ డొక్కరుఁడ కాఁడు సమస్తసుధీజనాదిభూ
తలపతు లెల్ల సంతసముఁ దాల్తురు సూవె హృదంతరంబునన్. 276

క. అనిన వనజాక్షి యిట్లను, నను మేనక ఘోరకాననస్రోతటిని
ఘనసైకతసీమకడం, బనికుంజమునందు వైచి మసలక చనినన్. 277

క. తల్లియుఁ దండ్రియుఁ దానై, యల్లనఁ గొనితెచ్చి పెనిచె ననిశంబును నా
కెల్ల పదార్థము లిడి మునివల్లభుఁ డమ్మేటి యాజ్ఞ వలదే యనినన్. 278

ఉ. భూలలనావిభుండు విరిఁబోఁడికిఁ బల్కు నయోక్తిచాతురీ
శాలినులందు మేటి నను చందముఁ దెల్పితి మెచ్చినాఁడ ని
న్నేల వృథాకథారచన లింతి సముత్కటచిత్తబాధను
జ్యాలతికావిముక్తనిశితాశుగవేగనఁ దీర్పు నావుడున్. 279

ఉ. ఓనరనాథవంశకలశోదధిపూర్ణశశాంక నీమనం
బే నరయన్ బహూక్తుల నలయించితి నింతియ కాని శంక లే
దూనకు నాదుకోర్కి గల దొక్కటి యవ్వరి మీ వొసంగి న
ట్లైన వరింతు నిన్ను మునియానతిఁ గైకొన కీక్షణంబునన్. 280

క. ఆకోర్కి వినుము నీకృప, నా కొడవినసుతుఁ జతుర్వనధివేష్టితభూ
లోకరమాయువరాజ, త్వాకలితుఁగఁ జేయ వలయు నన నృపుఁ డనియెన్. 281

క. ప్రియమున నీకోరిక ము, న్న యెఱింగించిన జగజ్జనము పొగడ మృగీ
నయనా యవ్వర మొసఁగనె, నయోక్తులను గాలయాపనముఁ జేసి తొగిన్. 282

క. ఇపు డిచ్చెదఁ గొను దైవము, కృప నీ కొడవినకుమారుఁ బృథివీసామ్రా
జ్యపదమునకు యువరాజుగ, నిపుణతఁ గావింతు నిదియ నిజము పలికితిన్. 283

చ. అన విని యింతి యిట్లను నరాధిపవంశలలామ నీ యొసం
గినవర మశ్మలేఖ యని కేవల మాత్మఁ దలంతుఁ గాని యై
నను బరికింప రాజ్యభరణంబునఁ గల్గినవైభవంబులా
వున హృదయంబునన్ మఱతువో యనుశంక యొకింత దోఁచెడున్. 284

క. నినుఁ గవయఁ గోరి మదనా, స్త్రనిపీడితచిత్తవృత్తిఁ బ్రాజ్ఞత చెడి ప
ల్కినయమ్మాటలు నిజములె, చను మన నా కెద్ది వెరవు సౌజన్య నిధీ. 285

క. ఇరువురము కాని యొరు లెవ్వరు లే రచ్చోట సాక్షి వలయు ధరిత్రీ
వరతిలక నీ యొసంగిన, వరమున కట్లయిన నమ్మ వచ్చు మనమునన్. 286

చ. అనిన విభుం డనున్ హిమకరాన్వయసంజనితుండ సాధుస
జ్జనహితకార్యధుర్యుఁడ నసత్యముఁ బల్కుదునే ధరాదిభూ
తనికర మంబుజాప్తహిమధామముఖగ్రహముల్ దిగీశ్వరుల్
గనుఁగొను చుండఁగా వికచకంజముఖీ మది శంక యేటికిన్. 287

చ. అన విని మందహాసరుచిరానన యై ననఁబోఁడి మిన్న కుం
డినఁ బతి డాసి కౌఁగిలిడి నెమ్మదిఁ గూర్మి దొలంకఁ గేలఁ గేల్
గొన వలిగబ్బిగుబ్బలు గగుర్పొడిచెం దమి హెచ్చె మానసం
బునఁ బ్రభవించె ఘర్మలవముల్ యువతీనిఖిలాంగకంబులన్. 288

క. బాలామణి కేల్ దన కెం, గేలం గీలించి శీతకిరణకులాబ్ధి
ప్రాలేయభానుఁ డనుపమ, నాళీకశరాగ్ని వేదనాక్రాంతుండై. 289

వనమయూర. సారకదళీపనససాలబదరీఖ, ర్జూరకరవీరవటచూతలవలీజం
బీరతిలకక్రముకబిల్వముఖసాలో, దారవనిఁ ద్రిమ్మరుచు హర్ష మిగురొత్తన్. 290

చ. మలయమరుత్కిశోరహతి మాటికిఁ దూఁగుప్రఫుల్లమల్లికా
లలితలతానికేతనతలచ్యుతసూనరజోవృతైందవో

పలరుచిభాసమాన మగుభవ్యవితర్ది వసించెఁ బార్శ్వసం
కలితశకుంతలారతిసుఖంబున కువ్విళులూరుచుక్ మదిన్. 291

క. ఇందుకులుం డిటు సుమనో, మందిరమునఁ జెంది మధురమకరందఝరీ
తుందిలమిళిందబృందా, మందారవఘటితహర్షమగ్నుం డగుచున్. 292

చ. మదమధుపాంగనారచితమంగళగానయుతశ్రుతిప్రియ
ప్రదబహుళద్విజోక్తుల విభాసిలతావనితోత్కరంబు న
వ్యదళశయాళిఁ గేసరశుభాక్షతముల్ పయి నింపఁ జొచ్చి ర
మ్మిదియ సులగ్న మంచుఁ గదియించి లతాంగి నిజాంకపీఠికన్. 293

చ. అలకలు గేల దువ్వి మధురాధరపల్లవ మాని తళ్కుఁజె
క్కుల నెలవంక లూన్చి నెఱిగొప్పునఁ గమ్మవిరుల్ ఘటించి వె
గ్గల మగుసిగ్గు మాన్చి పులకల్ మెయిఁ గ్రమ్మఁ గళల్ స్పృశించి నూ
త్నులఁ గరఁగించి డెందమునఁ గోరిక లీరిక లెత్త నత్తటిన్. 294

ఉ. హెచ్చిన మోహదాహము సహింపఁగఁ జాలక బాహుశాఖలం
గ్రుచ్చి కవుంగిలించి రతిగూఢకళాకుశలుండు భూవిభుం
డచ్చపలాయతేక్షణ నితాంతలతాంతశరాసకేళిఁ దా
నిచ్చకు వచ్చినట్లు సుఖియించె నిరస్తమనోవికారుఁడై. 295

చ. జనపతి యిట్లభీష్టసుఖసంపద నొంది శకుంతలం గనుం
గొని ప్రియ మారఁ బల్కె విను కోమలి యే నిపు డేగి వీటికిన్
నినుఁ గొనితేర నిచ్చటికి నేఁ దగువారలఁ బంచెద న్మనం
బున నిసుమంతసందియముఁ బొందకు మన్న నతాననాబ్జయై. 296

గీ. వెలఁది యిట్లు పల్కె వినుము భూపాలక, తిలక నీదుకోర్కెఁ దీర్చికొంటి
సరసబుద్ధి నా కొసంగినవర మీవు, మఱవకుండ వలయు మనసులోన. 297

చ. ఇది మది నిల్పు మంచు వచియింపఁగ నట్ల యొనర్తు నంచు స
మ్మద మెదఁ గ్రమ్మ నమ్మగువ మక్కువ నక్కునఁ జేర్చి పోయి వ
చ్చెద నని యూఱడించి నృపసింహుఁడు వీడ్కొని మల్లికాలతా
సదనతలంబు వెల్వడి వెసన్ జవనాశ్వము నెక్కి యంతటన్. 298

చ. అలఘుచమూభరంబున మహావనిభారముఁ దాల్చుచిల్వవే
లలమణుల్ చలింప నతిదారుణవైపినదుష్టజంతుమం

డలిఁ బఱీమార్చి నంచుఁ బొగడం దను లోకము లెల్ల మేదినీ
తలనగశాసనుండు ప్రమదంబున పీటికి వచ్చి యత్తతిన్. 299

ఉ. చెంతల నాణి ముత్తియపుసేసలు చల్ల మణీసువర్ణశు
ద్ధాంతచరద్వ్యధూనికర మారతు లెత్తి ద్విజాంగనాళి యం
తంతఁ గవీంద్రగాయకజనాదివనీపకపఠ్యమానదో
రంతరశౌర్యధైర్యబిరుదాంకజయధ్వను లాలకింపుచున్. 300

శా. ఆజానేయము డిగ్గి యాత్మసదనద్వారాంగణస్థాఖిల
క్ష్మాజానిప్రకరార్పితాశ్వమదవన్మాతంగమాణిక్యరా
జీజాంబూనదభూషణాంబరముఖాశేషోపధాసమ్మద
శ్రీఁ జెల్వొంది విభుండు మందిరముఁ జొచ్చెం జౌరు లగ్గింపఁగన్. 301

క. అన విని యనూనకౌతుక,మునఁ బొదలుచు శౌనకాదిమునిముఖ్యులు సూ
తునిఁ గని మా కవ్వలికథ, ననఘాత్మ యెఱుంగఁ జెప్పు మని యడుగుటయున్.

మ. కరుణారంగదపాంగ మౌళివిలుఠద్గంగానదీభంగ యా
భరణీభూతభుజంగ శీతనగజాభాస్వన్నిజోత్సంగ సం
గరనిర్భిన్ననిశాచరాంగ మునిహృత్కాసారచక్రాంగ దు
స్తరతాపత్రయభంగ పాతకరుజాధాటీభిషక్పుంగవా. 303

చతుర్విధకందము.

ఫాలాక్ష దివిజసముదయ, పాలా స్మరగర్వహరణ భాస్వత్కరుణా
హాలాహలాశ కలుషవి, ధఫాలా రజాధినాథ పావనచరితా. 304

స్రగ్విణీవృత్తము.

దేవతాచక్రవర్తి సుధీకామ్యపూ, ర్తీ విభూతాశ్రితార్తి భవాపీపురం
ధ్రీవరస్వాంతవర్తీ చిదాకాశమూ, ర్తీ విరించిస్తుతోద్వేలకీర్తీ భవా. 305

గద్య. ఇది శ్రీవిశాలాక్షీకాశీవిశ్వేశ్వరకరుణాకటాక్షవీక్షాలబ్ధసరస
సాహితీధురీణ విద్వజ్జనవిధేయ గౌతమగోత్రపవిత్ర
సూరయామాత్యపుత్ర సద్గుణసమాజ నాగరాజ
ప్రణీతం బైనశకుంతలాపరిణయం బను
మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

# శకుంతలాపరిణయము

## తృతీయాశ్వాసము.





కం॥ త్రిజగతీర
క్షాకలనోత్కంఠ సకలసద్గుణగణర
త్నాకర సూరిజనశుభ
శ్రీకర కాశీనివేశ శ్రీవిశ్వేశా.

గీ. అవధరింపుము శౌనకాద్యఖిలసన్ము, నీంద్రుల కమేయధీశేముషీంద్రులకుఁ గు
శేశయమరందకందళ్లేశలోక్తి, సూతసూనుండు వలికె సంప్రీతి మెఱయ.

చ. క్షితిపకులాగ్రగణ్యుఁ డిలు సేరి యటం దపనీయకుంభసం
భృతహిమవారిమైఁ గడిగి వృత్తకటీతటిఁ బర్వశర్వరీ
ద్యుతిమయచేల మూని మణియుక్తవిచిత్రకిరీటకుండలా
వ్యతులకలాపదీప్తనిఖిలాంగకుఁ డౌచు సబాంధవంబుగన్.

చ. అనఘుఁ డతండు వైపినఖగామిషశాకవిశేషపాయసో
దనమధుగోఘృతాదికపదార్థము లోలి భుజించి సారచం
దనకుసుమాద్యలంకృతివిధానము లమ్మదితాంతరంగుఁ డై
మునుకొని వందిమాగధసమూహరవం బిరుచక్కి మ్రోయఁగన్.

చ. నిరుపమితాబ్జరాగమణినిర్మితభూరికలాపకాంతి వి
స్ఫురితనిజాంగయష్టి నలపూర్వకుభృత్సహితార్కతుల్యుఁ డై
పరమదఘూకముల్ బెదరి పాఱ సుహృన్నయనారవిందముల్
సిరి మెఱయన్ సభాస్థలికిఁ జేరి భటు ల్గని కేలు మోడ్పఁగన్.

చ. తరళమృగాక్షు లాత్మకరతామరసస్ఫురితాబ్జరాగర
త్నరుచిరకంకణోదితనినాదముతో నిరుచక్కి నిల్చి చా
మరములు వీవఁ గాంచనసమంచితపీఠి వసించి మేదినీ
వరుఁడు సెలంగె నింద్రవిభవంబున నెల్లజనుల్ భజింపఁగన్.

వ. అంత నయ్యాశ్రమాంతరంబున శకుంతలాకాంతామణి నిజస్వాంతంబున.

చ. అవిరళశక్తియుక్తి మృగయాగతి నాగతి రాజరూపగౌ
రవుఁ డవనీధవోత్తముఁ డరణ్యమహీస్థలి కేగుదెంచి న
న్గవిసి మనోభివాంఛితసుఖంబునఁ దేలి హయాధిరూఢుఁడై
జవమున నేగె వీరభటసంఘము వెంతలఁ గొల్వ వీటికిన్.

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కనివాఁడు నృపాలకోటిలో
నెక్కుడువైభవంబున దినేంద్రుఁడు కాంతిసమృద్ధి నట్టిరా
జిక్కడ కేగుదెంచె నఁట యివ్వని నారలు గట్టియున్న న
న్నక్కునఁ జేర్చి తేల్చె నఁట యబ్జశరాహతి సౌఖ్యవారిధిన్.

క. కల యని నిక్కం బని మదిఁ, దలఁపఁగ రా దద్భుతము గదా యానృపవం
శలలామము నను గూర్చిన, జలజాసను నేర్పుకలిమి సామాన్యం బే. 10

చ. పలికితిఁ బెక్కుభంగులు నృపాలునితో మునియాజ్ఞ లేక నీ
తలఁపు ఘటింప రా దిది యధర్మువు కామిను లెందు నస్వతం
త్రలని యతండు మోహపరితాపమునన్ ధృతిఁ దూలి యాడుమా
టలఁ గడ నియ్యకొంటి నకటా వలరాయని చేతి రాయిడిన్. 11

క. అలఘుసన్మార్గసంచారహారి యైన,కువలయేశుండు నను డాసి కూర్మిఁ దొలఁక
మృదుకరస్పర్శమొనరింపహృదయమపుడ, కరఁగెవివరింపనిదిచంద్రకాంతమొక్కొ.

క. తలిదండ్రులయనుమతిఁ బై, దలి పాణిగ్రహముఁ జేయఁ దగుఁ గాక మహీ
స్థలిఁ దనుఁ దానకార్యము,దలకొని చేయు టది యనుచితం బండ్రు బుధుల్.

గీ. జనకునాజ్ఞఁ గొనక జవరాలు తనుఁ దాన, పతి వరింపఁ దగునె మతివిహీను
రాలఁ బోల దిట్టిచాలనిచ్ఛందంబు, గలదె తొల్లి యేయుగంబు నందు. 14

చ. హృదయములోనఁ దాఁ గనికరింపక తల్లి నదీతటంబునన్
వదలి చన న్ననుం గరుణ వర్ధిలఁ జేసినతండ్రికోర్కి యె
య్యదియొ తదాశయం బరయ కాఁడిచెద్దయుఁ జేయునాకుఁ జె
ల్ల దిది విరించికృత్య మవిలంఘ్యము దీనికి నేమి సేయుదున్. 15

ఉ. చిన్నటనాఁటనుండి మునిసేవయ తక్క నయుక్తకార్య మే
నెన్నఁడు సల్ప దీనికి సహింప కపూర్వతపఃప్రభావసం
పన్నిధియల్క నూల్కొనఁ గృపామతిఁ బ్రోవ సమర్థుఁ డెవ్వఁ డు
ర్వి న్ననుఁ బోలినట్టియవివేకని గల్గునె యెంచి చూడఁగన్. 16

చ. అలఘుతపోమహత్త్వనిధి యై తగుగాధిసుతుండు వేయిగ
న్నులదొరమన్ననం దగు ననూనగుణాకర తల్లి యిట్టివా
రలకు జనించి కణ్వమునిరాజుకృపం బొడమై సువృత్తి వ
ర్తిలుచు నయుక్తకార్య మొనరించితి మెచ్చునె నన్ను లోకముల్. 17

క. ఇలఁ గలరాకొమరులలో, పల నెవ్వరిఁ గోరి తెచ్చి పతిఁ జేయునొ యా
తలఁ పెఱుఁగక తండ్రికుతూ, హల మడఁచితి నన్నువంటియాఁడుది గలదే. 18

మ. ఘనుఁ డానల్వ తదీయకృత్య మవిలంఘ్యం బేరికిన్ దీని కా
త్మ నెగు ల్పూనఁగ నేల మజ్జనకుఁ డుద్యద్భూరికారుణ్యశా
లి నృపాలుం డధికుండు గావున జను ల్గీర్తింప న న్నాదరిం
చు నిజం బింతయ కాని యేమిటికిఁ దాల్పుం గింక నాతం డెదన్. 19

చ. అని మది నిశ్చయించికొని యాననఘర్మజలాంకురాళి నొ
య్యనఁ గొనగోట మీటుచుఁ గరాంగుళియుగ్మమున న్రదచ్ఛదం
బనువుగ దాఁచి సీత్కృతిరవాన్వితయై కడకంట నొంటిఁ గ
న్గొనుచు లతాంగి డాఁగెఁ బెనఁగొన్న భయంబునఁ బర్ణశాలికన్. 20

ఉ. అంత నొకింతసేపునకు నమ్మునిలోకవతంస మాశ్రమో
పాంతవనాంతరాళఫలపత్రసమిత్కుశ లూని చెంత శ్రు
త్యంతవిచారసారకుశలాత్మకు లూర్జితశేముషీసమా
క్రాంతులు శిష్యు లొక్కమొగి రాఁ జనుదెంచె మరుజ్జవంబునన్. 21

ఉ. ఆయన వచ్చి పర్ణనిలయాంతికబాలరసాలభూరుహ
చ్ఛాయ నొకింత నిల్చి సుమసౌరభసాంద్రనికుంజ సంచర

ద్వాయుకిశోరదూరితనితాంతపథశ్రముఁడై యి దేమొకో
డాయఁగ రాదు లేదు నికటంబున మత్సుత యేమి వింతయో. 22

చ. అడవికిఁ బోయి వచ్చునపు డల్లన డాసి నమస్కరించి యె
క్కుడు ప్రియ మూని నాయనఁగుఁ గూఁతుఁ గవుంగిటఁ జేర్చి వన్యముల్
గడుమధురంబు లైనయవి గావలె ని మ్మని సారెసారె వే
నుడువులఁ జెంతఁ ద్రిమ్మరు మనోజ్ఞగుణాంబుధిఁ జూడ నియ్యెడన్. 23

గీ. అట్టియనఁగుఁబట్టి కట్టెదురఁ జరింప
దేల వనమృగార్తి నెనసె నేమొ
యడవి కరిగి యచటఁ దడ వుంటి నని యల్క
పొడమి రాదొ నిదురఁ బొందె నొక్కొ. 24

చ. అని జడదారిబొబ్బమెక మత్తఱిఁ దత్తర మంది నందనిం
గనుఁగొనువాంఛఁ బర్ణగృహగర్భముఁ జేరి సమిత్కుశప్రభృ
త్యనుపమకాననద్రుమఫలావళి నచ్చటఁ బాఱ వైచి లోఁ
గనికర ముప్పతిల్ల నెమకన్ నలుదిక్కుల నొక్కచోటునన్. 25

సీ. కొనగోట మీట వెంటన ఘర్మసలిలమ్ము గ్రమ్ముతేనగుమోముఁదమ్మిదానిఁ
దల సూపి కలయంగ మొలచిననునుఁగెంపుమొలకకెమ్మోవికెందలిరుదానిఁ
బెలుచ నాటినచిన్ని నెలవంకి లిరువంకఁ దళుకొత్తుచెక్కుటద్దములదానిఁ
గరపీడనమునఁ బల్గాసి గీల్కొన్నచొక్కపుగబ్బిగుబ్బజక్కవలదాని

తే. నశిథిలానంగిసంగరాయాసకలనఁ, బొరయునిట్టూర్పుఁగమ్మతెమ్మెరలదాని
జాఱునెఱిగొప్పుగొజ్జంగిసరులదాని, ధన్య భువనత్రయీమాన్యఁ గన్యఁ గనియె. 26

మ. భువనస్తుత్యచరిత్ర నిర్మలగుణాంభోరాశి యామ్నాయధ
ర్మవిధిజ్ఞాననిధాన మామకసుతారత్నం బనుద్వాహ యీ
నవలామిన్ననిజాంగముల్ సురతచిహ్నప్రాప్తిఁ గన్పట్టుచు
న్నవి లజ్జావనతాస్యయైనయది దానం జేసి యూహింపఁగన్. 27

మ. అగళద్దుర్భరవిక్రమాతనురిపువ్యాపారజైత్రుం డనం
తగుణశ్రీనిధి గోత్రధర్మభరణోత్సాహుండు పార్శ్వస్థపీ
రగణాధీశుఁడు రాజశేఖరుఁ డనన్ రంజిల్లురాచూలిఁ బొం
దుగ నాతల్లికి సర్వమంగళకు నాథుం జేయఁగాఁ గోరుదున్. 28

మ. ఎద నే నొండు దలంప దైవ మొకఁ డూహించెం గులస్థానసం
పదభిజ్ఞానసుకీర్తిశౌర్య ధృతులం బ్రఖ్యాతిఁ గైకొన్న భూ
భృదధీశుం బతిగా ఘటింపక ధరిత్రీలోకసామాన్య నీ
ముదితాప్రాణవిభుండు గాఁ దలఁచె నేమో పద్మజుం డక్కటా. 29

గీ. అలఘుతరరూపశుభలక్షణాంగి యగుల, తాంగికి నరూపు రతిమనోహారిసమాన
రూపలావణ్యమూర్తి కరూపపతి ఘ, టించు విధి యని యంద్రు పాటించి జనులు.

చ. కెలన వసింప కే నడవికేఁ ఫలపుష్పసమిత్కుశార్థిము
మ్ములఁ జన నీతలోదరి సముజ్జ్వలరూపవిలాససంపదన్
వెలయఁగ నిం దొకర్తుఁ బృథివిం గలమానవుఁ డెవ్వఁ డేని హా
తలకొని బల్మిఁ బట్టఁడు గదా పలరాయనిచేతిరాయిడిన్. 31

చ. కరియుగము ల్విలోచనయుగిం బఖిరమ్యసరోజలక్షణ
స్ఫురణముఁ దెల్ప నీతలిరుఁబోఁడి రమాంశజ నిశ్చయం బటం
చరయుదుఁగానఁ దా నరిదరాంకుని గోప రక్షణక్షమా
ధరుఁ బురుషోత్తము న్విజయతత్పరుఁ గాని వరింప దన్యునిన్. 32

మ. అని యూహించి తపోధనుం డెటిఁగి దివ్యజ్ఞానసంసిద్ధి న
య్యనఘుస్వాంతఁ బరిగ్రహించినవరుం డంభోధివేష్టిభవ
త్కనదుర్వీతలఘూర్వహక్షముఁ డుదాత్తశ్రీయశశ్శాలి దు
ర్జనకాంతారదవాశ్రయాశనుఁడు దుష్యంతుండుగా నెమ్మదిన్. 33

క. పరమాణుమధ్య భయత, ల్పరమానస నయకలాపధవ్యతనూరూ
పరమాంచితసుగుణపరం, పరిమాద్యదళీనకచఁ గుమారికనంతన్. 34

చ. తనవిపులాంకపీఠమునఁ దారెచి పుణ్యజనప్రవర్ధనున్
ఘనుఁ బురుషోత్తముం బ్రియుఁడుగాఁగ వరించితి నిన్నుఁ బెంపఁ గ
ల్గిన మదిలోనికోర్కులు ఫలించెఁ గదే జలజాతపాణి శ్రీ
వనితను గన్నతక్కలశవారిధియట్ల ప్రమోదమొందితిన్. 35

సీ. చిన్నిప్రాయమువాఁడు సిరి గిన్నసుతుకన్న జగజంపు మేనిసోయగముమవాఁడు
సొగసుఁజెక్కులవాఁడు పగడంబుజగడంబు నిరసించుకెమ్మోవి గరిమవాఁడు
నిడుదవక్షమువాఁడు నెఱిచందురునిఁ గ్రిందు పడఁ జేయువదనవైభవమువాఁడు
బలుకటీరమువాఁడు వెలిదమ్ములమదమ్ముఁ గడఁ జిమ్ము నేత్రయుగంబువాఁడు

తే. బాలరవిమండలప్రభాపటిమవాఁడు
సకలభూపాలకశిరోగ్రమకుటఘటిత
నిరుపమామూల్యమణివిభాసురచిరాంఘ్రి
సారసయుగంబువాఁడు దుష్యంతుఁ డబల. 36

గీ. ఇట్టిరాచపట్టి యొనసినప్రేమ నీ, చెట్టఁ బట్టఁ బసిఁడిగట్టుఁ గన్న
పేదపగిది మదిఁ బ్రమోదంబుఁ గాంచితి, నింతకంటె శుభ మ దెద్ది నాకు. 37

మ. భయలజ్జల్ మదిఁ బూన నేటికి శరత్పద్మాక్షి లోకైకభ
వ్యయశశ్శ్రీనిధి నన్నుఁ జూడు మిపు డాస్యం బెత్తి నానారిపు
క్షయకృద్విక్రమశాలి యూర్జితతనుచ్ఛాయాధరీభూతహే
లి యభిజ్ఞుండు తనూభవుం డొదవుఁ దల్లీ నీదుగర్భంబునన్. 38

క. మునుగను దలిరంద్రములకుఁ, బెనిచిననా కలఘుకీర్తి పెంపుఁ బ్రమోదం
బొనగూర్చితి నాతల్లీ, నినువంటిసతీమతల్లి నెమకం గలదే. 39

క. అమ్మ భవదీయగుణగరి, మమ్మునకు న్మెచ్చినాఁడ మదిఁ గలయది శీ
ఘ్రమ్ముగఁ గోరుము నీకు వ, ర మ్మిపు డొసఁగెద మహానురాగము పేర్మిన్. 40

చ. అన సతి వల్కె నామది త్వదంఘ్రిసుభక్తిశమక్షమాదయా
వినయవివేకశీలముల విశ్రుతిఁ గన్గొన మత్తనూభవుం
డనితరశక్తివైభవచిరాయురభిజ్ఞతలం బ్రసిద్ధిఁ గై
కొని యిల నేలునట్టులుగఁ గూర్మి మెయి న్వర మిమ్ము నావుడున్. 41

క. కుటిలాలక నీకోరిక, యెటు లటు లగుననియె నపు డహీనకృపావి
స్ఫుటమతి జటిధూర్జటి యం, తట వనజాతాక్షి దౌహృదశ్రీఁ దాల్చెన్. 42

## వర్షర్తువర్ణనము.

మ. జనతాశ్రోత్రపుటీకఠోరతరగర్జాశబ్దధాత్రీభృద
గ్రనటన్మత్తమయూర మాహరమహాకాంతారదావాశ్రయా
శన మంభఃపరిపూరితాఖిలనదీసంతాన మాశ్చర్యకృ
ద్ఘనశంపాచయ మంబుదాగమ మిలం గన్పట్టె నత్యంతమై. 43

మ. అలపాథోనిధిజీవనంబు వెడకాఁడై తెచ్చి మేఘుండు ని
ర్గళదంతస్సగభీరభావరసలై కన్పట్టుకల్లోలినీ

జలజాతాక్షుల కిచ్చి ప్రాణవిభునిన్ సర్వంకషప్రౌఢిమం
గలయం జేసె ఘనుల్ పరోపకృతివిఖ్యాతప్రశంసుల్ గదా. 44

గీ. క్ష్మావలయపాత్ర నిల్పి పర్జన్యుఁ డద్రి, లింగతతి గర్జితమనూక్తి రంగదబ్ద
కలశవారిమహాభిషేకం బొనర్చె, నాఁగ జడివాన దిశలఁ బెల్లాఁగి కురిసె. 45

గీ. ఘనతరులపూర్వపత్రంబు లినుఁ డగల్చె, దాను వసునిధి గానఁ బత్రములు పిదపఁ
బెట్టెదరు కాని కొండని ప్రేమకొలఁది, నపరిమితముగఁ బైపయి నప్పలొసఁగె.

మ. సరసత్వంబు వహించి తారసిల వర్షా లక్ష్మి పర్జన్యుతో
నొరయం దత్స్ఫురితత్వరత్రుటితపీనోత్తుంగవక్షోరుహాం
తరహారస్ఫురదబ్జరాగగురుముక్తాజాలమో నాఁగ ను
ర్వరపై వ్రాలె మహేంద్రగోపకరకవ్రాతం బనూనంబుగన్. 47

గీ. కుజనులకభీష్టఫలసిద్ధిఁ గూర్చుచైత్రుఁ, డకట జాత్యభిమానహైన్యంబు నొందె
నని యతనిఁ గేరి మేఘుండు ఘనుఁడు గాన, జాతి కత్యంతహర్షరసం బొసంగె.

క. ధీవరజాలబకత్రా, సావిలమతిఁ దమ్మి వేరు లంటినవాశ్చ
ర్యావళి తటాకబహుసర, సీవితతులఁ దేలె జలము సెలఁగుటకతనన్. 49

మ. ఘనుఁ డుద్యత్తటినీతటాకసరసీగర్భంబులన్ మున్ను డాఁ
చినవో ప్పారసి పేవు తీవ్రకరరాజిం గొన్నయయ్యప్పు లి
మ్మని పర్జన్యుఁడు చారి కడ్డపడి గర్జాభీలవాచార్భటిన్
దనచుట్టున్ గిఱి గీసె నాఁగఁ బరిధిన్ ఖద్యోతుఁ డొప్పెన్ దివిన్. 50

క. వరవర్షాలక్ష్మి పయో, ధరనిర్గళదుద్యదమృతధారాప్లుతిభా
సురసస్యార్భకరక్షా, కర యగుచు ధరిత్రి హాలికస్తుతిఁ గనియెన్. 51

చ. తెఱపి యొకింత లేక నలుదిక్కులఁ గ్రమ్మి పయోదమండలం
బఱిముఱి వాన రేఁ గురియునప్పుడు రోదసి ఘూర్ణిలంగ బి
ట్టుఱుమఁ జలించి మానకుపితోత్పలలోచన లాత్మభర్తలన్
మెఱుఁగుఁబసిండిగబ్బిచనుమిట్టలఁ గౌఁగిటఁ జేర్తు రెంతయున్. 52

గీ. ధర వియోగిసమూహ చేతఃకఠోర, దర్పకకరాగ్రనిశితశస్త్రిములనంగ
సలిలకుల్యాంతికక్షోణిఁ బొలుపెసంగెఁ, గోమలద్యుతిఁ గేతకీకుసుమతతులు. 53

మ. సలిలాప్తిం దటినీతటాకసరసీసంతాన మొప్పె న్నభవిం
గల సస్యోత్కరముల్ ఫలోన్ముఖతచేఁ గన్పట్టె ఘాసాళితుం

దిలమై గోతతిదుగ్ధముల్ పెరిఁగెఁ జెందెన్ హంసముల్ మానస
స్థలి సారంగమనఃప్రమోదకరవర్షర్తుప్రభావంబునన్. 54

క. కనికరముఁ జిలుకుచూడ్కులఁ, గని కర మష్టాని వార్షికదినంబుల న
వ్వనిత మనిచె నాశ్రమతల,వనితరువులరససమృద్ధి వాంఛ దలిర్పన్. 55

క. తనయనుఁగుఁదనయ విఖ్యా, తనయ నిటుల నాతఁ డీప్సితపదార్థము లా
త్మనిరూఢతపోవైభవ, మున నిడి పోషింపు చుండె ముద్దియ కవలన్. 56

చ. మొలకపసిండిచాయచనుముక్కులు నల్పు వహించెఁ జిట్టుముల్
బొలిచెఁ గపోలముల్ దెలుపుఁ బూనెఁ దనుశ్రమ మొప్పె లేఁతగా
న్బలిసె మెఱుంగుటారు గనుపట్టె నిమార్పులు పుట్టె నోకిలిం
తలు పొడసూపె వెల్మిడిఁ దిన న్మన సయ్యెఁ బయోజగంధికన్. 57

క. ము న్నొకపరి నించుకచవిఁ, గొన్నపదార్థంబుఁ దా మగుడ నొల్లనియు
క్కన్నియకు వలయువస్తువు, లన్నియుఁ గొనితెచ్చి మాని యాదరమతియై. 58

క. తొడ నిడి నివురుచు ముంగురు, లెడనెడ ననుఁ గన్నతల్లి యువి గుడువు మనన్
గుడువ దొకించుక ముట్టదు, పడఁతుక కెంగేల గర్భభారాలసయై. 59

గీ. సత్పథవిహారి కువలయోత్సవదుఁ డరమ, నోభయంకరమూర్తి మనోజ్ఞరూప
సహితుఁడు కుమారచంద్రుఁడు జఠరవార్ధి, నాఁడు నాఁటికి వృద్ధిఁ జెందఁగ లతాంగి.

మ. పరమాయాసముఁ దాల్చి ప్రాలుసుమనఃపర్యంకపాళి న్మనో
హరిశారీశుకకేకిలోకమృదువాక్యశ్రీసమాకర్ణనా
పరభావంబు వహింప కాత్మ గృహకృత్యం బొల్ల కష్టాని శే
ఖరు సేవింపక యోదనోదకము లాకాంక్షింప కెల్లప్పుడున్. 61

సీ. కొనగోట నవరించికొనదు నెమ్మొగముపైఁ జెదరిననీలంపుఁ జిన్నికురులఁ
జక్కనొత్తదు కేల నొక్కింత గబ్బిపాలిండ్లపైఁ దొలఁగుపయ్యెదచెఱంగు
దయఁ గనుంగొనదు తేనియ లొల్కుపల్కుల సరసఁ గ్రుమ్మరుకీరశాబకములఁ
బ్రేమఁ బిల్వదు వనక్రీడ కనుంగు నెచ్చెలు లైనజడదారిచిగురుఁబోండ్లఁ

తే. గోర దాబాల్యమునుండి నీర మెత్తి, పెనిచినరసాలకదళికాపనసనారి
కేళముఖతరుమధురఫలాళి నైన, నబ్జముఖి దౌహృదభరాలసాంగి యగుట. 62

సీ. అతిపర్ణసదనసంగతి మాని సతి మానికఁపు మేల్మిమేడ లెక్కఁగఁ దలంచు
వల్కలాజినవాంఛ వదలి బాల దుకూలకనకభూషలు దాల్పఁగాఁ దలంచు

పరసకాననఫలేచ్ఛఁ దొలంగి చపలాంగి మధురాన్నములు భుజింపఁగఁ దలంచుఁ
కఠినభూశయనకాంక్షల మీఱి యలబోటి మృదుసూనశయ్య నిద్రింపఁ దలఁచు
తే. భయదవనజంతుకలకలార్భటుల రోసి, సూతమాగధపాఠకస్తోత్రరవముఁ
జెలి వినఁ దలంచు వినుతింప నలవి గాని, గర్భకలితా కునిపుణ్యగౌరవమున. 63

చ. అళికచ యిట్లు దౌహృదభరాసహయై విరిపాన్పునందు ను
మ్మలిక వహింపఁగా మునికుమారిక లూఱడఁ బల్కి కల్కిఁ గేల్
దలిరులయూఁతఁ బాన్పుఁ బదిలంబుగ డించి మనోజ్ఞవస్తువుల్
సొలపున మోవిఁ బూన్పఁ జవిఁ జూడక మోము మరల్చు సారెకున్. 64

క. అనురక్తిచే నటఁ దప, స్వినులచ్చాలాలికరముఁ జేకొని తా నె
ల్లన నడిపించుకొనుచు నూ, తనగాథాకథనకుశలతాశాలినులై 65

ఐ. కొలఁకులపజ్జల న్వెలచుగొజ్జగిపూఁ బొదరిండ్లఁ బొన్నగు
న్నల నెఱతావిక్రప్పుటనంటులఁ జొక్కపుఁజందనంపుమ్రాఁ
కుల నెలమావిజొంపములఁ గోనలఁ గానలఁ గమ్మతేనియల్
చిలికెడుద్రాక్షపందిళులఁ జెల్వగుచల్ల నినీటికాల్వలన్. 66

సీ. లోలాక్షి నీమనోజ్ఞాలాపలీలాప్తి గోమ రొప్ప రాజకీరముల డాసెఁ
గలకంఠకంఠి నీకబరీభరచ్ఛాయ లూఁటియ షట్పదపరంపరలఁ గదిసె
ననఁ బోఁడి నీఘనస్తనకుంభసంబంధ మూన మత్తేభాంగయుగము సేరె
గగనావలగ్న నీగమనవైఖరిసాటిఁ బొడల మేల్రాయంచుకొదమ లెనసెఁ
తే. గంటె చెలి నీవు సాంకవగంధి వగుట, హేమసుమనాసికాంగాభిరామ వగుటఁ
జంద్రికాహాస వగుటఁ జంచలతటిల్ల, తాంగి వగుట మనోగతి నరయ లేక. 67

మ. అతులస్నేహభరంబునం బొదలి యిట్లారామ లారామభూ
లతికామందిరనిస్వనన్మధుకరాలంబాబ్జసౌరభ్యదీ
పితకాసారతటంబుల న్మణిదరీబృందంబులం బ్రొద్దు వు
చ్చి తటిద్గాత్రకు నంతఁ దోడుకొని యక్షీణానురాగంబునన్. 68

క. తెచ్చి విరిసెజ్జఁ జేరిచి, యచ్చెలి దినదినము సమధురాలాపములన్
బుచ్చఁగ వర్షత్రయ మట, వచ్చెఁ బ్రసవసమయ మంత వనటఁ బొదలుచున్. 69

ఉ. పైపయి బిడ్డనొప్పు లొదవం దెలికన్గవ మోడ్చు లేచు ని
ల్పోపక నల్గడం దిరుగు నూర్పులు పుచ్చుచు దైన్యసంగతా

లాపకలాపయై చదికిలంబడుఁ గెందలిరాకుసెజ్జ మే
న్మోపు సమీరధూతసుమనోలత వోలెఁ జలించు సారెకున్. 70

చ. ఒకజడదారిబోటికర మూఁతగఁ బూవులపాన్పు డిగ్గి బా
లిక యొదకొంగు వేనలి చలింపఁగ నిల్చినచో నొకింత ని
ల్వక బహిరంతరస్థలములం బటుదాహ్యదభార వేదనా
వికలతఁ ద్రిమ్మరం గదిసి వేమఱు బల్కు రనుంగుచెచ్చెలుల్. 71

చ. వినుమలివేణి నీవలె భువిం బటుగర్భభరంబుఁ దాల్చి నం
దనులఁ బ్రసూతి యైనప్రమదాతిలకంబులు లేరె యిజ్జగం
బున కరుదా విధాత విరి బోండ్లకుఁ జేసినమేర దీని నే
మనఁ దగునమ్మ దైవము దయంగ న నన్నియుఁ జక్క నయ్యెడున్. 72

మ. కుడువం గట్టఁగఁ బూయఁ గల్గి తలిరాకుంబోఁడు లాత్మేశులం
గడుప్రేమన్ సురతాదిభోగములఁ జొక్కం జేయుచుం బాయ క
ప్పుడు సంతానముఁ గోరి పెక్కులు వ్రతంబుల్ సల్పియున్ సంతతిం
బడయం జాలినవార లెందఱవని న్నాళీకపత్రేక్షణా. 73

ఉ. కాంతులఁ గూడి యీప్సితసుఖంబులఁ దేలుచుఁ గల్మిబల్మి నా
వంత కొఱంతఁ గానక చిరాయురభిజ్ఞతలం దనర్చుచు
ధ్వాంతవిధూకదంబమునకన్న సుధీజన మెన్న మిన్నవై
కంతునిపంటినందనునిఁ గాంచి సుఖించెద వమ్మ కోమలీ. 74

చ. రమణికి సోయగంబు నెలప్రాయము సంపదయున్ నిజేశుకూ
రిమియు మణీవిభూషణసమృద్ధియుఁ గల్గినదానిచే యశం
బమరదు లోకరక్షణకళానుపమానమహాభుజాపరా
క్రమభృతిధర్మశీలములు గల్గుసుతుం డుదయింప కుండినన్. 75

మ. సిరితోఁ బుట్టి సుధాబ్ధిరూపసురుచిశ్రీ వజ్రి మన్నింప ని
ర్జరయోషిన్మణివై భవజ్జనని విశ్వామిత్రునిం గూడి సు
స్థిరసౌభాగ్యనిధాన నిన్నుఁ గని కాంచెం గీర్తి నీవట్ల శ్రీ
కరమూర్తిన్ సుతుఁ గాంచి పొందెదవు గా కల్యాణసాకల్యముల్.

మ. జనపాలోత్తమరూపలక్షణకళాసంపత్తి నీక్షించి సం
జనితానంగశిలీముఖానలశిఖాసంతప్తవై ప్రేమ నా

తనితోఁ గూడ స్వయంకృతాగ మయి యేతద్దాహ్యద్రశ్శిభరం
బునకుం గారణ మయ్యె నీ కది తలంపుల్ నింపు నిక్కంబుగన్. 77

గీ. తరుణి యీగర్భవేదనాభర మొకింత, సైపు మభిరమ్యరూపలక్షణుఁ గుమారు
బడసి యశ మొందెదవు మనోభవునిఁ గన్న, పాలమున్నీటికూరిమిపట్టి వోలె. 78

క. అని పలు తెఱఁగుల నమ్ముని, వనితారత్నములు కందువలు బల్కుచు మా
నిని నూఱడింపఁ దమనే, ర్పొనరఁగ నీకరణి సమ్మహార్తమునందున్. 79

సీ. నలరాజు వలరాజు నగుసోయగమువానిఁ దొగ ఱేనిఁ దెగడు నెమ్మొగమువాని
నలతామరల నోమఁ గలకన్నుఁగవవాని మెఱుఁగుబంగరుచాయ మేనివాని
దరలీల గలమేలమరుకంధరమువాని నవసంఖ్య నమరుకర్ణములవానిఁ
బగడంబునఁగ డంబ మగుమోవిజిగివానిఁ బల్లవకరపదద్వయమువాని

తే. విమలముకురాభగండభాగములవాని, నవమృణాలోపమానబాహువులవాని
విపులవక్షంబువాని దోర్వీర్యశాలిఁ, గనియె ముద మంద నొక్కనందను లతాంగి.

క. వనితామణి భూజనతా, వినుతాకృతి సుకృతి తనయు విఖ్యాతనయుక్
గనఁ గాంచి నెనరు మదిఁ బెనఁ, గొనగారా మలర నెత్తికొని పోయి చెలుల్. 81

ఉ. అందము గుల్కుమోము శశి యందము వీనులఁ జూడ శ్రీలకుక్
విందు లగుక్ సరోజపదవిం దులగాఁ గొనఁ గన్ను లమ్మెఱుం
గుం దఱుమం దనూరుచి దగుం దరసుందరతక్ గళం బెసం
గుం దిలకింప నాసిక నగుం దిలసూనము రాజసూతికిన్. 82

క. మునియాఁడుఁబడుచు లీగతిఁ, గొనియాడుచు ముద్దురాచకొడుకునకుఁ బ్రియం
బునఁ గడుపున కిడి శిర సా, య్యన నంటి నలుంగుఁ బెట్టి యతివేగమునన్. 83

మ. మృదులోరస్థ్సలిఁ జేర్చి వెచ్చ నగువారిం బోసి మై యొత్తి నె
న్నుదుటం బొట్టిడి ధూపసౌరభరమానూనస్ఫురన్మౌనిరా
ట్సదనాగారతలంబునం దలిరుసెజ్జ న్నిల్పి సంకల్పభూ
సదృశాకారుఁ గుమారు భూభరణదోస్సారున్ దయాధారునిన్. 84

సీ. జోజో మహారాజ రాజశకుంతలాప్రాక్తనపుణ్యతపఃఫలంబ
జోజో సుభగతామనోజ రాజాన్వయామృతపయోరాశిరాకేందుబింబ
జోజో విభాకరతేజ నిజాశ్రవనీపకనీపవనీపయోద
జోజో నుతసుధీసమాజ సాగరమేఖలాభారభరణకళావినోద

తే. యనుచు జోకొట్టుదురు జవరాండ్రఁ గూడి, జోల వాడుచు రాచూలి నోలి బాల
కసలయగ్రాససముదితకోకిలకదంబ, కంఠకలనాదసమధురగానఫణితి. 85

ఉ. కూరిమియాఁడుబిడ్డలతకూన జయంతవసంతకంతుశృం
గారశరీరునిం గొమరుఁ గన్న సుధాకరతారకాబలం
బారసి నేఁటి కే నొరుల కందఁగ రానిముదంబుఁ గంటి నీ
డేఱె మనోరథం బని మునీశ్వరుఁ డుబ్బు మ నిశ్చలాత్ముఁడై. 86

క. యతులార తపోమహిమా, యతులార గుణాంబునిధి సమాచరితశుభ
వ్రతలాలిత మామకసుత, సుతలాభముఁ బడసె నేఁడు సుముహూర్తమునన్. 87

క. అని యాశ్రమవాసతపో, ధనులకు నిగమాగమాదితత్త్వకళాశో
ధనులకుఁ బరిభూతక్రో ధనులకుఁ దద్వార్తఁ దెలిపి తదనుమతి నటన్. 88

క. కల్యాణతుల్యాయత, కల్యాణఘృణికిఁ గుమారకమణికి గతవై
కల్యాగమవిధి నప్పుని, కల్యమునం జలిపె జాతకరాదికముల్. 89

సీ. మెఱుఁగారు నూనెకురులజాఱుముడితోఁ బాలపెల్లుబ్బుగుబ్బకవతోడ
వదనాగ్రకటులితిక్తవస్తుసౌరభముతోఁ గాటుకకనుదోయినీటుతోడ
నలరుమేదావిక్రిందగు భూతిరేఖతోఁ దాంబూలరాగాధరంబుతోడ
నునుఁబైఁట బిగియఁ జుట్టిన లేతనడుముతోఁ బసుపున గ్గిడిన మైమిసిమితోడ
తే. భుగభుగలఁ బర్వు సాంబ్రాణిపొగలతోడ, జటిశిఖామణి నిజపర్ణసదనసీమఁ
బఱఁగెఁ గాన్పున రంగదపాంగవిజిత, చకితబాలకురంగి యాచంచలాంగి. 90

ఉ సారసలోచనుం గుసుమసాయకరూపశుభాంకమూర్తి బా
లారుణతేజు దిక్కరికరాయతబాహు విశాలవక్షు రా
కారజనీశసుందరముఖద్యుతిభాసితు నక్కుమారు దు
ర్వారబలాభిరాము మునివంశశిఖామణి చూచి పొంగుచున్. 91

మ. భువనైకస్తవనీయ మానిజతపోభూరిప్రభావంబునన్
వివిధాపూపఘృతోదనాదికము లావిర్భూతిగాఁ దత్పదా
ర్థవిశేషంబులఁ గుంకుమాగరుహరిద్రాపుష్పమాల్యంబులన్
నవలాలం దనిపెన్ శకుంతల మహానందంబుఁ బ్రాపింపఁగన్. 92

చ. పదియవనాఁటియుత్సవముఁ బన్నుగఁ జల్పి యనంతరంబునం
బొదవిన వేడ్కతోఁ బదునొకొండవనాఁడు మహర్షికోటి కా

ప్పిదముగఁ గణ్వమౌని పలిపెన్ భరతుం డనునామధేయ మా
సదమలకీర్తికిం బ్రసవసాయకరూపశుభాంకమూర్తికిన్. 93

శా. ఆరాజన్యకుమారచంద్రుఁ డకలంకాంకస్ఫురద్రూపశో
భారమ్యాకృతి వృద్ధిఁ జెందఁగని దృక్పాళీచకోరోత్సవ
శ్రీ రంజిల్ల శకుంతలారమణి రాజీవాహితుం గన్నయం
భోరాశిస్ఫుటవీచి వోలె మది నుప్పొంగుం బ్రమోదంబునన్. 94

క. దినదినమభివృద్ధిఁ గనుం, గొని సితపక్షద్వితీయకుముదాప్తునిచా
ట్పున లోక మభినుతింపఁగఁ, దనరె నృపసుతుండు లబ్ధదశహాయనుఁడై. 95

క. జనపతిసుతు సదశాబ్దున్, మునిమౌళి విధిప్రయుక్తముగఁ దా నుపనీ
తునిఁ జేసె నొకానొకశుభ, దినమునఁ బరమర్షిగణము దీవన లొసఁగన్. 96

మ. చదివె న్వేదము లభ్యసించె బహుశాస్త్రంబుల్ ధనుర్విద్య నే
ర్చెఁ దురంగేభరథాధిరోహణకళాశ్రీ సంగ్రహించె న్విభా
స్వదసిప్రాసకుఠారతోమరగదాప్రావీణ్యసంపాదనా
స్పదుఁ డయ్యె న్మునిరాజబోధకలనన్ శాకుంతలేయుం డొగిన్. 97

క. శాకుంతలేయుఁ డఖిలా, శాకుంతలఘటితకీర్తిసదమలముక్తా
నీకకచత్స్రగ్భాసితుఁ, డై కొమరెసఁగె న్మునీంద్రుఁ డానందింపన్. 98

చ. ఒకమరి నేర్పుమై మునికులోత్తము నిష్కుటవాటి ఫుల్లహ
ల్లకసరసీజలం బిరుగెలంకులబోదెలఁ జిమ్ముఁ గేతకీ
వకుళకదంబనింబవటవంజులలుంగలవంగపూగచం
పకసహకారచందనజపాపనసామలకద్రుమాళికిన్. 99

మ. అసహాయుం డయి పోయి సంతత మరణ్యక్షోణికిం గందమూ
లసమిత్పత్రకుశప్రసూనఫలజాలం బూని సింహాదిస
త్త్వసమాక్రాంతపథాంతరాళమున వీతత్రాసుఁడై వేగవ
చ్చి సమర్పించు మునీంద్రమౌళి కతను చ్ఛేదిప్రపూజార్థమై. 100

మ. అనఘుం డబ్భరతుండు తాపసకుమారాన్వితుఁడై సంభ్రమం
బొనరం గాననశైలముల్ దిరుగుఁ దా నొక్కొక్కవేళన్ దిగున్
స్వనదున్మత్తమరాళమండలగరుద్వాతోచ్చలత్పుండరీ
కనవేందీవరషండసౌరభకనత్కాసారవాఃకేళికిన్. 101

సీ. గగనచుంబినగాగ్రగళదఖండరవస్రవంతికాసలిలప్రవాహతటుల
బహుళగర్జారవప్రతిమాసభయదసింహధ్వానముఖరగుహాంతరముల
గంధసింధురఘటాకటకటాహమదాంబుకర్దమితాహార్యకటకతటుల
క్రోడనాయకముహుర్ఘుర్ఘురస్వానాభిముఖమహావ్యాఘ్రసంపూర్ణవనుల
తే. చటులతరమాద్యదన్యోన్యసమరకుపిత, సారసైరిభవిసరవిషాణకోణ
ఘట్టనకఠక్కఠారవప్రోద్గతవిహంగ, గహనభూముల నతఁ డనర్గళత మెలఁగు.
సీ. జంకపిల్లలపోల్కిఁ జెవులు వట్టికొని యాడించు నొక్కతఱిఁ గంఠీరవములఁ
బిల్లికూనలభంగిఁ బెబ్బులులను బట్టి కలఁకు లొండొంటి కొక్కయెడఁ బెట్టుఁ
గొదమమేఁకలగుంపు నదలించుగతిఁ దోలు నొకవేళ భయదభల్లుకచయంబు
పందికొక్కులఁ బట్టుపగిది గండకముల నొక్కొకపట్టున నొడిసి పట్టుఁ
తే. గదిసి నడగొండల తెఱంగు గడుఁ జెలంగు
మదపుటేనుంగుగున్నలరదములందుఁ
బదము లూఁదుక లఘులీల పొదల నెక్కి
యొక్కొకప్పుడు విహరింపు చుండు నతఁడు. 103
శా. వేదండప్రభుతుండసన్నిభము మౌర్వీనాదదీర్ణాశ మౌ
కోదండంబునఁ గూర్చి యేయుఁ గులిశక్రూరాంబకంబు ల్కుభృ
త్పాదాత్యున్నతపాదపంబులు వడం దద్గండశైలావళుల్
ఛేదిల్లన్ నృపబాలకుండు పటుదోర్వీర్యాప్తి నొక్కొక్కచోన్. 104
క. ఈరీతిని శోభిల్లుచు, నారాజకుమారుఁ డాశ్రమాంతరధరణీ
ధీరమ్యు లైనమౌనికి, మారులతోఁ గూడి విద్య మను చుండంగన్. 105

## శరదృతువర్ణనము.

గీ. అంత నవ్యహంసయానవిలాసంబు, కమలజప్రదీప్తఘనరసంబు
శారదాగమంబు శారదాగమ మట్లు, మెండుకొనియె నవనిమండలమున. 106
క. ఘనబీజమంజరులభర, మునఁ దూఁగుచు మందపవనమున వరులు చలిం
చెను శాలిపాలికాచం, దనగంధులపాటలు విని తల లూఁచు ననన్. 107
క. మును దమ్ము వంచి తమమీఁ, దను బొంగుచు నడిచి పిదపఁ దమకుం గ్రిందౌ
చు నొదిఁగి యడు గంటినవారిని నగె శరపంక్తు లన విరిసె నదితటులన్. 108
ఉ. అంబుజసంభవాండభవనాంతరకాంతివితాననీలప
ట్టాంబరమట్లు మేటినలుపై పొలుపై కనుపట్టె నంబరం

బంబుధి మేలుకొన్నహరికై శరదిందిర మంగళోపచా
రంబుగఁ బట్టువజ్రముకురం బనఁ బెంపెలు పొందె నిందుఁడున్. 109

క. పులినజఘనప్రదేశో, జ్జ్వలమధుకరనికరముఖరవస్ఫుటరక్తో
త్పలరత్నఘంటికాళీ, విలసత్కాంచికల నదులు వెలయుచు నుండెన్. 110

క. కేళీవనాంతరాళము, రాళీఛదనానిలాంకురచలితవికస
న్నాళీకయుతమదాళీ, నాళీకలగీతిరీతి నలరెం గొలఁకుల్. 111

చ. సకలదిగంగనాజనము శాలివనేందిరకున్ హరిన్మణి
ప్రకరపుఁగుచ్చు లూనిచినరాంకవభవ్యవితానముల్ ప్రమో
దకలనఁ గట్టె నాఁ దగె నధఃపరితఃప్రచరత్సముజ్జ్వల
చ్ఛుకనికురుంబపద్ధగనశోభివిపాండుబలాహకచ్ఛటల్. 112

చ. పొరిఁబొరిఁ బ్రాంతకేళివనభూమిఁ జరించుశుకవ్రజంబు చె
చ్చెర నరుదెంచి శాలివనసీమల వ్రాల నదల్చి తోలఁగాఁ
బరుగిడు శాలిపాలికలపల్లవకోమలపాణికంకణ
స్ఫురదురువాలవాయజరుచుల్ గని కంఠకలస్వనార్భటిన్. 113

చ. కలమవనుల్ ఫలోన్ముఖతఁ గానఁగ నయ్యె శరప్రసూనముల్
పొలిచె భుజంగభుజ్నటనముల్ సడలెం గలహంసమండలీ
కలకలనాదముల్ కమలకాననవీథిఁ జెలంగె నిర్ఝరం
బులజలము ల్వినిర్మలతఁ బూనె శరద్దివసాగమంబునన్. 114

వ. ఇట్లఖిల జనమనోహరం బైనశరత్కాలంబున. 115

మ. ఒకనాఁ డమ్మునిరాజు కాననమృగవ్యూహచ్ఛిదాశూరు రా
జకుమారుం గని తత్సమున్నతభుజాస్తంభప్రతాపాంగరూ
పకళాసాహసధైర్యసద్గుణకలాపశ్రీల కాశ్చర్యకౌ
తుకవిభ్రాంతులు ముప్పిరిం బెనఁగ జేతోవారిజాతంబునన్. 116

మ. పదియాఱేడులపాపఁ డెన్నఁ దనురూపశ్రీల మన్నింపఁ డ
మ్మదనుం జెయ్దము లత్యుదారములు శుంభద్విక్రముల్ కార్తవీ
ర్యదశగ్రీవమరుత్ప్రభేదనులు వారల్ దక్క నీదృగ్బలా
స్పదదోర్దూరభినందుఁ డెవ్వఁ డహహా పాటింప లోకంబులన్. 117

సీ. నడచునే స్థాణుకంటకశిలాభూములఁ దపనీయసౌధయూధములఁ గాని
వినఁ గోరునే ఘోరవనజంతురవములు తతశంఖకాహళీరుతులు గాని
కుడువంగఁ దొడరునే యడవికూరలుఁ గాయ లనవద్యభక్ష్యభోజ్యములు గాని
కనఁ గూర్కుఁ దలఁచునే కఱకుదర్భలమీఁదఁ బరిమళప్రసవతల్పములఁ గాని
తే. లీల వసియించునే పర్ణశాల సకల, ధారుణీపాలమౌళికోటీరఘటిత
చిత్రరత్నవిభావిభాసితసభాంత, రాళమునఁ గాని యిమ్మహారాజసుతుఁడు. 118

శా. నానావన్యఫలాశనాభిరతిఁ గాంతారంబున న్మాదృశ
జ్ఞానివ్రాతముఁ గూడి వర్తిలునె శశ్వద్విశ్వవిశ్వంభరా
ధీనుండై యమరేంద్రవైభవసమృద్ధిం జెంది యొంతే యశ
శ్శ్రీ నల్దిక్కుల నించఁ గల్గినమహీభృత్సూనుఁ డూహింపఁగన్. 119

ఉ. రామమయూరవాహరతిరాజులఁ గాంచినకోసలాత్మజా
హైమవతీరమాసతులయట్లు జగద్ధితసువ్రతప్రతా
పామలరూపశోభల సమంచితుఁ డౌసుతుఁ గాంచి సద్గుణ
స్తోమ శకుంతలారమణి శోభిలెఁ గీర్తి దిగంతరంబులన్. 120

గీ. ప్రథితపరచక్రదళనవిక్రమకళావి, భాసి జైవాతృకుండు సత్పథవిహారి
యిట్టిసర్వజ్ఞమౌళి నాపట్టిగర్భ, శరనిధి జనించెఁ దద్భాగ్య మంది పొగడ. 121

క. రాజకుమారుల దేహవి, రాజితసౌందర్యబలపరాజితరాకా
రాజకుమారుల క్షితిపతి,రాజసులం గనమె యెల్లరాచకులమునన్. 122

క. అమితభుజశక్తి వీనిక, సముఁ డెవ్వఁడు గల్గఁ డెల్లజనము వొగడఁ బెం
పమరుఁ బ్రతిదినముఁ దనతేజ మరు లనుసరింప భువనజాతహితుండై. 123

చ. అని మది నెంచి మించినప్రియంబున నమ్మునిసార్వభౌముఁ డ
య్యనుఁగుసుతన్ శకుంతల నిజాంకతలంబునఁ జేర్చి మూర్ధ మూ
ర్కొని కొనగోట ముంగురులు గూడఁగ దువ్వి హితోపదేశ మొం
డనువగుదాని నియ్యకొననౌ మద మామకబోధఁ గోమలీ. 124

మ. పురుహూతుండు బహూకరించి కృపచేఁ బుత్తేరఁ ద్రైలోక్యభా
స్వరసౌభాగ్యవయోవిలాసముల విశ్వామిత్రుఁ దేజోరమా
ధరితాంభోరుహమిత్రు నింగ దిసి తత్పాదాబ్జసేవాఘురం
ధరయై పెద్దగు కాలముంగడపి యంతం దత్ప్రసాదంబునన్. 125

క. మేనక నినుఁ గని కనికర, మూనక మదిలో జగద్భయానకమృగసం
తానకలిత మగునొండొక, కానకడం బెట్టి జనియెఁ గమలదళాక్షీ 126

గీ. అంత నొక్కనాఁ డహర్ముఖమునఁ గాల్య, విధులు సల్పి శిష్యవితతి గొల్వ
ఫలసమిత్కుశార్థ మలకాన కే నేగి, తరులఁ బొదల నదుల గిరుల దరుల. 127

చ. తిరుగుచు నొక్క నిర్మలనదీతటినీపనికుంజమందిరాం
తరగతవై శకుంతసముదాయగరుత్పరిరక్షణంబునన్
నెరయుచు నుండునిన్నుఁ గని నెక్కొనుజాలి గ్రహించి తెచ్చి నా
యిరవున నుంచి నాకుఁ గల దెద్దియొ దానిన పెట్టి పెంచితిన్. 128

మ. నవలా పెంపఁగ నాఁడునాఁటి కసమానశ్రీవయోరూపగా
రవసంశోభినివై వరించితి చతుర్వారాశిమధ్యావనీ
ధవు మాద్యద్విరదాయుతోపమబలాధారుం గుమారు న్మనో
భవశృంగారశరీరుఁ గంటి వినుతింపన్ లోక మెల్లప్పుడున్. 129

ఉ. నారలు చీర లన్నము వనక్షితిజాతఫలప్రకాండముల్
గూరలు దర్భశయ్య లతిఘోరమృగాకులకాననంబు శృం
గారవనంబు పర్ణకుటి కాంచనసౌధము గా మదీయసే
వారతిఁ గష్టపుండశల వర్తిలి తిన్నిదినంబు లిచ్చటన్. 130

ఉ. చాయ దినేంద్రుచందమునఁ జాన నిజప్రియమైత్రి సేవలం
బాయక కీర్తివైభవశుభంబుల వన్నియ కెక్కఁగాఁ దగుం
గా యిలఁ బుట్టినింట నెసకంబునఁ బెక్కుదినంబు లుండఁగా
నాయమ నీకు నాయ మగునా సకలార్థవిధిజ్ఞ వారయన్. 131

క. ముంగొంగుఁబసిఁడి వెంగటి, తంగెటిజున్నంకసహితధనరాశి నివా
సాంగణకల్పమహీరుహ, మంగన కధినాయకుఁడ సుమా చపలాంగీ. 132

చ. అనుపమరత్నకాంచనమయాంచితభూషణవస్త్రపుష్పచం
దనముఖవస్తుసంతతి మనంబున నెయ్యది గోరినం బ్రియం
బున సమకూర్చి సంతతము భోగములం బరితృప్తిఁ జేయు నం
గనకు నిజాధినాయకుఁడ కల్పకభూరుహ మమ్మ పుత్రికా. 133

ఉ. మానిని భర్తృసేవ నియమవ్రతమంచుఁ జరింపుచుం దదీ
యానుగుణప్రవర్తన గృహాగతసూరిజనాప్తబంధుసం

తానములం దదీప్సితపదార్థనయప్రియభాషల న్మకం
బూనఁగఁ జేయుచు న్వినుతి నొందు యశంబున సద్గుణంబులన్. 134

సీ. ఆభోగభోగపుష్పారామమధుమాస మధికవ్యధాసాగరౌర్వవహ్ని
హృదయానురాగబర్హిణఘనాఘనలక్ష్మి దారిద్ర్యవిటపికుఠారధార
సకలసంపల్లతానికరాలవాలంబు శంకాకళంక భుజంగనకులి
బహుశుభవ్రతకార్యపద్మవనీహేళి సంతాపకరటికేసరికిశోర
తే. మభిమతార్థాంకురసుధారసాభిషేచ, నము విపద్భారతిమిరసంతానభాను
మండలము భర్తృసంసేవమానవతికి,మది యదియ కోరఁ దగునమ్మ యుదితభక్తి.
క. లలితగుణవృత్తి నిర్మల, తల రంజిలి తరుణి యాత్మధవపదసేవా
కలనఁ దొలంగక యెన్నిక,దలకొనఁ దగు హారలతిక తరళముఁ బోలెన్.136
ఉ. తేటినబుద్ధికల్మి యువతీమణి భర్తృహితంబు గాఁ దగన్
వేఱొకకార్యచింత మదిఁ బెట్టక బంధుసుహృజ్జనావళి
న్మీటిన క్షేమఁ బ్రోచుచు ననిందితసద్గుణరత్నరాశియై
మాఱలు పట్టు నాకపురిసుస్థిరభోగము లుత్సుకంబునన్. 137
గీ. చాన యాబాల్యసౌశీల్యశమదమాది, సుగుణలతల కుపఘ్నమై జగము వొగడ
భర్తఁ బాయక తద్భక్తిఁ బర గెనేని,సాధ్వి యని యుంద్రుఁ దాని సజ్జనులు మిగుల.
చ. అతను రిపుప్రతాపమథనాధ్యుఁ డహీనగుణప్రభాసితుం
డతులితగోత్రధర్మభరశైకవిశారదుఁడై తనర్చు నీ
పతికడ కేగి సంపదల భాసిలు మమ్మ నిజాప్తబంధుస
న్నుతమతి వై ధరాధిపతనూభవవీరకుమారమాతృకా. 139
చ. వరగుణలక్ష్మి మంజుతరవాణి సమస్తశుభైకమూర్తి సు
స్థిరసుమనఃప్రియుక్ ఘనవిశేషకళాచతురాస్య రాజశే
ఖరుఁ గయికొన్నప్రోడవు తగంగఁ దదీయమహాభుజార్గళాం
తరమణిపీఠిసమ్ముఖమునన్ సరవి న్వెలసిల్లఁ బోలదే. 140
సీ. ఉరుతరస్ఫటికోపలోపలాలితములై మిన్నందికొనఁ జాలు మేడగములు
భాసురాగరుధూపవాసనాన్వితములై యనువొందు క్రీడాగృహాంతరములు
సారాబ్జకుముదకాసారగర్భితములై కనుపట్టు సరసశృంగారవనులు
శశికాంతవేదికాఛాయావృతంబులై పొలుపారు జలయంత్ర భూతలములు

తే. కనకరుచిదంబు లైనయాకల్పకములు
లభినవము లైనదివ్యపట్టాంశుకములు
గలవు పతిఁ గూడి నీయిచ్చ మెలఁగ వచ్చు
నరుగుటయ లెస్స యిది మదీయాభిమతము. 141

మ. అనవద్యాత్మ పతిప్రియాచరణకార్యాయత్తచిత్తాబ్జ లై
యనువర్తింపఁ బతివ్రతామణులు నా ఖ్యాతిం బ్రకాశించి ర
య్యనఘస్వాంతలు భూరిశాంత లనసూయారుంధతీకాంత లం
గన నీ వట్లు సుకీర్తిఁ గైకొనఁ దగుం గా భర్తృసేవారతిన్. 142

క. అని పల్కిన విని మునిచంద్రునియంకము డిగ్గి యాసరోజముఖి తనదుమనం
బునఁ బెనఁగుభక్తిగౌరవ,మున నాయన పాదపద్మముల కెఱఁగి యటన్. 143

క. విను మయ్య విన్నవించెద,నని పలికి మరిందకందళాలాపములం
గనుఁగవ బాష్పజలము లూ,ర నెగ్గొని సంతసముఁ దొఱఁగి దైన్యమునన్. 144

ఉ. భూరిదయానుషంగ పరిపూర్ణతపోమహిమాంతరంగ నీ
సారతరోక్తు లుర్వి శ్రుతిశాస్త్రవిధిప్రయుతంబు లుత్తమాం
భోరుహలోచనాప్రియదముల్ స్వరుదాత్తసుఖప్రదానదీ
క్షారమణీయముల్ పొగడ శక్యమె మాదృశకన్యకాళికిన్. 145

గీ. తండ్రి గాధిసుతుఁడు తల్లి మేనక యని,యొరు లనంగ వినుచు నుండియును ఘ
నంబునందు నెపుడు నాపాలిజననివి, జనకుఁడవును నీవ యనుచుఁ దలఁతు. 146

క. కాంతురు బిడ్డలఁ గూరిమిఁ, బెంతురు గాకుగ్రతరవిపినభూమి నదీ
ప్రాంతమునఁ గన్నసంతతి,వంతలఁ బడఁ ద్రోచి పోవువనిత గల దొకో! 147

ఉ. ఏచినకూర్మి సంతతి మహిన్ వెలఁదుల్ గను టెప్పచాడ్పునం
గాచి తదీప్సితార్థపరికల్పనఁ బెంచుచు వృద్ధి నొందఁగాఁ
జూచుచు నేత్రపర్వముగ సొంపెస లారుదు రింతె యెటిలో
వైచి చనంగఁ దల్లి వలవంతలఁ గుందఁగ నేన నోఁచితిన్. 148

క. అలఘుమతి దండ్రి వారికే, వలకృపఁ గనుతల్లి యట్టి వారల సుత నై
యలజడిఁ బడ నోఁచితి నొ, దల వ్రాసెను వ్రాఁత యటు విధాత కటకటా.

చ. అదయతఁ దల్లి యేటిపులినావనిఁ ద్రోయ శకుంతరక్షచేఁ
బ్రదికితి నుగ్ర మా మెకమురాయిడిఁ బెందక గట్టియాయు వో

ష్పిద మగుటఁ భవత్కారుణిఁ బెంపఁగ నీక్రియ నాదుతల్లి యై
పాదలఁగ దైవయోగమునఁ బొందునె యప్పుడు నన్ను నాపదల్. 150

క. తలిదండ్రులచెంగట న,ర్మిలి నిచ్చలుఁ బెంపఁగాఁ బెరిఁగి ముద్దులు మూ
టలు గట్టుచుఁ దిరిగెడుబి,డ్డలు నో చిననోము లుత్కటము లూహింపన్. 151

గీ. అడవి కరుగుదెంచి కడుఁ గృపఁ గొని తెచ్చి,మీరు పెనుప కున్న ఘోరమృగక
దంబకంబు భోజనంబుగాఁ గొనఁ జూడ, నెవ్వ రడ్డపడుదు రిద్ధచరిత. 152

చ. కరుణ మెయి న్మదీయ మగుకష్టపుఁబాటుఁ దొలంగఁ ద్రోచి భూ
చరఖచరాదు లెన్న నను సర్వపదార్థసమృద్ధిఁ బెంపఁగాఁ
బెరిఁగిన దానఁ గాన మదభీప్సిత మైనదృఢవ్రతంబు నీ
చరణసపర్య నాకపురిశాశ్వతభోగము దానఁ గల్గదే. 153

సీ. అకలంకపాయసాదికభోజ్యములు కాననోర్వీజమధురఫలోత్కరములు
సౌవర్ణరుచిచకచకితాంబరములు పావనకురంగాజినవల్కలములు
బహురత్నకాంతిమత్ప్రాసాదసీమ భూజచ్ఛదాకలితోటజస్థలంబు
గురుకుశమండలాస్తరణవేదిక మనోహరమృదుప్రసవపర్యంకపాళి

తే. తావకకృపాకటాక్షవీక్షావిలాస,మస్మదీయమనోభిమతార్థరాశి
కావున భవత్పదాబ్జసేవావిధాన, మెడలి త్రుటికాల మెచ్చోటి కేఁగ నయ్య.

క. జనవీజనకత్వముఁ గై, కొని పెంచిననీఋణంబు గురుతరభరమై
తనరు నది దీర్పఁ గలనే, జననసహస్రముల నైన సాధుచరిత్రా. 155

క. పరమతపోనిధి యుష్మ, త్కరుణామృతసేచనాప్తి ధర బేఁపగుమ
త్సుచిరతనువల్లికి నీచరణసపర్య య ఫలంబు జన నెయ్యెడకున్. 156

క. ఘనగుణగరిమఁ హరిమ,న్ననఁ గన్నవధూమతల్లి నాతల్లి ననం
జనదు పురాకృతకర్మం,బనుభూతిక రాక తొలఁగ దయ్య జనులకున్. 157

క. అని కన్నీ రొలుక నత్తా,ననయై ననఁబోఁడి చింత నాటినమదితో
దనదుబోటప్రేల భూతల,మును వ్రాయుచు నూర కున్న మునివరుఁ డనియెన్.

క. ప్రమదామతల్లి నా త,ల్లి మదావాసమునఁ గుతుకలీల నొసఁగుచుం
గోమ రెసఁగ నీవు గల కా,లము భరమే తీవకుఁ ఫలము వ్రేఁ గగునే. 159

మ. అఱచే నిల్పి సమస్తవస్తునిచయం బవ్వారిగాఁ గూర్చి నీ
కొఱ కే నర్మిలిఁ బెంచినట్టియనుగుంగూఁతు న్నిసుం బాయ వే

మఱి నాడెందము జాలి ముంచు నిజ మస్మద్గేహమధ్యంబునన్
దఱుచుం గాలము నీ వెసంగ నను నాత్మ న్మెచ్చునే లోకముల్. 160

ఉ. ప్రోడతనంబుఁ గైకొని సపుత్రిక వై తగుకూఁతు భర్తతో
వేడుకమై సుఖం బనుభవింపఁగ నీక నిజాలయంబునం
దూడిగపుంబనుల్ గలుప నుంచిన వాఁ డని నన్ను భూజనం
బాడిక సేయు దానికొఱకై నినుఁ బంపఁ దలంచితిన్ జుమీ. 161

చ. నళినదళాక్షి నీచిఱుతనాఁటివెతల్ మదిలోఁ దలంచి చిం
తిలఁ బని లేదు బాలరవితేజుఁ డుదాత్తభుజాపరాక్రమో
జ్జ్వలుఁడు సుతుండు భూరమణవందితుఁ డై తగు భర్త వీరిచేఁ
గలుగు సుకీర్తివైభవసుఖంబులు నీకు ననశ్వరంబులై. 162

క. నాయింటఁ బెక్కుకాలము, గాయలు గూరలును గూడుగా మెసవిననీ
యాయాసము దీఱఁగ సు, శ్రీయుతవై సుఖముఁ బొందు హృదయేశునితోన్.

గీ. హృదయపతిఁ బాసి సతి పుట్టినింటఁ బెక్కు
కాలము వసింప నుచితంబు గా దటంచుఁ
జాటుచుండుదు రిల ధర్మశాస్త్రవేత్త
లది గదా యాచరింప యోగ్యంబు నీకు. 164

శా. ఆయర్థంబుల జాడ నే నెఱిఁగి ని న్నాత్మేశపాదాబ్జసే
వాయుక్తన్ సుఖకీర్తివైభవశుభావాప్తిన్ సదా భూమిభృ
జ్జాయారత్నములందు మేటి వయి మించం బంపఁగా నేఁటికిన్
నాయంతఃకరణంబునం దలఁచితి న్నా తల్లి నిక్కంబుగన్. 165

గీ. భర్తృసేవావిధికి నిన్నుఁ బనుప నేని
నడికలో నాదుఁ బనిచిన జాలిఁ దూలి
చిత్త మారట పడు నేను సేయువాఁడ
విధిహితము దక్క నొండు భావింపఁ దగదు. 166

చ. అడవికిఁ గందమూలములకై చని క్రమ్మఱి పోయి యెప్పు డె
ప్పుడు నినుఁ జూతు నంచు మది పొంపిరిఁబోయెడు జాలిదూలియ
య్యెడఁ దడ వుండకే నపుడ యింటికి వచ్చి వనీఫలవ్రజం
బిడి కడు గారవింతు నిను నిం పెసలార మదీయ మాతృకా. 167

క. తోయజముఖి తల్లి నీ, పై యనురాగమునఁ బొదలు పామరమతి నే
నీ యడవిఁ దపం బేగతిఁ, జేయుదు నినుఁ బాసి యచలచిత్తముతోడన్. 168

చ. పలుమఱు నిట్లు సాంత్వనపుభాషలఁ దేర్చి యతండు లోచనం
బుల నుడివోక బాష్పజలపూరము గ్రమ్మ నిజాంకపీఠి న
య్యలికులనీలకైశికఁ బ్రియంబునఁ జేర్చి విచారశీలుఁడై
పలుకక యున్నఁ బంకరుహపాణి కరంబులు మోడ్చి యిట్లనున్. 169

సీ. పవలు మాపును హోమగవిఁ గేల నిమిరి మెత్తని పూరి మేపి దుగ్ధములు పిదుకఁ
గమ్మకస్తురి నీటఁ గలిపి పర్ణకుటీర మలికి ముత్తియపుముగ్గులు రచింపఁ
గ్రీడాసరోవారికెలన బ్రోది యొనర్చి యెలమావిమోకబోదెలకు దిద్దఁ
గీరమరాళీమయూరశారీశాబములకు నిష్టాహారములు ఘటింప
తే. నహరహము మీకు దేవపూజానుకూల, ఫలదళాగరుధూపదీపప్రసూన
ముఖపదార్థంబు లాయితములుగఁ జేయ, నెవ్వ రిచ్చోటఁ బతికడ కేను జనిన. 170

ఉ. నా విని యింతిఁ బల్కు మునినాయకుఁ డబ్ధిపరీతవిశ్వధా
త్రీవరసార్వభౌముని వరించి యమూల్యవినూత్నరత్నశో
భావహభూషణాంబరముఖాఖిలవస్తుసమేతరాజ్యల
క్ష్మీవిభవానుషంగతి సుఖింపఁగఁ గోరఁ దగు న్మనంబునన్. 171

ఉ. కోమలి మమ్ము బోఁటిబడుగుంజడదారులఁ గూడి దుర్దమో
ద్దామమృగౌఘయుక్తవనధారుణి శాకఫలోపహారదీ
క్షామతిఁ గోరఁగాఁ దగునె సాగరముద్రితభూరిరాజ్యల
క్ష్మీమహనీయునిం బతిగఁ జేకొను ధన్యుకుఁ గీర్తిమాన్యుకున్. 172

క. అని యివ్విధిఁ బల్కు తపో, ధనుమధురాలాపములకుఁ దరళాక్షి మనం
బునఁ గడు భయమును వినయం, బునుఁ దోఁపఁగ సరసవచనముల నిట్లనియెన్.

ఉ. దైవము నీవ తల్లియును దండ్రియు నీవ నిజంబు నాకు నీ
వేవిధి బోధఁజేసిన సువృత్తము దానిన సల్పు టొప్పు నీ
సేవఁ దొఱంగి పోవుటకుఁ జిత్తము రా దది యట్టు లుండ ని
మ్మావసుధాధినాథుఁ గలయం జన నెక్కువ గల్గ దారయన్. 174

మ అడయుల్ క్రూరతరుల్ బహిర్మధురవాక్యారంభు లాత్మైకకా
ర్యదృఢస్వాంతులు మాయికు ల్లహిత లాధ్యత్వుల్ దదీయానుర

క్తి దలంపన్ మృగతృష్ణ మేఘరుచి యెంతే నమ్మఁ గాఁ బోలదై
న దిగీశాదులు సాక్షులై వెలయు చుండన్ శంక నా కేటికిన్. 175

చ. అనుటయు నాతపోధనకులాగ్రణి యంకగతాత్మజన్ దయా
వినయవివేకశాలిని వేమఱు సూక్తులఁ దేర్చి యాత్మలో
చనవిగళన్మదశ్రుకణజాలముతోడ శిరస్తలంబు మూ
ర్కొన జవరాలికప్పునెఱికొప్పమరెన్ సజలాంబుదాకృతిన్. 176

క. ఇదియ సుముహూర్త మిం కిట, సుదతీమణి తడయ వలదు సురుచిరసుగుణా
స్పదులగు శిష్యుల నేఁ బని,చెద నార్యవర నిశుఁ దోఁడు చెందినప్రేమన్. 177

మ. అనుజన్ముల్బలెని న్నభీప్సితకథావ్యాహారసంతోషితా
త్మను గావింపుచు వారు వెంట నడవం దల్లీ మదీయాజ్ఞఁ బూ
ని నృపాలోత్తముసన్నిధానమున కున్నిద్రానురాగంబునం
జని భాసిల్లుము వార్ధిముద్రితమహీసామ్రాజ్యధౌరేయ వై. 178

చ. అనుటయు గాధిరాజతనయాత్మజ తత్ప్రియపూర్వకోక్తిసం
జనితమనోనురాగ యయి సంయమియంకము డిగ్గి భక్తిపెం
పునఁ దల వాంచి కొమ్మెఱుఁగుముంగురు లాన నమస్కరింప నా
యనపదయుగ్మమొప్పె సమదాళికులస్ఫురితాంబుజాకృతిన్. 179

ఉ. అంకతలంబు డిగ్గి వినయాప్తిఁ బ్రణామము లాచరించు నే
ణాంకముఖి న్మునీందుఁడు ప్రియంబునఁ గౌఁగిటఁ గ్రుచ్చి యెత్తి దృ
క్పంకరుహద్వయీగళదభంగురశోకపయఃకణాళిని
ర్వంకల గోట మీటుచు నవార్యవిచారకృశీకృతాత్ముఁడై. 180

ఉ. ఆలతకూనఁ బల్కు నిలయం బుటజం బుపహార మివ్వన
క్ష్మాలలితద్రుపక్వఫలజాతి మృగాజినవల్కలచ్ఛటల్
చేలము లిట్టి సంపదలఁ జెన్నగు నే జడదారి నిన్ను నే
మేలగు వస్తుజాలమున మెచ్చఁగఁ జేయుదు నమ్మ కోమలీ. 181

గీ. అవని సిరి గల వాఁ డెవ్వఁ డతని యింటఁ
బుట్టఁ దగు నాఁడుపడుచులు పుణ్యరేని
నుభయసంకల్పములు సిద్ధి నొందియుఁ బేద
మను జనించినఁ గుడుపు గల్గుటయ యరిది. 182

క. కావునఁ దల్లీ నాయది, దీవన నీ కెల్ల సిరులు తేజమ్మును బెం
పావహిలఁ జేయు మది సం, భావింపఁగ నింక నరుగుమా యన నంతన్. 183

మ. ఉటజాంతర్గతపంజరాంతరమునం దొప్పారు కీరాంగనా
చ్ఛటలం బ్రాంతరసాలభూజనికరచ్ఛాయావృతాంభస్సరి
త్పటలీపర్యటనోజ్జ్వలత్సితగరుత్పాళి న్విలోకించి యు
త్కటచింతానలవంచితాత్మ యయి వాగ్వైచిత్రితో నిట్లనున్. 184

ఉ. చిన్నటనాఁటనుండి మిముఁ జేకొని వన్యతరూజ్జ్వలత్ఫలో
త్పన్నరసోపహార మిడి పల్మఱుఁ బెంచి శ్రుతిప్రియోక్తి సం
పన్నిధులై ప్రవర్తిలఁగ మక్కువఁ జేసితి ముద్దుఁజిల్కరా
కన్నియలార నేఁడు జనఁ గా వలసె న్మిముఁ బాసి యక్కటా. 185

మ. మమతం బోఁదిది యొనర్చి కేళివనసీమామధ్యకాసారవా
ర్యమలస్వర్ణమృణాళికాన్నపరిపూర్తిన్ యానవైచిత్రి నే
ర్పి మిముం బోఁడలఁ గాఁగఁ జేసితిఁ గదా పేర్మి న్మరాళీసమూ
హములారా యెడఁబాయఁ గా వలసె నాహా దైవయోగంబునన్. 186

చ. పొలఁతుక సారె కక్కరణిఁ బోషితకీరమరాళరాజి సూ
క్తులఁ గడు గారవించి తనకున్ జనకప్రతిమాను లౌమునీం
ద్రులకుఁ దదీయభార్యలకు మ్రొక్కి తదర్పితపుష్పచందనా
ద్యలఘుపదార్థతోషితమనోంబుజ యౌచు సగౌరవంబుగన్. 187

క. నను మీర లిపుడు బలుదీ, వన లిడి పనిచినను బోయి వచ్చెద నని వీ
డ్కొని వారలఁ గన్వమహా, మునిమ్రోలకు వచ్చి డెందమున భయ మొదవన్

క. వనితామతల్లి నిజనం, దనుతోడఁ బునఃపునః ప్రణతి సల్పుసుతన్
మనుమని నాయుర్దీర్ఘుత, మను మని యాశీర్వదించి మధురతరోక్తిన్. 189

సీ. దాఁగవై మేర మీఱక సపత్నులఁ గూడి చెలువునికన్నుసన్నల మెలంగి
మన్నించి యత్తమామల బావమఱఁదుల నేరాండ్ర కనుకూలవృత్తిఁ దిరిగి
రాలచ్చికలిమి గర్వము లేక యతిథుల నిష్టమృష్టాన్నసంతృప్తిఁ దేల్చి
యాప్తబంధుపురోహితామాత్యజనులకు మృదువాక్యకలన సమ్మద మొసంగి
తే. కరుణఁ బాయక సత్యంబుఁ గడకుఁ ద్రోయ
కౌర యిటువంటి సాధ్వీకులావతంస

మెందుఁ గల దని లోకంబు లెన్న నెగడి
కీర్తిఁ గైకొను మంబుజాక్షి మతల్లి. 190

సీ. శ్రీమానినీసరసీరుహాక్షులభంగి శారదావారిజాసనులకరణి
క్షితిభృత్తనూభవాశితికంధరులరీతి వరరోహిణీసుధాకరులయట్ల
ఛాయావధూసారసహితులచందాన రతిరుక్మిణీకుమారకులయోజ
జనకపుత్త్రీరామచంద్రులకైవడి నలశచీలేఖనాయకులపగిదిఁ

తే. దామరసగంధి నీవు నీధవునిఁ గూడి
మానసాభీష్టసకల సంపత్సమృద్ధి
నవనిఁ జిరకాల మను వొందు మనుచుఁ బనిచె
నందనీమణిఁ బౌత్రి నానందగరిమ. 191

మ. తనశిష్యావళిపాత్తునం జనుసుతం దత్పుత్రి దీవించి యి
ట్లనుపం గొండొకదూర మేఁగి హృదయవ్యాలీఢచింతాభరం
బున బాష్పాకులలోచనాబ్జుఁ డయి యార్పుల్ పైపయిం గ్రమ్మ న
య్యనఘుం డాశ్రమభూమికిన్ మరలె నూరార్ప న్మునీంద్రోత్తముల్. 192

వ. అంత. 193

సీ. కచబంధసంబంధగరిమఁ బొల్చుమదాళికులము సంగీతకౌశలము నెరప
వరతనూమిత్రితావాప్తిఁ జెన్నగుతీవ లలరు దోయిళ్లుపాయనము బట్ట
సహజసౌరభరమాసంసక్తి నెలకొన్నవలిగాడ్పు వీవనపొలుపుఁ దాల్పఁ
గలకంఠనిస్వనైక్యముఁ గన్నకలకంఠములు శ్రుతిప్రియదవాక్కులనఁ బొగడ

తే. వర్ణనీయవళీసఖిత్వమునఁ బొదలు, సరససరిదూర్మికాపరంపరలు సలిల
శీకరస్వచ్ఛముక్తాళి సేస లిడఁగ, జనవరాలోకనేచ్ఛ రాజసము మెఱయ. 194

ఉ. చెంతల నాత్మజుండు మునిశిష్యజనం బరుదేర షట్పదీ
కుంతల యభ్రచుంబిగిరికూటగళత్తటినీజలప్రవా
హాంతికపుష్పితద్రునివహాంతరగుంజదళీనపుంజసం
క్రాంతనికుంజవాటి సుకరం బగుమార్గముఁ బూని యేగుచోన్. 195

గీ. మ్రోలఁ గనుపట్టె హరిశితక్రూరనఖవి, దళితగజకుంభగళిత ముక్తాఫలంబు
లతిశయప్రేమ విపినదేవతలు భూప, కులసతికిఁ గానుకలుగాఁగ నిలిపి రనఁగ.

ఉ. సారతరోజ్జ్వలత్కటకశైలదరీకుహరప్రదేశశృం
గారపటీరసాలసహకారమధూకకదంబనింబఖ
ర్జూరసువర్ణముఖ్యతరుశోభివనాంబునదీనదంబులన్
సారసగంధి చూచుచు ససంభ్రమలీలఁ బథాంతరంబునన్. 197

ఉ. మానిని గాంచె మ్రోల శతమన్యుశిలాఫలకప్రకీర్ణకే
ళీనిలయోపశోభిత మళిప్రమదాకలగానమాధురీ
మానితనిష్కుటం బనుపమానమణీమయగోపురం బధి
ష్ఠానపురీవరం బఖిలసంపదధఃకృతగోపురం బటన్. 198

శా. ఖ్యాతేంద్రోపలసాంద్రపార్శ్వయుగకుడ్యోన్నత్య మంతర్బహి
ర్యాతాయాతజనానుబింబని కరోద్యత్పద్మరాగచ్ఛటా
స్యూతప్రాంశుకవాట ముగ్రకదనోర్వీదోర్బలశ్రీభట
వ్రాతం బై విలసిల్లుపట్టణముఖద్వారంబుఁ జొచ్చె న్వెసన్. 199

ఉ. చొచ్చియుఁ జూచుచుం బసిఁడి చొక్కపుమేడలు జాతికల్వపూ
నెచ్చెలిడాహజారములు నిద్దపుఁజాయలఁ గుల్కుపచ్చటా
రచ్చలు గెంపుడాల్ మిసిమిరాణఁ బొసంగెడుపాన్పుటిండ్లబా
రొచ్చెము లేనిమేటికస్రవోగిరపు స్రితనాలకూటముల్. 200

చ. అతులితభూరిరత్ననికరావృతమై బహువాహినీసమా
హిత మయి రాజసంజననహేతుకమై నిజదత్తజీవనో
ద్ధతఘనమండలం బయి ధృతప్రబలారిదరాంకమై రమా
సతికి బలారె పుట్టినిలుచందముఁ దెల్పుఁ బురీంద్ర మెన్నఁగన్. 201

మ. ధ్వనివిశ్రాంతిపదార్థభావరసవృత్తప్రాసలీలం గనుం
గొన భేరీసురతక్రియాపరవశక్షోణీభృదావాసస
జ్జనకాసారవధూపయోధరతటీ సద్భృత్యసంఘంబులం
దొనరం బ్రోచు సుధీప్రణీతకృతి నా నొప్పారు వర్ణింపఁగనీ. 202

చ. అనుగతరాజశేఖర మనంతమణిద్యుతిభాసమాన మ
త్యనుపమవాహినీకులసమాశ్రయమున్ సుమనోన్వితంబునై
యన వగుఁ బ్రోలు రౌప్యకుధరాచ్ఛశతాంగపయోనిధానకాం
చనకుధరంబులుం బలెఁ బ్రశంసకు నెక్కె జగత్త్రయంబునన్. 203

ఉ. సారకళాధిరాడుపలజాలవినిర్మితకేళిమందిర
ద్వారకవాటభూములు నవాంబుజరాగమణీగభస్తివి
స్తారకనత్సువర్ణమయసౌధశిరోగృహమండపంబు లు
ద్వారకలంకపంకజనివాసము లారయ నెచ్చటం బురిన్. 204

చ. అని పురవైభవంబుఁ గొనియాడుచు జవ్వని రాజమార్గముం
గొని చనువేళ రాజగృహగోపురసౌధసరోజరాగర
త్ననికరదీధితుల్ దనువునం బొరసెన్ నృపసాధ్వి గాన నొ
య్యన బురలక్ష్మి మానికపుటారతులం దనకెత్తెనో యనన్. 205

మ. ఉపధానీతమదద్విపేంద్రనికరప్రోత్తుంగదంతాగ్రదీ
ర్ణపయోదాంతరనిర్గతాచ్ఛకరకవ్రాతంబు నా నొప్పుశు
క్తిపుటప్రోద్భవరంగవల్లికము సందీప్తత్రుహ్యామండలా
ధిపలీలాభవనాంగణంబు నృపసాధ్వీరత్న మీక్షించుచున్. 206

క. ఘనహర్మ్యాద్భుతములు మదిఁ, బెనఁగొన మునిశిష్యజనము వెంబడి రాజ
వ్వని సుతుకేల్ దనకేలం, గొని నృపసౌధంబు చెంతకుం జని యంతన్. 207

సీ. నవరత్నశుభగభస్తివినూత్నమకుటాదికములతో హేమాంశుకములతోడ
రవిబింబతులితకాంతివిడంబభవ్యగాత్రములతో నాతపత్రములతోడ
ననివార్యశంఖకాహళతూర్యనిస్వనార్భటులతో రణవీరభటులతోడ
బలవైరిభయదదుర్భరభేరిభూరిభాంకృతులతోఁ గరటిఘీంకృతులతోడ
తే. నలసుధామాధురీధురీణైకభాష
ణములతోఁ బాణిభృతకృపాణములతోడ
నెసఁగు వసుధేశకోటిఁ గ్రిక్కిఱియు పెద్ద
కొలువుమొగసాల దాఁటి ముంగల లతాంగి. 208

సీ. తుఱుమువన్నియఁ జూచి పురివిచ్చి నర్తించు నెమ్ములు విన్నవై యెమ్మెఁ దొఱఁగ
నడపుఁజాయల్వాడ గాంచి గడిదేటినమరాళకులము పైకొనునానఁ దలలు వంప
నరుణాంఘ్రిరుచి శీతకిరణాశ్మసరణి జపాంతికస్ఫటికవిభ్రాంతిఁ దాల్ప
నలుదిక్కులఁ గనత్కనకభిత్తికలకల్మి మేని నిద్దపుఁజాయ మెఱుఁగు లూన
తే. భూభువనభారధారేయభూమిరమణ
కోటియుత మగుమొగసాల దాఁటి తెలుపిఁ

జేసికొని ప్రాజ్యరాజ్యలక్ష్మీవిహార
ధామ మన నొప్పు పతిసభాస్థలిక నరిగి. 209

గీ. అచట దౌవారికవితాన మనుపమాన, మాననీయాత్మరూప సంపదలఁ గాంచి
తవిలి విభ్రాంతిఁ దారచే తనము పగిదిఁ, దరల కుండిన నచ్చోటఁ దడయ కుండ.

క. మునిశిష్యజనము మున్నుగఁ, దనయునికెంగేలు గేలఁ దనరఁగ నలప
ద్మిని యినదర్శనమానస, జనితాభినవానురాగసంరంభమునన్. 211

సీ. చిన్నారిమోముపైఁ జెన్నారుజగజంపుఁగుటిలాలకములు చీఁకటులు రాల్పఁ
దలిరులేఁబ్రాయంబు దళుకొత్తు నెమ్మేను గ్రొక్కారుమెఱుఁగులఁ గ్రుమ్మరింప
సోగకన్ దలమి చూచుమెఱుంగుఁ జూపులు కలికితుమ్మెదకూనకదుపు లీనఁ
దరుణారుణశుభాంకచరణవిన్యాసంబు గెలఁకులఁ గెందామరలను గురియ

తే. జిలుఁగుఁ బయ్యెదవలఁ జిక్కి తొలఁగు వెరవుఁ
గనుఁ గొనఁగ లేనిజక్కవకవయ పోలెఁ
బొదలుబిగిగుబ్బ ద్రేఁగునఁ గదలఁ గాను
కమలలోచన పేరోలగమున కరిగి 212

మ. సమదారాతిధరాధిభూజయరమాసర్వంసహాల్పోవలెఁ బ
ద్మముఖుల్ గ్రేవలఁ బాణికంకణఝణత్కారోల్లసచ్చామరా
గ్రిమరుత్పోతకృతోపచారముగ రాగం బూన్ప మాణిక్యకాం
తిమయప్రోన్నతభద్రపీఠమున సందీప్తాంగజాభాకృతిన్. 213

మ. నలినాప్తుం డుదయాద్రిచందమున రత్నస్వచ్ఛభూపాసము
జ్జ్వలతేజోమయుఁడై సదధ్వగనిజవ్యాపార మాప్తద్విజా
వళి కెంతే వసుసంపదం బ్రముదితస్వాంతంబుగాఁ జేయ నిం
పులు దళ్కొత్త వసించి యున్ననృపతిన్ భూరిప్రభావోన్నతిన్. 214

గీ. కాంచి భయసంభ్రమంబులు గడలుకొనఁగ
జలరుహానన యలసభాస్తంభ మొరసి
కొని నిలిచె సర్వభువనమోహనసువర్ణ
చిత్రితవినూత్నసాలభంజికయ పోలె. 215

చ. నిలిచిన యవ్వధూకులమణిం గని నివ్వెఱఁ జెంది తత్సభా
స్థలి నృపు లిట్టు లుండ వలదా జలదాకులదాలకాళి యూ

చెలువముఁ గాన మెందుఁ దులఁ జెప్పఁగ రా దవు నేమొ వ్రజించెం
తలఁ గలసర్వలేఖవనితాజనతాభినుతాభిరూప్యముల్. 216

మ. అళికశ్రీ శశిరేఖఁ గేరు నగు సద్యద్భ్వారిశారీరకాం
తులు హేమోన్నతి నూరుదీప్తి తల దన్నున్ రంభ శుంభత్కటా
క్షులవశ్రీలు నిరాకరించు హరిణిం జర్చింప నిక్కన్యకా
కులరత్నావయవైకసుందరతఁ జేర్కొ శక్యమే యేరికిన్. 217

చ. అనఘ సువర్ణవర్ణకములై రసవర్తులతాన్వితంబులై
యనవరతక్షమాధిపశయాబ్జపరిస్ఫురితంబులై కరం
బొనరుట నిమ్మపండులు పయోరుహపత్రవిలోచనాఘన
స్తనయుగళంబుతోఁ బెనఁగఁ జాలునొ యేమొ యొకింత సాటికిన్. 218

గీ. అనిశ మతనుసుధర్మసమాశ్రయరతి
నలరి వనమధ్యమున సుమనోనుమైత్రిఁ
దపము సల్పి మధువ్రతోత్కరము లలరుఁ
బోఁడికురు లయి పొడమెఁ గాఁబోలు నొక్కొ. 219

మ. అలకశ్రీ లళు లారు పొల్చు మరువాలై వాలుగల్వాలు గ
న్నులు జన్నులివిరిచెండ్లు విండ్లు బొమ లేనుంగా నడల్ గౌనుతీ
రలవి న్నాఁ దొలుకారుమించుసరి మేనౌ నార యిట్లుండఁగా
వలదా యింతి మనోజ్ఞరూపరుచిలావణ్యంబులం బేర్కొనన్. 220

క. సురలోలాక్షులు కిన్నర, నరలోకసరోజలోచనలు దీనిం బో
లరు రూపవయోలక్షణ, గరిమ నొకింతైన నెన్నఁగా నారారా. 221

ఉ. ప్రాగచలాగ్రభాగహిమభానునిభాంగసువర్ణయష్టిలీ
లాగరిమాప్తిఁ జూడ్కి కతులప్రమదం బొనగూర్చు నిమ్మహా
భాగునితో నృపాలకసభాస్థలి కీలతకూన యొంటిగా
రాఁ గత మేమి యం చచటి రాజులు దన్ను నుతింప నారెకున్. 222

మ. లలితామూల్యవిశేషరత్నకటకాలంకారపాదున్ మహో
జ్జ్వలదష్టాపదసానురాగుని సమంచత్సాంకవామోదని
ర్మలగండస్థలు ఘోరఖడ్గధరు శుంభద్వాహినీజాలు ని
స్తులశృంగారయుతున్ ధరాధిపకులేంద్రుం జూచి హర్షంబునన్. 223 

సీ. నలవసంతజయంతనలకూబరులకన్న కమనీయసౌభాగ్యగరిమవాఁడు
ధారుణీభార మాదలఁ దాల్చుఫణికన్న సరసభాషావిశేషంబువాఁడు
కల్యోదితసహస్రకరమండలముకన్న భవ్యశోభావిజృంభణమువాఁడు
బలితంపునెమ్మిబాబావజీరునికన్న ఘనభుజావక్రవిక్రమమువాఁడు
తే. చక్రవాళాంతరాళభూచక్రభూరి, రాజ్యపరిపాలనకళాభిరామనిశ్చ
లానుకంపైకహృదయతోయజమువాఁడు, వీఁడు తావకసూనుఁ డుర్వీతలేంద్ర.

మ. తనసౌందర్యముఁ గాంచి యంతికధరాధ్యక్షుం బ్రశంసింప న
ల్లన నేతెంచి భవత్పదాబ్జనతి సల్పం గాఁగిటం గ్రుచ్చి యె
త్తి నిజోత్సంగతలంబునం దిడి ధరిత్రీనాథ హర్షాశ్రువా
రినిమగ్నాంగునిఁ జేయు మంచు సుతుఁ గూర్మిన్ బ్రోలకుం ద్రోచినన్. 225

చ. పతి గని వల్కె రూపజితపల్లవకార్ముకు నీతనిన్ భవ
త్సుతుఁ డని ప్రోలఁ ద్రోచితివి చూడ నొకానొకనాఁడు వీని నె
వ్వాతె వితఁ డెవ్వఁ డెయ్యదినివాసము నే రెటువంటి దేల వ
చ్చితి పని యేమి నీకు సరసీరుహలోచన యీసభాస్థలిన్. 226

చ. జలనిధిముద్రితాఖిలరసావలయేశుఁడ నై వనంబునం
గలఫలశాకముల్ గుడుపుగాఁ గుశవేదిక పాన్పు గాఁగ వ
ల్కలములు గట్టుపుట్టములుగాఁగఁ దపస్విని నైననిన్ను నే
వలన వరించినాఁడఁ దెలివా జను లెవ్వ రెఱుంగ కుండఁగన్. 227

క. వీఁ డెవ్వనికి జనించిన, వాఁడో నీ వెవ్వతెవొ రవర వాదువు నీ
పాడి దొఱంగినమాటల, పోఁడుములు వినంగఁ గర్ణముల కింపగునే. 228

చ. అన విని యింతి యి ట్లను నృపాగ్రణి కీవు కరగ్రహం బొన
ర్చినసతి నౌట యేను బెఱచేడియ నౌట యితండు నీకుఁ గాం
చినసుతుఁ డౌట యన్యనృపశేఖరజుం డగుటన్ సుధీజనా
వన హృదయంబునం దెలుఁగవా తగవా యిటు లాడఁ గొల్వునన్. 229

చ. అలఘుగుణాఢ్యుఁ డిక్కొమరుఁ డన్యజుఁ డేనిఁ గనుంగొనన్ భవ
త్సలలితరూపలక్షణభుజాబలనీతికళాతిధైర్యకౌ
శలములకల్మి వీనియెడఁ జాటునె నెమ్మది నీ వెఱింగి కే
వలకితవోక్తు లిట్లు నుడువన్ ఫల మెయ్యది గల్గు భూవరా. 230

క. నీకన్న కొమరుఁ డీతఁడు, నీకన్న బలాధికుండు నిస్తులకీర్తి
స్వీకృతదిక్కూలమదా, నేకపరదనికరసితఘృణివ్రజుఁడు గదా. 231

మ. కొనియాడన్ జగముల్ దనూజు బలయుక్తున్ యౌవరాజ్యాభిషి
క్తునిఁ గాఁ జేయుము మున్ను తాపసవనక్షోణీనదీవాయులో
లనికుంజాంతరమత్కరగ్రహణవేళాదత్తదివ్యద్వరో
క్తి నిజస్వాంతమునం దలంచికొని ధాత్రీమండలాఖండలా. 232

చ. పొలఁతుక యిట్టు లాడ విని భూపతి యన్వర మిచ్చు టెన్నఁ డెం
దులకుల కాంత వెక్కడిసుతుండు సభం ద్రప లేక నిల్చి చెం
తలఁ బ్రజ నవ్వ నేర్పుగలదాన నటంచు బహూక్తిఁ బేల నే
పల మిఁకఁ జాలు నీయునికిపట్టున కేగుము నా నృపాలుతోన్. 233

చ. జలరుహగంధి బల్కు విలసద్రథదంతితురంగసైన్యసం
కుల మిరుఁగ్రేవలం గొలువ ఘోరమృగావళిఁ ద్రుంపఁ గాన కే
వలరుచు వేఁట వచ్చి మునియాశ్రమభూమిఁ జెలంగునన్ను న
ర్మిలి వరియింప లేదె యిది మిథ్యయె నెమ్మదిలోఁ దలంపుమా. 234

ఉ. నా విని యింతిఁ బల్కు నరనాయకమాళి యశేషరాజలో
కావృత మీసభాస్థలి కులాంగన వీ విట నిల్చి పెక్కు మి
థ్యావచనంబు లాడఁ దగ దవ్వలఁ బొమ్ము భవచ్చమత్క్రియా
భావము గాన నయ్యె నయపద్ధతు లీవ యెఱుంగు దుర్వరన్. 235

శా. భూమీశాగ్రణి యిట్టు లాడ విని సుభ్రూరత్న మత్యంతచిం
తామగ్నాత్మమనోజ్ఞయై పలుకు నానావిద్వదుర్వీవర
స్తోమాన్వీతసభన్ భవాదృశులు రాజుల్ ధార్మికుల్ దోర్బల
శ్రీమంతుల్ భువియందసత్యవచనశ్రేణిం బ్రసంగింతురే. 236

చ. సితకరవంశదీపక విశిష్టజనావన ధర్మశాస్త్రబో
ధితవివిధార్థగౌరవవిధిజ్ఞుఁడ వార్యజనోపదేశక
ల్పితశుభకార్యదక్షుఁడ వభిష్టుతసద్గుణశాలి వీవు సూ
నృతమ దృఢవ్రతం బని గణింప వొకింత మనోగతంబునన్. 237

గీ. జగతిఁ గల ధర్మశాస్త్రార్థసరణు లెఱిఁగి
యఖిలవిద్వత్సమేతసభాంతరమునఁ

బార్థివేంద్ర యసత్యంబుఁ బలుకఁ దగునె
నానృతాత్పాతకంపర మ్మనఁగ వినవె. 238

చ. సిరులు దొలంగు శోభనము సేరదు రాదు యశంబు గౌరవ
స్ఫురణ మడంగుఁ బుణ్య మడిపోవు విపద్దశ లొందుఁ బాపము
ల్ధరణిధరంబులై పెరుఁగు లాఘవ మబ్బు జనాపవాదము
ల్వారయు రుజాభరం బొరవు భూవర సత్యము లేనిపట్టునన్. 239

గీ. కుటిలవృత్తి గాధికొడుకు పెట్టిన దుర్ద, శలకు నోర్చెఁగాని జగము వొగడ
ధృతిసమగ్రుఁ డాహరిశ్చంద్రధరణీంద్రుఁ,డనృతభాషణంబులాడఁడయ్యె. 240

గీ. ఇందువంశజమణి భవాదృశుల యిట్టు, లనృత మాడంగ నితరుల ననఁ బనేమి
కపటభావంబు మాని శ్రీకరకరాప్తి, నీకుమారుని నన్ను మన్నింపు మనిన. 241

చ. విని నృపమౌళి వల్కు నరవిందముఖీశతధాసహస్రధా
తనయుఁ డితండు నేను కులతామరసాక్షి నటంచు శంకఁగై
కొనక సభాంతరాళమునకుం జనుదెంచి వృథా నయోక్తులా
డిన ఫల మెద్ది చాలఁ బ్రకటించితి నీయది పౌర్షిధి యిచ్చటన్. 242

క. ఎక్కడి వరి మెక్కడి సుతుఁ, డెక్కడి సతి వేల యిచటి కేతెంచితి పా
మ్మిక్కుమదహితకులోద్భవుఁ, డొక్కపు డనృతంబుఁ బలుక నూహించు నొకో. 243

క. భూలలనావిభుఁ డిట్లు ని, రాలంబోక్తులఁ గలంగ నాడినఁ జింతా
డోలాయమానమానస, యై లోలమృగాయతాక్షి యధిపున కనియెన్. 244

ఉ. సన్నుతిరూపలక్షణభుజాబలరాజ్యరమావినీతిసం
పన్నిధి నన్ను రాగరసమగ్నుఁడవై పరిణయించి యిష్ట సౌ
ఖ్యోన్నతి మన్పఁజాలక యయో విడనాడగఁ జూతురే ''గృహీ
తన్నపరిత్యజే'' త్తనెడుధార్మికసూక్తు లెఱుంగవే నృపా. 245

క. పరమస్వరూపకరుణా, పరవినతసుశీల యైనభార్యామణి నే
పురుషుఁడు వదలునొ ధరణీ, శ్వర యాతఁడు ఘోరరౌరవంబునఁ జెందున్. 246

సీ. రమణీయవంశకైరవశరచ్చంద్రిక సంతానఫలదానసారశాఖి
క్రతుకర్మకిరణదీక్షామంత్రకళ నాకపద్యాసువర్ణసోపానరాజి
తనుభోగసంపల్లతాదోహదక్రియ సకలశుభవ్రతాచరణహేతు
వాత్మవ్యథాసాగరౌర్వానలజ్వాల సదనలక్ష్మీపరిష్కరణలీల

తే. యగుకులాంగన నిష్టసౌఖ్యములకలిమి
మనుపఁ జాలక విడనాడ మదిఁ దలంచు
నతఁడు పురుషాధముఁడు గాక యాఢ్యుఁ డగునె
భూవర యెఱుంగవే నీతికోవిదుఁడవు. 247

ఉ. కోరి వరించినట్టిసతిఁ గూడుట నీతి పరిత్యజింప రా
దూరక సూనృతోక్తి నుతి నొందఁగ నన్న భవత్పదాబ్జసే
వారతి నుండఁ గైకొని ధ్రువంబుగ నీసుకుమారమూర్తి ని
ర్వారణకీర్తిఁ బుత్త్రు యువరాజుగఁ జేయు మఖండధాత్రికిన్. 248

క. గోత్రోద్ధరుఁ డార్యస్తుతి, పాత్రుం డసమానబాహుబలుఁ డహితలతా
దాత్రుఁడు శుభచారిత్రుఁడు, బుత్రుఁడు గలవాఁడె పుణ్యపురుషుఁడు ధాత్రిన్.

చ. అమితయశఃప్రతాపసుగుణాన్వితుఁ డాత్మజుఁ డేమహాత్ముగ
ర్భమున జనించునో యతనిభాగ్యగృహాన్వయనామగోత్రధ
ర్మములు జగన్నుతంబు లయి రంజిలుఁ బిమ్మటఁ బుణ్యలోకసౌ
ఖ్యము సులభంబుగాఁ గలుగుఁ గాదె సుధాకరవంశభూషణా. 250

చ. అమరు రవిద్యుతిన్ జగము లబ్జతతిన్ జలమున్ శుచిక్రియన్
బ్రమద జవాప్తి వాజి శశి రాత్రి సదోత్సవలీల నిల్లు దా
నమున గజంబు హంసమిథునంబున నిమ్నగ శబ్దయుక్తి వా
క్యమహిమ పండితస్థితి సభావని పుత్రునిచేత వంశమున్. 251

ఉ. వేయి వచింప నేల పృథివీప సమస్తవినీతిశాస్త్రవి
ద్యాయుతమానసుండవు గదా రమణీయపురాతపఃఫలం
బో యన డాయ వచ్చినసుపుత్రుని రాజ్యరమానుషక్తబా
హాయుగళోపగూహనసుఖాంబుధిఁ దేల్ప వదేమి చెప్పుమా. 252

మ. అని సుభ్రూతిలకంబు పల్కి నయవాక్యస్ఫూర్తు లాలింప క
జ్జననాథుం డనియెం గృపావిరహితస్వాంతాబ్జుఁడై మీనలో
చన నీ వెక్కడిభార్య వెక్కడితనూజన్ముండు పో పొమ్ము నీ
వనుమానింపక శీఘ్రయానమున మిథ్యావాద మింకే లనన్. 253

ఉ. ఆ మనుజాధిపోక్తి చెవి నానఁగఁ దాఁ బునరుక్తి లేమి దృ
క్తామరసద్వయీవిగళితస్ఫుటదుర్దమశోకబాష్పధా

రామిళితోన్నత స్తనరథాంగకయై జగదేకపుణ్యసా
ధ్వీమణి గాఢమూర్ఛఁ గొని తెప్పిఱి ముప్పిరి గొన్న ఖిన్నతన్. 254

మ. అనుకంపాలతికాలవిత్రము లసత్యాలాపమూలంబు ల
న్యనరశ్రీహరణోత్సుకంబు లనయవ్యావిద్ధముల్ క్రూరక
ర్మనివాసంబులు స్నేహదూరములు గర్వచ్ఛన్నముల్ సాధుస
జ్జనసంతాపదముల్ గదా నృపమనోజ్ఞంబు ల్విచారింపఁగన్. 255

చ. అని తలపోసి సెమ్మది మృగాయతలోచన కన్నుఁ దమ్ములన్
ఘనతరశోకబాష్పకళికల్ దొరఁగన్ మును తల్లిదండ్రులుం
గని విడనాడి రిప్పుడు జగన్నుతుఁ డాత్మ విభుండు గార్మిఁ జే
కొనక పరిత్యజించె నెట కేగుదు నెవ్వరు దిక్కు నాకిఁకన్. 256

ఉ. శుంభదభీష్టభోగములఁ జొక్కి సదా ప్రియభర్తృగాఢదో
స్తంభకృతోపగూహన ముదారసుఖాప్తి మహాశుభవ్రతా
రంభమనోజ్ఞలై వెడల గ్రాఁగక వేడుక నుండునట్టియా
బంభరనీలకుంతలలప్రాక్తనపుణ్యము లెన్న శక్యమే. 257

మ. రమణోత్సర్జితకామినీజనతనూప్రాంచద్వయోరూపల
క్ష్మీ మహాశూన్యగృహస్థదీపకళికాశ్రీఁ బోలి విఖ్యాతిఁ బెం
పమరం జాలదు మత్పురాచరితపుణ్యం బిట్టిదై యుండ న
ల్వ మదిన్ దూఱఁ బనే మటంచు సుతుకేలం బూని ఖిన్నాత్మయై. 258

చ. కమలహితాంబుజాహితముఖగ్రహరాజి ధరాదిభూతపుం
జము దిగధీశ్వరప్రతతి సాక్షి గదా మును రాజవంశర
త్నము ననుఁ గూడునప్పుడు గనంబడ విప్పు డహో యసత్యవా
క్యము బల మయ్యె సత్య మడుగంటెఁ గనుంగొనఁగా వసుంధరన్. 259

క. అని పలికి కలికి మును వ, చ్చిన జాడఁ జనంగ నూహ సేయునవసరం
బున వినఁ బడె రాజసభా, జనకర్ణపుటీకఠోరశబ్దము నింగిన్. 260

క. అది యెట్టిదన నృపాలక, "యది నీ కులభామ యాతఁ డాత్మజుఁడు నిజం
బెద నెఱిఁగి యసత్యముఁ బ, ల్కుదురె భవాదృశులు నీతికోవిదు లెందున్."

చ. అని యశరీరి యాకసమునందు ఘనాఘనగర్జితస్వనం
బునఁ బలుకన్ ధరాతలవిభుండుఁ దదంతికభూమిభృత్సుధీ

జనముఁ గుతూహలాద్భుతరసస్థితి నెమ్మదిఁ గాంచెఁ బైపయి
న్వినఁబడియెన్ "నిజం" బనెడు నిర్భరఘోష మశేషదిక్కులన్. 262

సీ. కురిసెఁ బైపై మనోహరవాసనారమామ్లానకల్పతరుప్రసూనవృష్టి
మొరసె గర్జారవస్ఫురణసౌపర్వణభేరీపటహదుందుభివ్రజంబు
పొరసె నానాదిగంతరముల నప్సరోగణసుధామంజులగానరవము
నెరసె వియద్వాహినీతరంగాచ్ఛపయఃకణశీతవాతాంకురములు
తే. వేదవిద్భూసురాశీర్వినాద మెనయు, సకలదేశాంతరాగతసత్కవీంద్ర
సూతమాగధపాఠకస్తోత్రరవము, లలరె నప్పుడు రాజసభాంతరమున. 263

మ. ఉభయాశాగతశౌర్యవైభవసమాఖ్యోపేత ముర్వీతల
ప్రభులోకం బనురాజవంశజశిఖారత్నంబు నీక్షించి యీ
శుభచారిత్ర తనూజుతో ఘనసభాక్షోణీస్థలిన్ నిల్చి య
స్తభయభ్రాంతి ముహుర్ముహుర్వినయభాషాపాండితిన్ జూపఁగన్ 264

క. ఆలింపక తత్ప్రీతిక్రూ, రాలాపములం గలంగ నాడిన నీ వ
చ్చాలమదిఁ గుంద నివి నా, భీలస్వన మొదవెఁ జెవులు పిమ్మటఁ గొనఁగన్.

శా. ఈ లావణ్యవతీకులాభరణ మీ హేమాంగి యీ రూపరే
ఖాలంకారసమిద్ధ బాహుబలుఁ బ్రాగద్రిస్థలావిర్భవ
న్నాళీకాప్తసమానసూను విహితానందానుసంధాను గెం
గేలం గైకొని వచ్చుటేమి నృపలక్ష్మీభృత్సభాక్షోణికిన్. 266

చ. అన విని రాజలోకమున కవ్విభుఁ డిట్లను మున్ను ఘోరకా
ననినివసన్మృగౌఘమథనంబునకేఁ బృతనాన్వితుండనై
యనిలజవాశ్వ మెక్కి భయదాటవిఁ జొచ్చి యనేకభూమిభృ
ద్ఘనతటినీదరీస్సుకటకంబులు చూచుచు దూర మేగితిన్. 267

చ. చని కనుఁగొంటి ముందట రసాలనమేరుకదంబనింబకాం
చనకదళీవటామలకచందనకుందకురంటకాదిభూ
జనికరశోభితంబు మదషట్పదకోకిలకీరశారికా
నినదసమాహితం బొకమునిప్రవరాశ్రమభూమి నొక్కెడన్. 268

ఉ. కాంచి హయోత్తమంబు డిగి గ్రక్కునఁ బ్రాంతనదీపయఃకణా
భ్యంచితశీతమారుతము లధ్వగతశ్రమ మార్పుచుండఁగా

నించుక పాదచారి నయి యేగి మునిప్రవరోటజస్థలిం
బంచశరైకరాజ్యరమభంగిఁ జెలంగెడునిమ్మృగేక్షణన్. 269

క. చూచి మనోభవవశతనా, రాచములం దవిలి దుర్భరపుమోహము నే
నైచక గాంధర్వంబున, నీచెలిఁ గైకొంటి జనము లెఱుఁగక యుండన్. 270

గీ. లేనికోపంబు గనుఁగవ నూని లాఁతి
పగిది నిష్ఠురభాషలు పలుక కేను
మత్కులాంగన యిది నాకుమారుఁ డితఁ
డనుచుఁ గైకొంటి నేని మోహమున నిపుడు. 271

చ. చిఱుతనిఁ గేలఁ బూని యొకచేడియ యెవ్వతో కాని లజ్జ పెం
పఱి సభఁ జేరి యేను కులభామ నితండు సుతుండు నీకు నా
నెఱి కులగోత్రముల్ దెలియ నేరక దాని గ్రహించె రాజటం
చురక జనం బొనర్చునడి కొప్పుట యెట్లు ధరిత్రిఁ గావునన్. 272

చ. సురుచిరమైన సూనృతము చొప్పఁ దొలంగి యసత్యవాక్యవి
స్ఫురణముఁ జూప నే నలరుఁబోఁడి నిరూఢపతివ్రతాత్వవై
ఖరి నశరీరివాగ్గరిమ గర్ణపరిష్కరణం బొనర్చె ను
ర్వరఁ బ్రజకంతరంగమున వర్తిలు సంశయ మెల్లఁ దీఱఁగన్. 273

క. అని పలికి శకుంతలఁ గనుఁ, గొని పాతివ్రత్యమహిమకు న్మెచ్చితి మా
నిని యంతఃపురమునకుం, జను మని తగువారిఁ గూర్చి జనపతి పనిచెన్. 274

చ. అనిచి శకుంతలాసహితులై యరుదెంచిన మానిశిష్యులం
గనుఁగొని లేచి వందనము గౌరవ మున్నతిఁ జేసి యున్నతా
సనముల నర్ఘ్యపాద్యముఖసత్క్రియలం దనియించి భద్రమా
యనఘమునీంద్రులార తమకం చని పల్కి యతండు వెండియున్. 275

మ. కృతసత్కారహృదంబుజప్రముదితోర్వీనిర్జరాశీర్వచః
ప్రతతిం జెంది తదాననోక్తి నిజపుత్రశ్రేష్ఠునామం బెటిం
గి తుషారాంశుకులావతంసము తపఃకీర్తిక్షమాసత్యభూ
షితులన్ వారిఁ దపోవనక్షితికిఁ బంచెం బంచి తా నంతటన్. 276

చ. అకలుషమూర్తి సార్వ్వసహితార్యుఁడు లోకభయంకరాసమాం
బకదహనాహతాతనువిపక్షుఁ డుదంచితగోత్రధర్మవృ

ద్ధికరుఁ డనంతభూషణుఁ డుదీర్ణకళానిధి రాజమౌళి శ
క్తికలితు నిం గుమారుని నతిప్రమదంబునఁ జేర్చి కౌఁగిటన్. 277

ఉ. అంకమునందు నిల్పి నయనాబ్జముదశ్రుకణాభిషేచనా
లంకృతుఁ జేసి కాంచనకలాపము లంగమునన్ ఘటించి భ
ద్రాంకవయోభిరూపనిధియై తగువీఁడు సమస్తశత్రునా
శంకరుఁడై వసుంధరఁ బ్రజ న్మనుచుం జిరకాల మున్నతిన్. 278

చ. అని మది నెంచి శీతకిరణాన్వయమౌళి తనూజు నొక్కశో
భనదివసంబునం దఖిలబంధుపురోహితభృత్యవర్గముల్
గని తగునంచు సంతసిలఁగా యువరాజుగఁ జేసె ఘూర్ణిలన్
ఘనతరభేరికాపటహకాహళశంఖమృదంగఘోషముల్. 279

మ. యువరాజై భరతుండు దా నిటులు గర్వోదగ్రనానావిప
క్షవిభుశ్రేణి భుజాబలోద్ధతి రణక్ష్మామండలిం గెల్చి త
జ్జవనాశ్వేభశతాంగవస్త్రమణిభూషాద్రవ్యముల్ దెచ్చి కీ
ర్తివిశాలుం డగుతండ్రిమ్రోల నిడి భక్తిన్ మ్రొక్కి నిల్చెన్ సభన్. 280

ఉ. తాలిమిఁ దండ్రియాజ్ఞఁ దలఁ దాల్చి పదాబ్జనమద్విపక్షరా
జ్ఞాలరథద్విపప్రభృతిసైన్యము చెంతలఁ గొల్వఁగా హర
త్కూలవిసృత్వరస్వభుజఘూర్ణిగిరీభరితప్రతాపల
క్ష్మలలితుం డతండు మెఱసెన్ జనతాభినుతాభిధేయుఁడై. 281

చ. అగణితరూపలక్షణుఁ డనంతబలాఢ్యుఁడు వీతశాస్త్రపా
రగుఁ డగువీని కొక్క యెలప్రాయపుజవ్వనిఁ బెండ్లిఁ జేయఁగాఁ
దగు నని కొల్వునం గలబుధప్రతతిం గని పల్క భూమిభృ
న్నగరిపుఁ డట్ల సేయు మన వారలు నెమ్మది సంతసిల్లుచున్. 282

ఉ. చిత్తజురాజ్యలక్ష్మి సరసీజముఖీమణి రూపలక్ష్మణా
యత్తశుభాంగి సద్గుణగణాన్విత యా ననఁ బొల్చునొక్కరా
జోత్తమజన్ సునంద యనుకన్యకఁ గైకొని తెచ్చి చేసె భూ
భృత్తిలకంబు పుత్రునకుఁ బెండ్లి సులగ్నమునందు నత్తఱిన్. 283

ఉ. శ్రీకరధూపసౌరభము హృద్యహార్మ్యమణితోరణంబు ము
క్తాకృతరంగవల్లిక మఖండగృహాంతరరత్నదీపికా

నీకము భద్రవాద్యరవనిస్తుల మై కనుపట్టెఁ బోరిలు భూ
పాకభిదాత్మసంభవవివాహమహోత్సవకారణంబునన్. 284

మ. అనతారాతిజయేందిరాయుతుఁ డతం డత్యంతహర్షాప్తిఁ బు
త్రున కుద్వాహ మొనర్చి తెచ్చె హితబంధుస్తోమవిద్వత్కవీం
ద్రనికాయాద్యఖిలార్థిజాతములఁ బ్రత్యగ్రాంబరామూల్యకాం
చనభూషాహయవీటికాప్రభృతిచంచద్వస్తుసంపూర్తితోన్. 285

క. కృతపరిణయుఁడై భరతుం, డతులబలశ్రీసుకీర్తి యగు దుష్యంత
క్షితిపాగ్రణి యనుమతిఁ దను, మతిమంతులు వొగడ ధీసమగ్రత వెలయన్.

మ. క్షితి దుష్యంతుఁడు పెక్కుకాలము సుఖశ్రీ తృప్తిఁ జెల్వొంది వృ
ద్ధత రా నొం డొకనాఁడు బంధుబుధభృత్యశ్రేణులం గూర్చి శా
శ్వతభూలోకరమాపురంధ్రిఁ ద్రిజగత్సంస్తూయమానస్వదో
రతులస్ఫారబలుం గుమారకు నయవ్యాపారుఁ జేర్చెం దుదిన్. 287

చ. నిజభుజమండలీమిళితనిస్తులరాజ్యరమాపురంధ్రి నా
త్మజు భుజపీఠి నిల్పి యుచితంబుగ వాని కతండు బల్కు నం
బుజహితునిన్ సరోజములు వోలెఁ గుమారక నిన్నుఁ గాంచి భూ
ప్రజ లనురాగ మొందఁగ ధరాపరిపాలన మాచరింపుమా. 288

మ. అతిదాక్షిణ్యమున న్మహోచితుపాయప్రౌఢి నౌదార్యసం
గతి శక్తిత్రయరూఢి ఘోరరిపుశిక్షాదక్షబాహాబలో
న్నతి సత్యవ్రతధర్మకర్మనిరతిన్ నానాబుధాభీష్టదా
ప్రతిమశ్రీఁ బృతనాప్రసక్త జగతిం బాలింపుమా పుత్రకా. 289

చ. అని నృపనీతు లెన్నిగల వన్నియు నేర్పడ బోధఁ జేసి నం
దనునకు భూమిపాలుఁడు నితాంత తపశ్చరణానురక్తిమైఁ
జన మది నిశ్చయించి నిజసాధ్వి శకుంతలతో మహాతపో
వనగమనోన్ముఖుం డయినవానిఁ గనుంగొని జాలి దూలుచున్. 290

మ. భరతక్ష్మాపతియున్ సునందయు సుధీబంధుస్వభృత్యవ్రజం
బిరుచక్కిం బర తేరఁ బోరి ల్వెడలి భూభృన్మౌళి యాశ్లేషణా
చరణస్నేహరసానుకూలమృదుభాషాచాతురిం దేల్చి యొం
డొరుల న్వీడ్కొని నెవ్వడం జనియె భార్యోపేతుఁడై కానకున్. 291

చ. గొడుగుల నీడ వజ్రమణికుట్టిమభూమిఁ జరించురాజరా
జడవి దుష్పద్రుకంటకమయం బగు త్రోవ లతాంగిఁ గూడి పో
యెడుఁ గను మంచుఁ జారతతి కేర్పడఁ జూపుచు నిట్లు చింతితా
త్మఁ డయి సునందఁ గూడి భరతుం డరుదెంచెఁ బురంబులోనికిన్. 292

ఉ. వచ్చి బుధాప్తమంత్రిజనవర్గము చెంతలఁ గొల్వ లోకముల్
మెచ్చ నఖండవైభవసమృద్ధి భుజాయుగశక్తి సర్వభూ
భృచ్చయమస్తకోపరికిరీటమణిద్యుతిభాసితాంఘ్రియై
నిచ్చలు ధర్మ మూది ధరణీపరిపాలన మాచరింపుచున్. 293

మ. తపనీయోన్నతసౌధవీథికల నుద్యానోర్వి నెత్తావియ
చ్చపుఁబూదేనియయేటికాలువలపజ్జం గాంతిమచ్ఛందరికాం
తపుటిండ్లన్ సరసీజకైరవమిళత్కాసారతీరంబులన్
నృపరత్నంబు సునందఁ గూడికొని యుండెం బెక్కుకాలంబిలన్. 294

క. అంతట దుష్యంతమహీ, కాంతుఁడు కులకాంతఁ గూడి ఘనతరగహనా
భ్యంతరమున మునిజనసం, క్రాంతం బొకవనముఁ గాంచి కదియం జనియెన్.

సీ. చని తద్వనస్థావసన్మునిశ్రేణికిఁ బ్రణమిల్లఁ బరమగౌరవముకలిమిఁ
దగుపూజ వార లాత్మకుఁ బ్రీతిఁ గూర్పఁ దన్మైత్రిచేఁ దపము సమగ్రనిష్ఠఁ
గులకాంత బరిచర్య సలుపఁగా బెక్కేండ్లు చేసి పిమ్మటఁ దపస్సిద్ధిఁ బొరసి
జలజాప్తతులితతేజస్స్ఫూర్తి సతితోడ నరిగి స్వర్లోక సౌఖ్యంబుఁ జెందెఁ

తే. జంద్రకులమౌళి దుష్యంతజనవిభుం డ
టంచు సూతుఁడు వినయవాక్యములఁ బలుక
నాలకించి కుతూహలు లగుచు నతని
సభినుతించిరి శౌనకాద్యఖిలమునులు. 296

క. లోకులు చదివిన వ్రాసినఁ, బ్రాకటముగ విన్న నీపురాతనపుణ్య
శ్లోకకథ వారలకు సుక, లాకౌశలధృతియశోబలశ్రీ లొసఁగున్. 297

క. ఎందాక నిందుభాస్కరు, లందాక జగత్ప్రసిద్ధమై సర్వసుధీ
సందోహశ్రుతిహితపద, బృందం బగుమత్ప్రణీతకృతి భాసిల్లున్. 298

మ. గణనామేయమహత్త్వవిష్టపవిసర్గస్థేమసంహారకా
రణచాతుర్యకటీనిబద్ధగజచర్మక్షౌమ గంగాపయః

కణముక్తాఫలమండలీరచితరంగద్రంగవల్లీశుభాం
గణ కాశీనగరాధినాయక జగత్కళ్యాణసంధాయకా. 299

క. దివిజారిసామజసృణీ, ప్రవిమలవామాంగలసదపర్ణారమణీ
భవతిమిరద్యుమణీ కం, ఠవిభూషితశేషఫణిఫణారత్నఘృణీ. 300

మాలినీవృత్తము. అవిరళవిశదాంగా యార్యచేతోబ్జభృంగా
ధవళవృషతురంగా దర్పితానంగభంగా
భువననిధినిషంగా భూతధాత్రీశతాంగా
భవతిమిరపతంగా పార్వతీచిత్తసంగా 301




ఇది శ్రీ విశాలాక్షీకాశీవిశ్వేశ్వరకరుణాకటాక్షవీక్షాలబ్ధసరస
సాహితీధౌరేయ విద్వజ్జనవిధేయ గౌతమగోత్రపవిత్ర
సూరయామాత్యపుత్ర సద్గుణసమాజ నాగరాజప్ర
ణీతం బైన శకుంతలాపరిణయం బను మహా
ప్రబంధంబునందు సర్వంబును

ద్వితీయాశ్వాసము.

మంగళమ్.

శ్రీ శ్రీ శ్రీ.



# శుద్ధపత్రిక.

## ప్రథమాశ్వాసము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 5 | యాపద్మాక్ష | యోపద్మాక్షి |
| 2 | 8 | నంతర్యాణి | నంతర్యాణిఁ |
| 3 | 6 | సోపిన | చోపిన |
| 4 | 1 | నీవురచించిన | నీవురచియించెదు |
| 4 | 7 | మద్వంశావతార వర్ణనా పూర్వకంబుగ...సమర్పించితి | మద్వంశావతారంబభి వర్ణించెద |
| 6 | 17 | విభాంగుడు | విభాంగుఁడు |
| 7 | 16 | యాహ్వోయుఁడు | యాహ్వాయుఁడు |
| 11 | 19 | విశ్వనాథుడు | విశ్వనాథుఁడు |
| 8 | 2 | న్ఫునా | స్ఫునా |
| ,, | 19 | లీఁడె | లీడె |
| 14 | 2 | హీతోక్త | హితోక్తి |
| 16 | 18 | జెండగఁ | జెండఁగఁ |
| ,, | 19 | క్రేగంటి | క్రేఁగంటి |
| 23 | 5 | తేఁగన్మింటికిఁ | తేగన్మింటికిఁ |
| ,, | 22 | బల్లెములఁ | బల్లెముల |
| 24 | 11 | కడిండి | కడింది |
| ,, | 12 | నెలుగు | నెలుఁగు |
| ,, | 20 | మవ్వఁపు | మవ్వపు |
| ,, | 28 | న్వనోర్వింని | న్వనోర్వనిం |
| 25 | 9 | బోడగాంచి | బోడఁగాంచి |
| ,, | 24 | కేఁగె | కేగె |
| 26 | 27 | నేఁగుదెంచు | నేగుదెంచు |
| 27 | 21 | మెందుగాన | మెందుఁగాన |
| ,, | 25 | మూగినతు మెదల | మూఁగినతుమ్మెదల |
| 28 | 9 | వెలదుల నెలత | వెలఁదుల నెలఁత |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 28 | 18 | ముంగుఱుల మెఱుంగు | ముంగురుల మెఱుంగు |
| ,, | 24 | పడతుక | పడఁతుక |
| ,, | 28 | బెళ్కుచూపులు | బెళ్కుఁజూపులు |
| 29 | 1 | తెఱపసోగ మెఱుంగుకుఱుల | తరుణిసోగ మెఱుంగుఁగురుల |
| ,, | 5 | వెలది | వెలఁది |
| ,, | 25 | హసించు | హసించుఁ |
| 31 | 25 | మీరిట | నీవిట |
| 32 | 4 | నందాక | నందాఁక |
| ,, | 6 | డాతడూ | డాతఁడూ |
| ,, | 9 | నాడహర్మ్యఖం | నాఁడహర్మ్యఖం |
| ,, | 12 | కేఁగుదెంచు | కేగుదెంచు |
| ,, | 28 | వృత్తిదా | వృత్తిఁదా |
| 34 | 21 | బచరింప | పచరింప |
| 35 | 24 | చూడగన్ | చూడఁగన్ |
| 36 | 2 | బోడిసేయు | వోడిసేయు |
| ,, | 8 | మెఱుంగుబోండ్లు | మెఱుంగుఁబోండ్లు |
| ,, | 26 | నేఁగి | నేగి |
| ,, | 27 | లో | లోఁ |
| 37 | 15 | చెక్కునాట్య | చెక్కులనాట్య |
| ,, | 16 | నత్తమిల్ల | నత్తమిల్లఁ |
| 38 | 6 | విన్నదనము | విన్నఁదనము |
| ,, | 7 | జెచ్చెర | జెచ్చెరఁ |
| ,, | 22 | బ్రాకఁ | ఁబ్రాఁకఁ |
| ,, | 24 | దన్నగల | దన్నఁగల |
| ,, | 26 | తళ్కుచెక్కు | తళ్కుఁజెక్కు |
| 39 | 10 | వేల్పుప్రోయాలు | వేల్పుఁబ్రోయాలు |
| ,, | 12 | కేఁగి | కేగి |
| 41 | 27 | నిర్వంనఁచ | నిర్వంచనఁ |
| 42 | 3 | తలపఁగ | తలఁపఁగ |
| ,, | 9 | బడచెన్ | బడఁచెన్ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 43 | 11 | ననుంగుచెలికత్తియ | ననుంగుఁజెలికత్తియ |
| ,, | 15 | సైన్యములతో | సైన్యములతోఁ |
| 44 | 24 | పరిణయమునందు | పరిణయంబనుమహాప్రబంధంబునందు |

## ద్వితీయాశ్వాసము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 46 | 13 | తలప | తలఁప |
| 47 | 23 | నాడునాటికి | నాఁడునాటికి |
| ,, | 24 | లేఁగాడుపు | లేగాడుపు |
| 48 | 12 | కలన | కలనఁ |
| ,, | 22 | మీద | మీఁద |
| ,, | 23 | కొలకుల | కొలఁకుల |
| ,, | 24 | రజపుచొక్కపు | రజపుఁజొక్కపు |
| 49 | 2 | రపుపొన్న | రపుఁబొన్న |
| ,, | 4 | విరితే | విరిఁదే |
| 50 | 2 | మూది | మూఁది |
| ,, | 3 | గండుదుమ్మెద | గండుఁదుమ్మెద |
| ,, | 5 | పొలతుక | పొలఁతుక |
| 51 | 6 | జేదిగిచి | జేఁదిగిచి |
| ,, | 27 | కాకటి | కాఁకటి |
| 52 | 14 | నేఁగి | నేగి |
| ,, | 16 | జిలుంగుపావడలు | జిలుంగుఁబావడలు |
| 53 | 16 | మీద | మీఁద |
| 54 | 6 | సానబట్టిన | సానఁబట్టిన |
| 57 | 8 | పాలక | చాలక |
| ,, | 23 | గొర్త | గొఱ్త |
| 60 | 5 | కలకి | కలికి |
| ,, | 7 | నీఫ్సిత | నీప్సిత |
| 61 | 12 | గ్గిరిఁదరియరు | గ్గిరిదరియరు |
| 69 | 26 | చనవు | చనువు |
| 71 | 12 | పటిలీల | పటులీల |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 71 | 26 | కళికా | కళికా |
| 73 | 13 | దట్టపుపుష్పరజము | దట్టపుఁబుష్పరజము |
| 74 | 16 | యద్దపుచాయ | యద్దపుఁజాయ |
| 76 | 10 | నఫ్సర | నప్సర |
| ,, | 24 | యవసరము | యవసరమునఁ |
| 80 | 6 | గదియఁబోయి | ఁగదియఁబోయి |
| ,, | 12 | గలదె | గలవె |
| 82 | 24 | సుఖశ్రీవివశునిఁ | సుఖశ్రీవివశునిఁ |
| 86 | 19 | ధపాలార | ఫాలాధర |

## తృతీయాశ్వాసము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 88 | 20 | క | గి |
| ,, | 25 | చద్దుంగు | చెద్దుంబు |
| 89 | 23 | సేపునకు | సేపటికి |
| 90 | 3 | నమస్కరించియె | నమస్కరింపనె |
| 94 | 5 | నాతఁడీఫ్సిత | నాతఁడీప్సిత |
| ,, | 9 | నిమూర్పులు | నునూర్పులు |
| ,, | 27 | మానికఁపు | మానికపు |
| 95 | 4 | గర్భకలితాకుని | గర్భకలితార్భకుని |
| ,, | 11 | పూబోదరిండ్లు | పూఁబోదరిండ్లు |
| 96 | 11 | తలిరాకుంబోశులు | తలిరాకుంబోఁడులు |
| 98 | 16 | లేత | లేఁత |
| 99 | 8 | చాల్పు | చాడ్పు |
| 100 | 14 | విహారింపు మండు | విహారిం మచుండు |
| 101 | 2 | బటువజ్రముకురంబన | బట్టువజ్రముకురంబన |
| 102 | 4 | దర్భలమీద | దర్భలమీఁద |
| 103 | 2 | బెట్టిజనియె | బెట్టిచనియె |
| ,, | 27 | జరింపుచుం | జరించుచుం |
| 104 | 1 | దీఫ్సిత | దీప్సిత |
| 105 | 9 | సరోజముఖితినదుమనం | సరోజముఖిమనం |
| ,, | 22 | దీఫ్సితార్గ | దీప్సితార్థ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 105 | 23 | యెటిలో | యెటిలో |
| 106 | 4 | నోచిన | నోఁచిన |
| ,, | 5 | బెనుప | వెనుప |
| ,, | 19 | బెఁపగు | బెంపగు |
| 107 | 9 | క్రమోజ్వలుఁడు | క్రమోజ్జ్వలుఁడు |
| ,, | 26 | పొంపిరిఁవోయెడు | పొంపిరివోయెడు |
| 108 | 9 | కెలనబ్రోగి | కెలనఁబ్రోగి |
| 109 | 8 | నార్వ్రరనిక | నాఱ్వ్రరనీకు |
| ,, | 9 | భీఫ్సిత | భీప్సిత |
| ,, | 10 | గావింపుచు | గావించుచు |
| ,, | 12 | సాబ్రాజ్య | సామ్రాజ్య |
| 110 | 7 | తరూజ్వల | తరూజ్జ్వల |
| 111 | 17 | బట్టి | ఁబట్టి |
| 112 | 1 | సాఁతరోజ్వల | సారతరోజ్జ్వల |
| ,, | 4 | లీలఁగాథాంతరంబునక్ | లీలఁగాఢాంతరంబునన్ |
| ,, | 16 | కస్రవోగిరపుస్రతినాల | కసవోగిరపున్రతనాల |
| ,, | 18 | జీవనోర్ధత | జీవనోద్ధత |
| 113 | 12 | మీక్షింపుచుక్ | మీక్షించుచున్ |
| 115 | 14 | బోఁడికుగలు | బోణికురులు |
| ,, | 18 | లానణ్యంబు | లావణ్యంబు |
| 117 | 11 | బల్కు | వల్కు |
| 119 | 20 | మానసుండపు | మానసుండవు |
| ,, | 24 | జననాథండనియెఁ | జననాథుండనియెం |
| 122 | 12 | చురక | చుఱక |
| 123 | 18 | లక్ష్మిలలితుండు | లక్ష్మిలలితుండు |
| 124 | 14 | బల్కు | వల్కు |
| ,, | 26 | బరతేఁ | బఱతేరఁ |
| 125 | 8 | మాచరింపుచుక్ | మాచరించుచున్ |
| ,, | 10 | బూదేనియ | బూఁదేనియ |
| ,, | 22 | సభినుతించిరి | నభినుతించిరి |
| ,, | 25 | ఎందాక—లందాక | ఎందాఁక—లందాఁక |